# ప్రియ మాధుర్యమే ముందు

# మిగిలినవన్నీ ఆ తరువాతే.....

పరిసరాలను మై మరిపించే పరవశం.
తాజా ఘుమఘుమల ఆనందోల్లాసం.
ప్రియ వక్కపొడి రుచే వేరు. ప్రియ సంస్థ అందించే
ఈ నూతన అనుభూతి ఫ్యామిలి ప్యాక్‌లలో లభించును.




**ప్రియ**
**స్పెషల్**
**సుపారి**

**స్పెషల్ రుచి స్పెషల్ వక్కపొడి—ప్రియ**

Sista's-UEL-92/91 TEL

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✱ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తవహించడం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---------- కూపన్ ----------

సెప్టెంబర్ 'చతుర' నవల 'జీవనపోరాటం'

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరిని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటు తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# చతుర ప్రపంచం

## అంధ ఫొటోగ్రాఫర్

**కళ్లులేకుండా** మీరు ఫొటోలు తీయగలరా? అసంభవమని భావిస్తున్నారుగదూ...? కానీ అది సంభవమేనని నిరూపించాడు అమెరికాకు చెందిన నలభై సంవత్సరాల నాజీరిజ్క్. తను తీసిన 200 పైగా ఛాయా చిత్రాలతో ఇటీవలే కాలిఫోర్నియాలో ఓ బ్రహ్మాండమైన 'ఫొటోఎగ్జిబిషన్‌ను ఏర్పాటు చేసి పలువురి ప్రశంసల్ని చూరగొన్నాడతను.



కళ హృదయగతమైనదనీ, చర్మచక్షువులు లేకున్నా హృదయ నేత్రం ఉన్నందువల్లే తను ఫొటోగ్రఫీలో ఆరితేరగలిగానని చెప్పుకునే నాజీరిజ్క్ తనకు అంధత్వం ప్రాప్తించడమే అదృష్టంగా భావిస్తున్నాడిప్పుడు. సరిగ్గా 14 సంవత్సరాల క్రితం సహోద్యోగితో జరిగిన పోట్లాటలో రెండు కళ్లూ పోగొట్టుకున్నాడు నాజీరిజ్క్. ఆనాడు అలా జరగడం వల్లే 'అంధఫొటోగ్రాఫర్'గా తాను ఈనాడు ప్రపంచఖ్యాతి నార్జించగలిగానని అనుకొంటున్నాడతను. అందుకే తను కళ్లు పోగొట్టుకున్న ఫిబ్రవరి 10న ఏటా ఓ పండుగగా జరుపుకోవాలని నాజీరిజ్క్ నిశ్చయించుకున్నాడు.

కళ్లు పోయిన తర్వాత చాలామందిలా దిగులు పడిపోకుండా జీవితాన్ని సవాలుగా తీసుకొని అచంచలమైన దీక్షతో, పట్టుదలగా ఫొటోగ్రఫీని అభ్యసించాడు నాజీ. ఒడుదుడుకులు ఎన్నివచ్చినా తట్టుకొని నిలబడ్డాడు.

"అంధత్వాన్ని శాపంగా నేనేనాడూ భావించలేదు. కళ్లు లేకపోయినా నా కళ్ల ద్వారానే నేను ప్రపంచాన్ని చక్కగా చూడగలను" అని ఆత్మవిశ్వాసంతో చెప్పేనాజీరిజ్క్ ఈజిప్టులో పుట్టి ప్రస్తుతం అమెరికాలో స్థిరపడ్డాడు.

---

కవర్ పేజి ఫొటోగ్రాఫర్: ఎకీహండా

## నీలిజ్వాలల మిస్టరీ

కట్టుకున్నవాడితీరు, మెట్టినింటిపోరు పడలేక విరక్తిచెంది కిర్సనాయిలు పోసుకుని నిప్పంటించుకున్న ఆడపడుచుల సంగతి మనకి తెలును. అలాగే ఆమధ్య రిజర్వేషన్ల గొడవలలో పెట్రోలు పోసుకొని ఆత్మాహుతి చేసుకున్న విద్యార్థుల గురించి కూడా మనం వినేవున్నాం. అయితే అకారణంగా తమకు తెలియకుండానే హఠాత్తుగా భగ్గున మండి పోయి మరణించినవారి కేసుల గురించి మనలో చాలామందికి తెలియకపోవచ్చు.

1962 మార్చి, 18న గోగిఫావన్ అనే పాశ్చాత్యనర్తకి లండన్‌లోని చిఫర్డ్ ఆడిటోరియంలో ప్రదర్శన ఇస్తూ ఇస్తూనే క్షణాలమీద మాడిమసైపోయింది. రెండువేలమంది ప్రేక్షకుల సమక్షంలో హఠాత్తుగా ఆమె శరీరంనుంచి నీలిరంగు జ్వాలలు లేవడం, ఆమె భగ్గున మండిపోవడం రెండూ కూడా ఎవ్వరూ ఊహించలేనంతవేగంగా జరిగిపోయాయి. అలాంటి కేసు అమెరికాలోని ఉత్తర పెనిజుల్వేనియాకు చెందిన ఓ డాక్టర్ విషయంలోనూ జరిగింది. 92 ఏళ్ల ఆ డాక్టర్‌గారు 1975 జూన్ 21న తన ఇంట్లో కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నవాడల్లా అనూహ్యంగా ఆహుతైపోయాడు. అక్కడికి కొన్ని క్షణాలముందే ఆయనకేదో అనుమానం వచ్చినట్లుంది. బాత్‌రూమ్‌కి వరిగెత్తివవర్ ఓపెన్ చేయబోయేలోగానే బూడిదైపోయాడు. అందాకా ఎందుకు? ఆరేళ్లక్రితం అంటే 1985 ఏప్రిల్ 4న కెనడాలోని ఓ నర్సు డ్యూటీ చేస్తూనే నీలిజ్వాలలకు తగుల్కొని భస్మమైపోయింది.

ఇలాంటి కేసులు ప్రపంచం మొత్తంమీద ఇప్పటివరకూ 200 పైగా జరిగినట్లు తెలుస్తోంది. వీటికి కారణం ఏమిటో ఎవ్వరూ ఊహించలేకపోతున్నారు. శరీరంలోని విద్యుత్ ఒక్కసారిగా హెచ్చుస్థాయిలో పెరిగిపోవడంవ

ళ్ల ఇలాంటివి జరుగుతాయని కొందరు అంటున్నారు. మరికొందరు ఇదంతా అతీతశక్తుల ప్రభావమని వాదిస్తున్నారు. ఇంకొందరు మరో అడుగు ముందుకేసి గ్రహాంతరవానులు విడుదలచేసే శక్తివంతమైన కిరణాలవల్లే ఇవి నంభవిస్తాయని తేల్చిపారేస్తున్నారు.

పాతికేళ్లుగా వీటిపై పరిశోధనలు సాగిస్తున్న డాక్టర్ అర్నాల్డ్ శారీరక ఉష్ణోగ్రత హఠాత్తుగా 1200 డిగ్రీల సెంటీగ్రేడు మించినప్పుడు ఈ ప్రమాదాలు జరుగుతాయని అభిప్రాయపడుతున్నాడు. అయితే గమ్మత్తేమంటే ఈ తరహా ప్రమాదాలలో ఇప్పటివరకూ ఆ వ్యక్తి తప్ప ప్రక్కనున్న వస్తువులేవీ అంటుకోవడంలేదని స్పష్టంగా తెలియవస్తోంది.

## కోటికొక్కరు...!

"ఎవరో వస్తారని ఏదో చేస్తారని..." ఎదురు చూడకుండా తను పనిచేసే ఊళ్లో ఓ పక్కా స్కూలుభవనాన్ని కట్టించి 'శభాష్' అన్పించుకున్నారు ఓ స్కూలు హెడ్‌మాస్టర్.




కర్నాటకలోని చిక్కూర్ గ్రామానికి హెడ్‌మాస్టర్‌గా వచ్చిన లక్ష్మణ్‌వాసనదకు తను పనిచేసే స్కూలు గుళ్లలోను, గుడిసెలలోను నడపడం నచ్చలేదు. ప్రభుత్వానికి మొరపెట్టుకున్నా ఫలితం ఉండదని భావించి ఆ పనికి తనే స్వయంగా నడుం కట్టాడాయన. అప్పటికే ఆయన కృషి ఫలితంగా స్కూలు పిల్లల సంఖ్య కూడా ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోయింది. ఆయనంటే తోటి ఉపాధ్యాయులలోనూ, గ్రామస్తులలోనూ, విద్యార్థినీ విద్యార్థులలోనూ పూజ్యభావం ఏర్పడిపోయింది. దాన్ని ఆసరాగా తీసుకొని ఆ గ్రామీణులందర్నీ కూర్చోబెట్టి స్కూలుభవనం ఆవశ్యకతను నూరిపోశాడు వాసనద.

ఆ ఊరి పాఠశాలలో ఏటా గణపతి ఉత్సవం భారీగా జరిపే ఆనవాయితీ వుంది. దానికి వసూలుచేసే విరాళాలలో సగభాగాన్ని స్కూలు భవనం నిధిక్రింద అందరి అంగీకారంతో అట్టేపెట్టేడు వాసనద. స్కూలు విద్యార్థులు బడితోటలో పండించిన పూలు, పళ్ళు అమ్మి ఆ వచ్చిన మొత్తాన్ని కూడా నిధికి జమచేశాడాయన. అంతేగాక విద్యార్థినీ విద్యార్థులతో రకరకాల సాంస్కృతిక ప్రదర్శనలనిప్పించి దాని




పైన వచ్చిన ఆదాయాన్ని కూడా భవన నిధిలో కలిపేశాడు. ఇంకా గ్రామపెద్దలు, ఉపాధ్యాయులు రకరకాలుగా శ్రమించి నిధులు సమకూర్చారు. ఆ రకంగా ఎనిమిదేళ్ళు గడిచేసరికి రెండు లక్షలకు పైగా డబ్బు సమకూరింది. వెంటనే ఆ సొమ్ముతో ఓ నాలుగు గదుల పాఠశాల భవనాన్ని కట్టించాడు వానసద. దాని నిర్మాణానికి విద్యార్థులు, ఉపాధ్యాయులు అంతా శ్రమదానం చేశారు.

ఆ తర్వాత వానసద ఒక పత్రికను ప్రారంభించాడు. విద్యార్థులనుంచి, ఉపాధ్యాయులనుంచి, గ్రామస్థులనుంచి రచనలు సేకరించి ప్రచురించారందులో. దానిమీద వచ్చిన ఆదాయాలతోనూ, ఇతరత్రా పొదుపు పద్ధతుల ద్వారా సమకూరిన డబ్బుతో స్కూలు భవనానికి అనుబంధంగా ఓ లైబ్రరీని, రీడింగ్ రూమ్‌ని కట్టించాడు వానసద. ఇన్నిపనులుచేస్తూ కూడా తన వృత్తిని నిర్లక్ష్యం చేయలేదతను. అందుకు ప్రతిఫలంగా ఆయనవిద్యార్థులకు హెచ్చుమార్కులు రావడంతో వారు స్కాలర్ షిప్‌లు సంపాదించారు. ఆటపాటల్లో అన్ని స్కూళ్ళపిల్లలకంటే అగ్రభాగంలో నిలబడగలిగారు. ఆయన కృషికి సంతసించిన ప్రభుత్వం 1988లో ఆయనకి 'ఆదర్శ ఉపాధ్యాయుడు' అవార్డునిచ్చి కృతజ్ఞతలు తెలుపుకుంది.

## అంతర్జాతీయ కవలల పండుగ

అమెరికాకు చెందిన జోనాథన్ థా సావెల్‌థాలు కవల సోదరులు. 8 సెకన్ల వ్యత్యాసంతో పుట్టిన ఆ సోదరులు 'అంతర్జాతీయ కవలల రు. అనంతరం కవలలందరూ సరదాగా మారథాన్ రన్ ఏర్పాటు చేసుకున్నారు. 1600 మంది కవలలు పరుగుపందెంలో పరుగెత్తు




పండుగ' పేర 1989 ఫిబ్రవరి 25 వ తేదిన ఓ సమావేశాన్ని ఏర్పాటుచేశారు. ఓహియో నగరంలో జరిగిన ఆ సమావేశానికి ప్రపంచ నలుమూలలనుంచి 1810 జంటలదాకా కవలలు హాజరయ్యారు. ప్రపంచం కవలల్ని ఎలా ఆటపట్టిస్తున్నదీ, జోకులు వేస్తూ ఎలా పరిహసిస్తున్నదీ ఆ సమావేశంలో చర్చకు వచ్చింది. ఆ సమస్యకు రకరకాల పరిష్కారాలు సూచించారు అనుభవజ్ఞులైన కవలపెద్దలు. తర్వాత కవలలందరూ 'కవలల నగరం' పేరిట తమకో ప్రత్యేక నగరాన్ని నిర్మించుకోవాలని కూడా ఆ సమావేశంలో తీర్మానించుకున్నా తుంటే చూసేవారికి చాలా తమాషాగా కన్పించిందట.

విచిత్రమేమంటే! కష్టసుఖాలు చెప్పుకోడానికని ఏర్పాటు చేసుకున్న ఆ సమావేశం కడకు 'కల్యాణవేదిక'గా కూడా మారిపోయింది. తొలిచూపులోనే వలచి, వలపించుకున్న 428 జంటలు పెళ్ళిళ్ళు చేసుకోడానికి సంసిద్ధ మయ్యాయి

# 'తొలిఅడుగు' పై చతుర సమీక్షలు

జూలై నెల 'చతుర'లో ప్రచురితమైన 'విద్యార్థి' నవల 'తొలిఅడుగు'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## అభినందనీయం!

(ప్రథమ బహుమతి రూ.100/-లు పొందిన సమీక్ష)

'తొలి అడుగు' విద్యార్థిలోకపు సమస్యలను సమగ్రంగా ప్రతిబింబించకపోయినా, రచయితకు తెలిసిన పరిధిలోనే అయినా నేటి విద్యా వ్యవస్థలో వేళ్లూనుకున్న సమస్యలను ప్రెజెంట్ చేసే కృషి కనిపిస్తుంది. సంకులసమరంగా మారిన కాలేజీ ఎన్నికలూ, విద్యార్థులను తమ రాజకీయ స్వప్రయోజనాలకు వాడుకొనే (అ)రాజకీయ నాయకులూ, అవినీతిపరులైన అధికారులకూ, ఉద్యోగులకూ, దళారులకూ నిలయాలైన హాస్టళ్లూ, లోపాయకారీ సెలక్షన్లకు ఆలవాలమైన కాలేజీ అడ్మిషన్లూవంటీ సంబంధిత విషయాలన్నింటినీ రచయిత స్పృశించారు. మరోవంక - తప్పుల తడకల ఇంగ్లీష్ మాట్లాడుతూ, ఆడపిల్లలముందు పోజులుకొట్టే కుర్రకారూ, సినిమా నటులపట్ల వెర్రితలలు వేసే విద్యార్థుల అభిమానం, టీనేజ్‌దశలో పరస్పరం ఏర్పడే ఆకర్షణను ప్రేమగా భావించి, ప్రేమపాఠాలు వల్లించే కుహనా ప్రేమికులూ - ఇటువంటి విద్యార్థుల బలహీనతలనూ విమర్శించి, వాటిని నివారించే మార్గాలనూ రచయిత వివరించడం బాగుంది.

అయితే, ఒక్క 'కులం' అనే కోణంనుండే రచయిత రాజకీయాలను చర్చించారు. కాని, ఒక్క కులప్రాతిపదికనే కాకుండా, రాజకీయ పార్టీల ప్రాతిపదికగా కూడా కాలేజీల్లో విద్యార్థి సంఘాలు పనిచేస్తున్నాయి. ప్రతి విద్యార్థి సంఘమూ ఏదో ఒక ప్రధాన రాజకీయ పార్టీకి అనుబంధమే అనేది అందరికీ తెలిసిన సత్యమే. తాజాగా పాఠశాల చదువు పూర్తిచేసి వచ్చిన ఏ రాజకీయ సిద్ధాంతాల అవగాహనా లేని విద్యార్థులు ఉడుకురక్తం ఉరకలేసే వయసులో, ఈ పార్టీల వలలోపడి, ఆ తర్వాత ఈ రాజకీయాల ఊబిలో కూరుకుపోయి, చదువును చట్టుబండలు చేసుకుంటున్నారు. నిజానికి ఈ విద్యార్థి సంఘాలన్నీ తమ తమ ప్రధాన రాజకీయ పార్టీలకు ఏజెంట్లుగా పనిచేయడమే తప్ప, విద్యార్థుల సమస్యలకోసం స్వచ్ఛందంగా పోరాడేవి తక్కువ!

రచయిత చెప్పినట్టు, సమాజపు ఉపరితలంపై పెరిగిన కులవృక్షపు వేళ్లు విద్యాలయాల్లోకి పాకిన మాట నిజమే అయినా, యువజనాన్ని అంతకంటే ఎక్కువగా ప్రభావితంచేసే మరెన్నో అంశాలు నేటి విద్యారాజకీయ వ్యవస్థలో ఉన్నాయి. అయితే రచయిత కేవలం ఒక ప్రైవేటు కాలేజీచుట్టూ అల్లుకున్న సమస్యలను మాత్రమే ప్రస్తావించటంవల్ల అన్ని కాలేజీల పరిస్థితీ ఇలాగే ఉంటుంది అని చెప్పలేం. కేవలం కొందరు వ్యక్తుల అజమాయిషీలో నడిచే విద్యాలయాల్లో కులం వంటి అంశాలు ప్రాధాన్యత వహించటం సహజమే. అందులోనూ చివర్లో సత్యం చెప్పినట్టు విద్యార్థిపై బలవంతంగా రుద్దబడుతున్న అత్యాచారాలూ, రాజకీయాలూ అతడిని వాటిల్లో పాల్గొనక తప్పనిసరి పరిస్థితుల్ని కల్పిస్తున్నాయనే వాదనలో ఎంతో వాస్తవముంది.

అక్కడక్కడా ఇబ్బందికరమైన వాక్య నిర్మాణం తప్పిస్తే, నేటి సమకాలీన విద్యారాజకీయాలపై కొంతైనా వెలుగును ప్రసరింపచేయగలిగిన 'విద్యార్థి' అభినందనీయులు.

-మేడేపల్లి శేషు, న్యూఢిల్లీ.

## 'విశ్లేషణాత్మక నవల'

(ద్వితీయ బహుమతిరూ. 75/-లు పొందిన సమీక్ష)

దారి చెడి, వెన్నెముక పుచ్చి, వ్యవస్థ చచ్చిన సమాజపు చీకటి మూలల్లోంచి వేర్లు తన్నుకుని విశ్వరూపాన్ని ప్రదర్శిస్తోన్న ఒకానొక సమస్యకి - దానిని పెనవేసుకొని విస్తరిస్తోన్న అనేక ఉపసమస్యలకీ పరిష్కారమార్గాన్ని చూపడానికి కనీస ప్రయత్నం చేసిన విశ్లేషణాత్మక నవల 'తొలి అడుగు'. ప్రబోధం ఆవేదనతో కూడినట్టిదైతే దానికి బలం వుంటుంది. నడుస్తూన్న చరిత్రనాధారంగా భవిష్యత్తుని ఆవిష్కరించే బాధ్యత రచయితలది. ఆ ప్రయత్నంలో 'విద్యార్థి' కొంత సఫలీకృతులైనట్లే చెప్పవచ్చు.

ప్రతి అంశాన్ని విశ్లేషించగల, శాస్త్రీయమైన ఆలోచనా విధానం కల్గిన యువతులే గనుక ఉంటే ఇన్ని ప్రేమమరణాలూ, వరకట్నపు చావులూ సంభవించి ఉండకపోవునేమో! 'రేషనల్ థింకింగ్'గల యువతికి ప్రతీక సరిత. అవగాహన మొదటి మెట్టు. విశ్లేషణ రెండవ మెట్టు. అప్పుడు 'జీవఫలం చేదువిషం' కాకపోవచ్చు. మానవుడు నిత్యసత్యాన్వేషి కావాలి. 'తరచితేనేగాని వెన్న పుట్టదు' అనే భావం ప్రస్ఫుటమౌతుంది మౌర్యం పాత్రను చూస్తే! ఒక చిన్న యూనిట్ అయిన 'కాలేజీ'నించి విశాలమైన సమాజంవైపు దృష్టిసారించడానికి ఎన్నో సంఘటనలు కారణమవుతాయి. రాజకీయ, రాబందుల రాజ్యంలో కులరక్కసి వికృత పదఘట్టనలు ఈ నవలనిండా కనిపిస్తాయి.

'సమస్యని వర్ణించడంతో సరిపెట్టుకోక పరిష్కారం సరిగా ఉండేటట్లు చూపించాలి' అని రచయిత అంటారు. ఈ అవ్యవస్థిత సమాజానికి సమయం వచ్చినప్పుడు 'సర్జరీ' కూడా అవసరమనే నిర్ణయానికొస్తారు. ఆత్మరక్షణ కోసం ఆయుధం పట్టడం, సమాజంలో మౌలికమైన మార్పుకి కలం పట్టడం పరిష్కారంగా చూపిస్తారు. సామాన్యులకి ఆచరణ సాధ్యమైన పరిష్కారమూ ఇదే - ఆలోచించాలి. దీర్ఘకాల రోగాలకు మందెక్కడుంది అని నిరాశతో కృంగిపోయేవారికి ఆ మందు మీదగ్గరే ఉందని చెప్పగలిగే సాహసంగల డాక్టర్లెంతమంది ఉన్నారు? ఈ సమాధానం నచ్చకపోవచ్చు. కాని ఇదే నిజమైతే! అయితే 'రచయిత' తనే వ్యక్తిగా రచనలో చొరబడడంవలన విషయ వివరణ ఎక్కువయి అప్పుడప్పుడూ బోర్ కొట్టడం కద్దు. ఏదైతేనేం ఒక మంచి నవల ఇన్నాళ్లకు మన చేతుల్లో.

-యస్.కె. పద్మనాభన్, విజయనగరం.

## రిలీఫ్

(తృతీయ బహుమతిరూ. 50/-లు పొందిన సమీక్ష)

సమాజంలోని విద్యాలయాల్లో కులతత్వం, కుహనా రాజకీయాలు కలుగజేస్తున్న హానికర ప్రభావాలను, దిగజారుతున్న ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక వ్యవస్థ దుష్పరిణామాలను సంక్షేమ హాస్టళ్ల పని తీరుతెన్నులు గూర్చి వాస్తవరీతిలో తెలియజెప్పే సమగ్ర నవల 'తొలి అడుగు'.

ఉజ్వల భవిష్యత్‌పై ఎన్నో ఆశలు పెట్టుకొని, కాలేజీలలో 'తొలి అడుగు' పెట్టిన విద్యార్థులకు ఎదురయ్యే చేదు అనుభవాలు, వారి లేత మనసులను భయభ్రాంతులకు గురిచేసి అయోమయ పరిస్థితిలోకి నెట్టివేస్తున్నవి! నేడు విద్యాలయాలలో భయవిద్వేషవాతావరణం నెలకొన్నది. అధ్యాపక, విద్యార్థులమధ్య సంబంధాలు వక్రమార్గంలో పయనిస్తున్నవనుటకు విషయబాబు, శైలజలే మంచి ఉదాహరణ. కాలక్రమేణా విద్యార్థులలో క్రమశిక్షణ, విద్యపట్ల ఆసక్తి సన్నగిల్లుతోంది. సాంఘిక వ్యవస్థ దిగజారడం, వ్యక్తిలో విపరీతధోరణులు తలెత్తుటకు కారణమౌతోంది.

నేడు సమాజంలోని అన్ని రంగాలలో కులతత్వం వెర్రితలలు వేస్తూ విద్యార్థి జీవితంపై అనూహ్య ప్రభావాలకు కారణమవుతోంది. విద్యార్థులలో ఆవేశంపాలే ఎక్కువ - అవగాహన, ఆలోచనా ధృక్పథం తక్కువ. స్వార్థ, అవకాశవాద రాజకీయ నాయకులు వీరి లేత మనసులలో కులతత్వాన్ని రెచ్చగొట్టి తమ ప్రయోజనాలను నెరవేర్చుకుంటున్నారు. కాలేజీ ఎలక్షన్‌లలో ఒక వర్గానికి మద్దత్తునిచ్చి ముఠాలు ఏర్పరచి ఐక్యతకు విఘాతం కలిగి

స్తున్నారు. కులతత్త్వం రెచ్చగొట్టటంవలన విద్వేషాలు ఏర్పడి చిలికి, చిలికి గాలివానలా తయారై వారి జీవితాన్ని నాశనం చేస్తున్నాయి. ఇది సమాజంలో అశాంతికి, ఉగ్రవాదానికి, విచ్ఛిన్నకర సంస్కృతికి పరోక్షంగా దోహదపడుతోంది.

సూర్యం విశిష్ట వ్యక్తిత్వం, నూతన సమాజ నిర్మాణానికై అతని పోరాటం, నిర్దిష్టమైన నేటి యువతకు గొప్ప స్ఫూర్తినందిస్తుంది. 'విద్యార్థి-రాజకీయాలు', 'ప్రేమ' గూర్చి అతను వెలిబుచ్చిన అభిప్రాయాలు అతని మానసిక పరిపక్వతకు సంకేతం. అతని మానవత్వం, ప్రాణత్యాగానికి సిద్ధపడటం - నేటి యువకులు ఆదర్శం చేసుకోవాలి. సరితలో సత్ప్రవర్తన, స్నేహానికి విలువనిచ్చే ఉన్నత హృదయం మనల్ని ఆకట్టుకుంటాయి. పరిస్థితులను అధిగమించలేకపోయినా, ఆమెలోని హుందాతనం, వివేకం, సరళత్వం, మెచ్చుకోదగినది. శివాజి, అరుణ్ దౌర్జన్యశక్తులుగా మారడం కుహనా రాజకీయనాయకుల ప్రభావమే. శ్రీవెన్నెన్, అతని అనుచరులు సమాజ వికృతత్వానికి ప్రతీకలు.

ఊహాజనిత ప్రేమకథలు, సస్పెన్స్ నవలలు చదివి విసుగెత్తిన తెలుగు పాఠకులకు ఈ నవల ఒక రిలీఫ్. పాఠకులచే చదివించి, ఆలోచింపచేసి, జాగృతిని కలిగించేదిగా ఉండేది ఉత్తమ సాహిత్యం. మేడిపండు లాంటి నేటి సమాజపు అంతరంగాన్ని బట్టబయలుచేసి, ఇటు విద్యార్థులకు - అటు ప్రభుత్వానికి కర్తవ్యాన్ని గుర్తుచేసిన ఉత్తమ సాహిత్య విలువలుగల ఒక ఉత్తమ నవల ఇది.

-ఉరిలు శ్రీనివాసరావు, చెట్టుపాదిలాం.

## ప్రబోధాత్మకం

*(రూ. 25/-లు పొందిన సమీక్ష)*

'తొలి అడుగు' నవల ప్రబోధాత్మకంగా నేటి సమాజానికి దర్పణంలా ఉంది. ఇందులో కాలేజీ వాతావరణం, విద్యార్థుల సాధకబాధకాలు, హాస్టళ్లలోని విద్యార్థుల దుర్భర పరిస్థితులు మొదలైన చాలా విషయాల గురించి రచయిత చక్కగా వివరించారు. విషయం ఆసక్తికరమైనది. ఇవన్నీ ఈనాడు చాలామంది ఎదుర్కొంటున్న సమస్యలే కనుక నవల చివరిదాకా చదివిస్తుంది.

రచయిత నిజాయితీగా ప్రతి విషయాన్ని చర్చించి పాఠకులను ఆలోచింపజేసి చివరకు పరిష్కారాన్ని సూచిస్తారు. కులాల గురించి రచయిత చేసిన వ్యాఖ్య ఎన్నటికీ మరపురానిదిగా ఉంది.

నవలలోని హీరో సూర్యం ధీరోదాత్త నాయకుడిగా చిత్రించబడ్డాడు. ధైర్యం, సాహసం, సహనం మొదలుగాగల అన్ని మంచి, గొప్ప గుణాలు అతడిలో రంగరించబడ్డాయి. కాలేజీలో చదివే కుర్రాడిలో, అంత చిన్నవయస్సులో అంతటి సహనం, విచక్షణ, విజ్ఞానం, అన్నిరకాల పరిస్థితులను, అన్ని విషయాలను అర్థంచేసుకోగల సామర్థ్యం ఉండటం సహజత్వానికి దూరంగా ఉంది. ఆ విషయాలు చెప్పటానికి వేరే ఇంకో పాత్రను రచయిత ఎన్నుకుంటే బాగుండేది. మిగతా పాత్రలు... రవి, వేణు, సారధి, శివాజీ, అంకినీడు, సరిత, సంధ్య, రవళి అందర్నీ రచయిత చక్కగా చిత్రించారు.

వ్రాసే విధానంవల్ల రచయిత మరికొంత శ్రద్ధ తీసుకుంటే పాఠకులను ఈ నవల ఇంకా బాగా ఆకట్టుకునేదేమో! సుదీర్ఘమైన వివరణలు, చెప్పిందే మళ్లీ మళ్లీ చెప్పడంలాంటి చిన్న లోపాలను సవరించుకుంటే రచయిత ఇంకా మంచి రచనలు చేయవచ్చును.ఏది ఏమైనా 'తొలి అడుగు' మెచ్చదగ్గ నవల.

-వి.రామలక్ష్మి, బెంగుళూరు.

## ఉత్తమ భావ సంపుటి

*(రూ. 25/-లు పొందిన సమీక్ష)*

ప్రస్తుత సమాజంలో విద్యార్థిలోకాన్ని పట్టి పీడిస్తున్న అనేక సమస్యల్ని నిర్మొహమాటంగా

చర్చించిన ఒక మంచి నవల 'తొలి అడుగు'. విద్యార్థులైన యువతకు ఉండవలసిన, ఉండగూడనటువంటి లక్షణాలను పరిశీలించి, తర్కించి, ఒప్పించే రీతిలో అందజేసిన రచయిత అభినందనీయులు.

'సూర్యం' పాత్రద్వారా విద్యార్థిలోకానికి ఉపయోగపడే అనేక మంచి భావాలను అందించారు. "విద్యార్థులు రాజకీయాలకు దూరంగా ఉండే ప్రశ్నే లేదు. అయితే అవి మంచిగా చదువుకునేందుకు డిమాండుచేసే రాజకీయాలు, కులం చీడను తుడిచేసే రాజకీయాలు అయ్యుండాలి" అని చక్కగా వివరించారు. "నాయకత్వం ఒక మత్తు, ఒక మందు, ఒక నిషా" అనే నగ్నసత్యాన్ని తెలియచెప్పారు. కులానికి ప్రాతిపదిక అయిన కులవృత్తులను చేపట్టడం పూర్తిగా తగ్గిపోతున్నా 'కులవ్యవస్థ' బిగిసిపోతోంది అంటూపొందిన ఆవేదన ఆలోచింపచేసేదిగా ఉంది. 'ప్రేమ' గురించి యిచ్చిన వివరణ ఊహాలోకాల్లో తేలిపోయే ప్రేమికుల్ని ఆపి ప్రశ్నించేదిగా ఉంది. అలాగే వైవాహిక జీవితాన్ని గురించి చెప్పిన భావాలు కూడా! "అంతరాంతరాల్లో అమ్మాయిలంటే తేలికభావం జీర్ణించుకుపోయిన సంస్కృతిని నాశనం చేయాలి" అనేది యువత తక్షణ కర్తవ్యంగా తోస్తుంది. వరకట్నం, కులతత్వం మొదలగు సమస్యల పరిష్కారం సమాజ పునరుద్ధరణ ద్వారానే సాధ్యమవుతుందని తెలుపుతూ అందుకు నడుంబిగించినవారిని ఈ సమాజం ఎలా తరిమికొడుతూందో కూడా వివరించారు. అయినప్పటికీ వెనుదిరుగకుండా శ్రమించే 'సూర్యం' పాత్ర ద్వారా యువతను ఉద్బోధించిన రచయిత అభినందనీయులు.

కొత్తగా కాలేజీలో చేరినవారిలోని బెరుకును రవి పాత్రద్వారా చెప్పిన తీరు, హాస్టల్సులోని దుర్భర జీవితాన్ని వివరించిన తీరు, సమాజంనుండి దావరికానికి గురయి ఒక్కసారిగా స్వేచ్ఛను పొంది, దానిని దుర్వినియోగ పరచే కుర్రకారు గురించి అనిల్ పాత్రలో ఎత్తిచూపిన తీరు బాగున్నాయి.

మొత్తానికి ఈ నవల ఒక ఉత్తమ భావ సంపుటి అనడంలో అతిశయోక్తిలేదు.

-కె.యస్.ఎన్.యస్. రామప్రసాద్,
ధర్మాజిగూడెం.

## వాస్తవ రూపకల్పన

(రూ.25/-లు పొందిన సమీక్ష)

నేటి మన సమాజంలో విలయతాండవం చేస్తున్న సాంఘిక అసమానతలూ, వర్గవిభేదాలూ, కుల రాజకీయాలూ, అధికార దురన్యాయాలూ, హింసాదౌర్జన్యకాండలూ వంటి దుర్భర స్థితిగతులకు వాస్తవ రూపకల్పన చేస్తూ, ఆ పరిస్థితుల వెనుకగల కారణాలను విశ్లేషిస్తూ, విద్యార్థిలోకంపై ఈ విషమ పరిస్థితులు చూపగల వికృత ప్రభావాలనూ జాతి భవిష్య జీవన స్రవంతిపై ఈ పోకడల విపత్కర పరిణామాలనూ గురించి హెచ్చరిస్తున్న 'తొలి అడుగు' ఒక మంచి నవల.

ఇటీవలి కాలంలో ఆంధ్రదేశంలో జరిగిన, జరుగుతున్న రాజకీయ దుర్ఘటనలకూ, వర్గవివక్షలకూ, వర్గపోరాటాలకూ, సాంఘిక అత్యాచారాలకూ ఈ కథలోని సంఘటనలూ, పాత్రలూ సజీవదర్పణాలు. ఈ కులాల కుమ్ములాటల్లో, వర్గాల సంకుల సమరంలో అన్నెంపున్నెం ఎరుగని అమాయక విద్యార్థుల జీవితాలూ, విద్యాసంస్థలూ, సాంఘిక సంక్షేమ సంస్థలూ, సంఘంలోని అన్ని తరగతులవారూ ప్రత్యక్షంగా, పరోక్షంగా ఎలా బలి అవుతున్నారో చిత్రీకరించేందుకు ఎన్నుకోబడిన పాత్రలూ, సంఘటనలూ అన్నీ వాస్తవ జీవితంలో మనకు బాగా పరిచయమైనవే.

చివరిలో ఈ హింసా, దౌర్జన్య పోకడలకు విరుద్ధంగా సూచించదలచుకొన్న పరిష్కార మార్గాలు కొంత అయోమయాన్ని సృష్టించి, రచయిత ఉద్దేశ్యాలను అస్పష్టంగా వదిలివేశాయి.

సాహిత్యం వర్తమాన చరిత్ర, సంస్కృతులను అక్షరనిక్షిప్తం చేస్తుంది, చేయాలి. భవిష్య నిర్మాణానికి తనవంతు సూచనలూ, మార్గదర్శక పరిష్కారాలూ సాహిత్యం, సమాజం ముందు ప్రతిపాదించితే, ప్రయోజనాత్మకతను సంతరించుకొంటుందా రచన. ఈ రెండు నిర్దేశిత ప్రయోజనాలనూ సాధించుతూ, పాఠకులను ఆలోచింపచేసేలా, స్ఫూర్తి ప్రేరకంగా, చేయబడిన ఈ రచన, రచయిత, బాధ్యతాయుత సృజనాశక్తిని ప్రతిబింబిస్తోంది.

-రమేష్‌చంద్ర విద్యాశేఖర్, హైదరాబాద్.

# చతుర

సంపుటి: 14 సంచిక: 8 సెప్టెంబర్ 1991

జీవితమంటే అది సదా ఒక అంతులేని పోరాటమే! ప్రతివారూ ఈ బరిలోకి దిగవలసిందే!! ఇందులో లక్ష్యసాధన కోసం ఏటికి ఎదురీది, నిర్విరామంగా పట్టుదలతో కృషిచేసి విజయం సాధించేవారు కొందరు... ఓడిపోయి నిరాశా నిస్పృహల్లో మునిగేవారు మరికొందరు... 'అందని ద్రాక్షపళ్లు పుల్లన' చందంగా సరిపుచ్చుకునేవారు ఇంకొందరు. విచిత్రంగా కొందరికి ఈ పోరాటంలో ఎక్కువ శ్రమ పడకపోయినా అందలాలు అందివస్తాయి. మరికొందరికి ఎంత ప్రయాసపడినా అదృష్టం చేతికి దొరకదు.

అతని ప్రమోషన్ ఇంటిల్లిపాదికీ ఓ 'అవసరం'గా పరిణమించింది. దానికోసం పై అధికారుల్ని ప్రసన్నం చేసుకునే ప్రయత్నంలో అతనికి అవమానాలు, అవహేళనలు, అప్పులు, నిష్ఠురాలు ఎదురయ్యాయి. భార్యాబిడ్డలకి సైతం దూరమయ్యాడు.

ఇంత చేసినా అతని ప్రయత్నాలన్నీ అసమర్థుని పోరాటంగానే మిగిలిపోవడానికి కారణం ఏమిటి? ఫలితంగా అతను తీసుకున్న నిర్ణయాలు ఏమిటి? చివరికి అతనేమయ్యాడు?

మధ్యతరగతి మానవుని కష్టసుఖాల్ని, సమస్యల్నీ, బలహీనతల్నీ సజీవంగా చిత్రిస్తూ, సునిశితమైన హాస్యాన్ని జోడించి నవ్వులు పండించిన

కాశీ విశ్వనాథ్ నవల

# జీవన పోరాటం

ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల

"నువ్వు మోదువల్లి అడవులకెందుకెళ్ళావు?"

"తపస్సు చేస్కోడానికెళ్లేను"

జడ్జీతోసహా కోర్టులో వున్నవాళ్లంతా ముద్దాయి చెప్పిన సమాధానానికి పగలబడి నవ్వారు.

★ ★ ★

ఆ ముద్దాయి పేరు ఎలకలపూడి చిలకలదాను. పేరుకి తగ్గట్టుగా అతని రూపం కూడా చిత్రంగానే వుంది. పొడవుగా, సన్నగా వున్న అతని శరీరంమీద కాషాయవస్త్రాలు హేంగర్‌కి తగిలించిన దుస్తుల్లా వ్రేళ్లాడుతున్నాయి. నాలుగు అంగుళాలు దాటి పెరిగిన గెడ్డం, సినిమాల్లో హీరో మారువేషం వేసుకున్నప్పుడు పెట్టుకునే గెడ్డంలా అందంగా వుంది. అతని తెల్లని నుదుటిమీద మెరుస్తున్న ఎర్రటి సింధూరపు బొట్టు అతన్ని సర్వసంగపరిత్యాగిలా కాకుండా, కొత్తగా చేతబడి నేర్చుకుంటున్నవాడిలా అందరికీ పరిచయం చేస్తోంది.

కోర్టులో అతని గురించి, పిల్లల్ని ఎత్తుకుపోయి అమ్మవారికి బలిఇచ్చే దొంగసాధువని ఆరోపించలేదు. భవిష్యత్తు చెప్తానని బోర్డు కట్టుకున్న బోగస్ స్వామీజీ అని అభియోగం చేయలేదు. దొంగనోట్లు అచ్చుకొట్టే దగుల్బాజీ అని కూడా ఆరోపణ చేయలేదు.

మరేమని ఆరోపించేరు?

"ఇతను మోదువల్లి అడవినించి గంధంచెక్కలు దొంగతనంగా ఎత్తుకుపోయి వ్యాపారం చేస్తున్న స్మగ్లర్" అని.

"నేను స్మగ్లర్ని కాదు. నేనో మునీశ్వరుణ్ణి. బ్రతికున్నంతకాలం మనశ్శాంతి, మరణం తర్వాత మోక్షం పొందడానికి ఆ అడవిలో తపస్సు చేసుకుంటున్నాను" అని అతనంటున్నాడు.

వాదన ప్రారంభమయింది.

"ఈ ముద్దాయి ఊరుకొక పేరు మార్చుకుంటూ దొంగవ్యాపారాలు చేసే స్మగ్లర్. గత సంవత్సరకాలంగా మోదువల్లి అడవుల్నించి గంధంచెక్కల్ని భారీఎత్తున దొంగతనం చేస్తూ పోలీసులకి పట్టుబడకుండా తిరుగుతున్నాడు. ఈ నెల పదవతారీఖున పోలీసులు వేసిన నిఘాలో ఈ ముద్దాయి ఓ లారీనిండా గంధంచెక్కలు పట్టుకెళ్తూ రెడ్‌హేండెడ్‌గా దొరికిపోయేడు"

పబ్లిక్ ప్రాసిక్యూటర్ తన ఆరోపణని పూర్తి చేసేడు.

జడ్జీగారు కూడా దైవభక్తులే అయినా, అడవికెళ్లి తపస్సు చేసుకుంటున్నానని చెప్తున్న చిలకలదాను మాటని మాత్రం నమ్మలేకపోతున్నారు.

"నీ తరపున లాయరు ఎవరైనా వున్నారా?" అని అడిగేరు.

"లేరు. నాకు లాయరు అక్కర్లేదు కూడా. నా తరపున ఆ భగవంతుడే వాదిస్తాడు" అన్నాడు చిలకలదాను ఎంతో ఆత్మస్థైర్యాన్ని ప్రదర్శిస్తూ.

"భగవంతుడీమధ్యన డిఫెన్సు లాయరుగా కూడా పనిచేస్తున్నాడన్నమాట. వెరీగుడ్. మీ లాయరుగార్ని రమ్మనండి" అన్నాడు పీ.పీ. బోలెడంత వెటకారాన్ని తన మాటలకి జోడిస్తూ.

కోర్టులో మళ్లీ జనం నవ్వేరు.

నవ్వడం తన వృత్తిధర్మానికి విరుద్ధం కాబట్టి జడ్జీగారు వస్తున్న నవ్వుని అవుచేసుకున్నారు.

'అతనింతవరకు చాలామంది నేరస్థుల్ని విచారించి శిక్షలు విధించేడు. అందులో, అడవుల్నించి కలప దొంగిలించిన నేరస్థులు కూడా వున్నారు. 'అడవిలో కెందుకు వెళ్లేవు?' అని అడిగినప్పుడు వాళ్లంతా ఏవేవో కారణాలు చెప్పారుగాని, తపస్సు చేస్కోడానికెళ్లానని ఎవరూ చెప్పలేదు. అలా చెప్పిన మొదటి ముద్దాయి ఇతనే.

అందుకే జడ్జీగారిక్కూడా ఈ కేను ఆసక్తికరంగానే వుంది.

"మీరు దేనికోసం తపస్సు చేశారు?" జడ్జీ నవ్వకుండా ఉండడానికి ప్రయత్నిస్తూ అడిగాడు.

"మీరు దేనికోసం ఉద్యోగం చేస్తున్నారు? జీతం కోసం. అలాగే నేను దేవుడు అనుగ్రహం సంపాదించాలని తపస్సు చేసేను" దాను చాలా ధాటీగా జవాబు చెప్పేడు.

"దైవానుగ్రహం కోసమే అయితే, ఆ ప్రార్థనేదో ఇంట్లో వుండే చేస్కోవచ్చుగా"





"ప్రతిపని చెయ్యడానికీ ఓ స్థలమూ, ఓ పద్ధతి వుంటుంది సార్... ఈ లాయర్లు ఇంట్లో కూర్చుని కేసులు వాదించగలరా? వారు తప్ప నిసరిగా కోర్టుకొచ్చే వాదించాలి. ఎందుకంటే వాదనలకి, విచారణలకి, తీర్పులకి కోర్టు అంటూ ఓ ప్రత్యేకమైన స్థానం వుంది కాబట్టి అక్కడికి రాకతప్పదు. భవబంధాలు తెంచు కుని ముక్తికోసం తపస్సు చెయ్యాలంటే అది నిర్మానుష్యంగా వుండే అడవుల్లోనే చెయ్యాలి. పూర్వకాలంలో విశ్వామిత్రుల్లాంటి రాజులు కూడా రాజ్యాలు వదిలిపెట్టి అడవుల్లోనే తప స్సు చేసేరుగాని, అంతఃపురాల్లో చెయ్యలేదు. నేను అడవికెళ్లి తపస్సు చేసుకుంటుంటే, నన్నో దొంగగా భావించి అరెస్టు చెయ్యడం పోలీసుల తొందరపాటుకి నిదర్శనం. మీరో విషయం క్లియర్ చెయ్యాలి. నేను అడవికె ళ్లడం తప్పా? లేక తపస్సు చేస్కోడం తప్పా?"

అతను తెలుగులోను, ఇంగ్లీషులోను దడద డమంటూ మాట్లాడుతుంటే కోర్టులో క్రమంగా గంభీరత చోటుచేసుకుంది.

పి.పి.గారు మళ్లీ లేచి మాట్లాడేరు- "మరో తొమ్మిది సంవత్సరాల్లో ఇరవైఒకటో శతాబ్దంలో కి అడుగుపెట్టబోతున్నాం. ఇలాంటి సమ యంలో త్రేతాయుగం, ద్వాపరయుగాల్లో మాది రిగా అడవుల్లో తపస్సు చేసుకుంటున్నానని ఓ నేరస్థుడు చెబితే నమ్మే మూర్ఖులు ఎవరూ లేరు" అంటూ ఆయన ఓ పదినిమిషాలపాటు పాత పద్ధతుల్ని విమర్శించేడు. మరణం తర్వాత మోక్షం సంపాదించడానికి ప్రతి కుండగా నిర్వర్తించవలసిన బాధ్యతల్ని గాలికి వదిలేసి తపస్సుకి దిగడమే ఓ మీనింగ్‌లెస్ జాబ్ అంటూ ఆవేశపడ్డాడు. ఫైనల్‌గా ఆయన దేవుడి ఉనికిని అనుమానిస్తూనే మాట్లాడేడు. దేవుడి ఉనికే అనుమానమైనప్పుడు, ఇంకా ఆయన కోసం తపస్సు చేయడం ట్రాష్ అనేశా డు.

చిలకలదాసు ఆ వాదన విని ఆవేశపడ్డాడు.

"దేవుడిమీద మీకంత నమ్మకం లేనప్పుడు మీరు సాక్షులచేత భగవద్గీతమీద ఎందుకు ప్రమాణం చేయిస్తున్నారు సార్? అది కృష్ణావతా రంలో విష్ణుమూర్తి చెప్పిందేగాని మరో లాయరె వరో చెప్పింది కాదుగదా. మీకు ఆ కృష్ణుడిమీద నమ్మకముండబట్టే ఇప్పటికీ ఆ గ్రంథాన్నే కంటిన్యూ చేస్తున్నారు. లేకపోతే జ్ఞానపీఠ్ ఎవార్డు పొందిన ఏ గ్రంథంమీదో ప్రమాణం చేయించివుండేవారు"

పి.పి. మళ్లీ ఆవేశంగానే అడిగాడు- "సరే... మీరు చెప్పినట్టూ మీరు దేవుడికోసమే తపస్సు చేశారనుకుందాం. మరి... మీకు దేవుడు ప్రత్య క్షమయ్యాడా?"

"మీరు పుట్టగానే లాయరైపోయేరా? లాయ రవగానే పబ్లిక్ ప్రాసిక్యూటర్ అయిపోయేరా? ప్రతిదానికి కొంత టైం పడుతుందిగదా. తప స్సు చేయడమూ అంతే సార్. నేను తపస్సు స్టార్ట్ చేసిన నాలుగు నెల్లకే పోలీసులు నన్ను అరెస్టు చేసేశారు. అయినా నేను తపస్సు చేస్కుంటున్నానని ఇంత ఫ్రాంక్‌గా చెప్తున్నా నమ్మకుండా అసలు దేవుడి తాలూకు ఉనికినే మీరు డౌట్ చేస్తున్నారేవిటి సార్? పూర్వీకులు మూర్ఖులు కాబట్టి, దేవుడి గురించి తపస్సులు చేయడం, మతాలవారీగా దేవుళ్లని విభ జించడం, ఆ మతాలమధ్య యుద్ధాలు జర గడం సంభవించేయనుకుందాం. ఇప్పుడు ఈ నైన్టీన్‌నైన్టీఒన్‌లో జరుగుతున్న అయోధ్య రామ మందిరం, బాబ్రీమసీదుల గొడవ సంగతేవిటి సార్? దేశంలో లక్షాతొంభై సమస్యలు భగభగ మంటూ మండుతున్నప్పుడు అవన్నీ వదిలిపె ట్టి, ఈ దేవుడికి గుడికట్టే సమస్య అన్నింటిని డామినేట్ చెయ్యడం ఏవిటి సార్? అలా డామినేట్ చేసిందంటే కారణం ఏవిటి? కొంత మంది మేధావులు, దేశంలోని బర్నింగ్ ప్రాబ్ల మ్స్‌తో సమానంగా దేవుడి గుడి సమస్యని కూడా పరిగణిస్తున్నారు కాబట్టి.మరి ప్రార్థనలు చెయ్యడం మీ దృష్టిలో మూర్ఖత్వమైతే, దేవాల యాలు అజ్ఞానాన్ని పెంచే మందిరాలే అయితే, మీ న్యాయస్థానానికున్న పవర్స్ ఉప యోగించి దేశంలోని దేవాలయాల్ని ఎందుకు మూయించడంలేదు సార్?"

చిలకలదాసు వాగ్ధాటికి, హేతువాదానికి అందరూ ఆశ్చర్యంగా, ఆసక్తిగా చూస్తున్నారు. అతనే మళ్లీ అన్నాడు- "నా మనసు ఆందోళన కి గురైంది. ఆఫీసులో గొడవపడితే ఇంటికొచ్చి పెళ్లాంబిడ్డల్తో ఆ గొడవ గురించి చెప్పుకుని మనశ్శాంతి పొందుతాం. ఇంట్లో గొడవలు చెలరేగితే ఆఫీసుకెళ్లి ఎవర్తోనైనా చెప్పు

కుంటాం. కానీ నా బ్రతుకు రెండు టీముల చేత తన్నులుతినే ఫుట్‌బాల్ అయిపోయింది సార్. దాంతో మనశ్శాంతిని వెదుక్కుంటూ మోదుపల్లి అడవులకెళ్లి తపస్సు ఆరంభించేను''

జడ్జీగారికి చిలకలదాసుమీద జాలి కలిగింది. అది న్యాయస్థానమని కూడా భయపడకుండా, నిర్భయంగా నగ్నసత్యాలు చెప్పగలుగుతున్నాడంటే, నిజంగా అతని మనసు ఎంతో ఆందోళనకి గురైవుండాలి. ఓసారి టైము చూసుకున్నాడు. కేసు వాయిదా వేసేద్దామా అని ఓ క్షణంపాటు ఆలోచించాడు. కానీ ఆరోజు విచారణ చెయ్యాల్సిన కేసులు కూడా ఎక్కువ లేవు. చిలకలదాసు గురించి మరికొన్ని వివరాలు తెల్సుకుందామనుకున్నాడు.

''మిమ్మల్ని ఏ పరిస్థితులు ఆందోళనపరిస్తే మీరు అడవికెళ్లి తపస్సు చెయ్యాలనుకున్నారో, ఆ పరిస్థితుల్ని కాస్త వివరిస్తారా?'' అన్నాడు జడ్జి.

''కాస్త వివరించడం ఏవిటి సార్... ఇన్నాళ్లకి నన్నావిషయాల గురించి అడిగే పెద్దమనిషి మీరు కనిపించేరు. మీరు ఓపిగ్గా వింటానంటే, నా గురించి నేను సవివరంగా మనవి చేస్తాను'' అంటూ చిలకలదాసు తన ఆత్మకథని చెప్పనారంభించేడు.

''నా పేరు ఏలకలపూడి చిలకలదాసని మీ అందరికీ తెలుసు. నేను రామ్‌జీ అండ్ లక్ష్మణ్‌జీ ప్రైవేట్ కంపెనీలో సూపర్నెంటుగా పనిచేస్తున్నాను. రజస్వల అయిన ఆడపిల్ల పెళ్లిచేస్కుని ఇల్లాలిగా మారాలని, ఇల్లాలిగా మారాక ఓ బిడ్డతల్లిగా మారాలని ఆశపడుతుంది. అది పేరాశ కాదు. జీవితంలో ప్రమోషన్ కోరుకోవడం అనిపించుకుంటుంది. నేనూ అలాగే ప్రమోషన్ కోరుకున్నాను. కానీ గత పదేళ్లనుంచి, పాతేసిన రాటలాగా ఆ పోస్టులోనే వుండిపోయాను తప్ప, మేనేజరుగా ప్రమోషన్ మాత్రం పొందలేకపోయేను''

అంటూనే చిలకలదాసు విపరీతంగా దగ్గేడు. అతనికో గ్లాసు నీళ్లు అందించేరు. నీళ్లు తాగాక మళ్లీ చెప్పడానికి ప్రయత్నించేడు.

చెప్పింది చెప్పినట్లు రాస్తే గ్రంథం చాలా పెద్దదైపోతుంది. కనుక అతని జీవితకథని మీకు చెప్పేభారాన్ని భుజాన వేస్కుని ఇక్కణ్ణించి నేనే మీకు వివరిస్తాను.

★ ★ ★

మానవుల తలరాతల్ని బ్రహ్మదేవుడు రాస్తాడంటారు. కానీ, అందరికీ, ఆ విధాత రాయడేమోనని నా అనుమానం! పని మరీ ఎక్కువగా వున్నప్పుడు కొందరు అసిస్టెంట్లకి కొన్ని బొమ్మలు ఇచ్చి, వాళ్ల రాతల్ని మీరే రాసెయ్యండి, నేను సంతకం చేసేస్తానని ఆ బ్రహ్మదేవుడు అన్నప్పుడు ఆ అసిస్టెంట్లు ధైర్యంగా వాళ్ల అజ్ఞానాన్ని ప్రదర్శిస్తూ వాళ్లకి తోచింది రాసేస్తుంటారు. అదిగో అలాంటి సమయంలో ఎవడో తలమాసిన అసిస్టెంటు రాసిందే- చిలకలదాసు తలరాత.

గవర్నమెంటులో ఉద్యోగం దొరక్క, ప్రైవేటు కంపెనీలో గుమాస్తాగా జాయినయ్యేడు. ఉద్యోగం ఏదైతేనేం, తన తెలివితేటల్తో పంజాబ్ మెయిల్లా కొట్టుకెళ్లిపోయి, పది సంవత్సరాల్లో ఆఫీసర్ పోస్టులోకి వెళ్లిపోనా? అనుకున్నాడు. కానీ పదిదాటి, ఇరవైదాటి, ముప్ఫయి సంవత్సరాలు గడిచిపోయినా, అతని ప్రయాణం పంజాబ్ మెయిల్లా దూసుకుపోకుండా, కాకినాడ, తిరుపతి పేసింజర్లా కుంటినడకతోనే సాగుతోంది. అలా నడిచి నడిచి సూపర్నెంటు పోస్టు దగ్గర చతికిలబడిపోయింది.

ప్రతి కథకీ ఓ కొసమెరుపున్నట్టు, ప్రతి జీవితానికీ ఎప్పుడో ఒకప్పుడు కాకపోయినా మెరిసేయోగం వుంటుంది. చిలకలదాసుకి వున్న మెరుపల్లా ఒక్కటే! అది బ్రాంచి మేనేజరు పోస్టు! అనకాపల్లి బ్రాంచి మేనేజరు హనుమంతరావు మరో ఆరు నెలల్లో రిటైరవుతాడు. రూలు ప్రకారం అతని తర్వాత, ఆ పోస్టులోకి తనే వెళ్లాలి.

కానీ ఈ ప్రపంచంలో అన్నీ రూల్సు ప్రకారమే నడుస్తున్నాయా? లేదు. అయినా చిలకలదాసు ఆశ, ధ్యాస, శ్వాస, సర్వం ఆ పోస్టుమీదే వున్నాయి. ప్రమోషన్ వచ్చేస్తుందనే నమ్మకానికి, రాదేమో అనే అనుమానానికి మధ్య రంగారావు అనేవ్యక్తి కనిపిస్తున్నాడు.

ప్రతీ కథలోనూ ఏదో ఓ సైజు విలన్ సాధారణంగా కనిపిస్తుంటాడు. అతను సీరి

యస్ విలన్ కావచ్చు, కామెడీ విలన్ కావచ్చు. అరణ్యాల్లో అష్టకష్టాలుపడి, సీతాదేవితో అయోధ్యకొచ్చి పట్టాభిషిక్తుడయ్యేక కూడా రాముడికి, చాకలి మడేలు రూపంలో ఓ కామెడీవిలన్ దాపురించి, సంపూర్ణమైపోయిందనుకున్న రామాయణానికి మళ్ళీ ఎక్స్‌టెన్షన్ ఇచ్చేడు గదా! అలాంటివాడే రంగారావు కూడా అని చిలకలదాను అనుమానం.

నిజానికి రాముడికి కష్టాలు తేగలిగే కెపాసిటీ ఆ చాకలి మడేలుకి లేదు. కానీ చిలకలదానుకి అడ్డుపడేశక్తి రంగారావుకుంది. ఎందుకంటే రంగారావూ, దాను ఒకేరోజు సర్వీసులో ప్రవేశించారు. అంటే, ఇద్దరిదీ ఒకే సీనియార్టీ. ఆఫీసుపని వెలగబెట్టడంలో రంగారావు ఏనాడూ ఏ గొప్పలు వెలగబెట్టకపోయినా, చిలకలదాను మాత్రం అప్పుడప్పుడు కొన్ని తప్పులు చేసేడు. ఆఫీసుకి లేటుగా రావడం, వచ్చేక సీట్లో నిద్రపోవడం, ఆఫీసుపనిలో తప్పులు చేయడంలాంటివి జరిగేయి. అంచేతాయనకి కొన్నిసార్లు మెమోలు, మరికొన్నిసార్లు చార్జ్‌షీట్లూ ఇచ్చేరు.

ప్రస్తుతం ఏలుబడిలోకొస్తున్న రూలింగ్ పార్టీలు కూడా వాళ్ళు చేసే గొప్పల్ని బట్టి కాకుండా ప్రత్యర్థి పార్టీలు చేసే తప్పుల్ని బట్టి గెలుపు సాధిస్తున్నారు. ప్రజాస్వామ్యం లేని ద్వాపర యుగంలో కూడా పాండురాజు కంటే ధృతరాష్ట్రుడు పెద్దవాడే అయినా, అతడు అంధుడన్న ఒకేఒక్క కారణంగా అతనికి రాజ్యం ఇవ్వకుండా పాండురాజుకిచ్చేశారు. వాళ్ళిద్దరూ అన్నదమ్ములైనా, ధృతరాష్ట్రుడు జ్యేష్ఠుడైనా అతని అంధత్వం అనే పాయింటువల్ల అతను డిస్క్వాలిఫై అయ్యేడు.

తనకిచ్చిన పనిష్మెంటు కూడా ప్రమోషన్ సమయంలో తనని డిస్క్వాలిఫై చేస్తే ఈ జన్మకి మరి ప్రమోషన్ రాదు. తనకి రిటైర్మెంటు వయసు కూడా దగ్గర పడిపోతోంది. కాబట్టి తను ప్రమోషన్ సంపాదించుకుంటే ఇప్పుడే సంపాదించుకోవాలి. ఇదే ఆఖరి అవకాశం.

ఇక అతని ఫేమిలీ విషయానికొస్తే, ఈ దేశంలో ఓ భాగమిదీ అంటూ పంజాబ్ గురించి ప్రత్యేకించి చెప్పుకోవాలి. ఎందుకంటే అక్కడున్నంతమంది టెర్రరిస్టులు మరే రాష్ట్రంలోనూ వుండరు. అలాగే ఈ రాష్ట్రంలో ఓ భాగమిది, ఆ భాగంలో ఒక ఇల్లు ఇదీ అని చిలకలదాను ఇల్లు గురించి చెప్పుకోవాలి. ఎందుకంటే ఆ ఇంట్లో టెర్రరిస్టులు లేకపోయినా అంత భయంకరమైన కోరికలు ఆ కుటుంబసభ్యులకున్నాయి.

శ్రీమతి వరలక్ష్మి, ఎలియాస్ చీటీలవరాలు అంటే ఆ వీధి అంతటికీ బాగా పాపులర్ ఫిగరు. ఆవిడ మరెవరో కాదు. సాక్షాత్తు చిలకలదానుగారి సతీమణి.

ఆ వీధి పక్కవీధుల్లో ఎక్కువమంది ఆఫీసర్లుగా పనిచేస్తున్నవాళ్ళే. కొంతమంది ఆఫీసర్లు కాకపోయినా తన భర్త చిలకలదాను కంటే ఎక్కువ జీతం సంపాదిస్తున్నవాళ్ళేనని ఆవిడ ఎప్పుడో తెల్సుకుంది. ఆవిడ నెలవారీ చీటీలు ఎత్తుతూ, మెంబర్లందరి పేర్లూ నోట్ చేస్తుంది. ఆవిడతో చీటీలు కలిపేవాళ్ళంతా ఆడవాళ్ళే. అంచేత వాళ్ళపేర్లు రాసేటప్పుడు కె. పార్వతి, వైఫ్ ఆఫ్ కోరమండల్ కంపెనీ ఆఫీసర్, యమ్. దమయంతి వైఫ్ ఆఫ్ స్టీల్ ఫ్యాక్టరీ పెర్సనల్ ఆఫీసర్ అంటూ వారి వారి భర్తల డిజిగ్నేషన్స్‌తో రాస్తుంది. అలా తన పేరు గురించి ఇతరులు, ఎలకలపూడి వరలక్ష్మి వైఫ్ ఆఫ్ బ్రాంచి మేనేజర్, రామ్‌జీ అండ్ లక్ష్మణ్‌జీ ప్రైవేట్ కంపెనీ లిమిటెడ్ అని ఎప్పుడు చెప్పుకుంటారో అని ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తోందిగాని, ఆ ఆశ నెరవేరలేదు.

ఆవిడకా ఆశ నెరవేరకపోవడం సంగతి అటుంచి, నెలవారీ చీటీలు వసూలు చేయడానికి చిలకలదాను వెళ్ళినప్పుడు చాలామంది ఆయన్ని "చీటీల వరలక్ష్మి మొగుడొచ్చేడు" అన్నప్పుడు ఆయన తేలుకుట్టిన మనిషిలా గిలగిల్లాడిపోతాడు. ఇంటికొచ్చేక ఈ విషయం గురించే గొడవ పెట్టుకుంటాడు.

"చీటీ డబ్బు వసూలు చెయ్యడానికి నీ కొడుకుని పంపించు. అంతేగాని, ఇవ్వాళో రేపో మేనేజర్ని కాబోతున్న నన్ను పంపించడం, నా గురించి వాళ్ళలా అనడం మహాదరిద్రంగా వుంటోంది" అని ప్రతీనెలా అతను అలగడం మామూలే.

"మీరు మేనేజర్ అయినప్పుడు మీరు చీటీడబ్బులు వసూలు చెయ్యడానికి వెళ్ళక్కర్లే





దు. నేనిలా చీటీలు వెయ్యక్కర్లేదు. అంతవరకూ వెళ్లండి, మరేం తప్పులేదు. ఇంక మిమ్మల్ని వాళ్లు పిలవడం అంటారా మేనేజరు పెళ్లాం, మేనేజరు పెళ్లాం అని నేనెలాగూ పిలిపించుకోలేకపోయేను. కనీసం మీరైనా నా మొగుడినని పిలిపించుకోండి'' అంటూ వగలబడినవ్వింది.

ఏ ఉద్యోగంవల్ల ఎంత గొప్పతనం వచ్చినా, అది లక్షలకి లక్షలు ఆస్తి వచ్చినప్పటికంటే ఎక్కువ గొప్పతనం రాదు. ఈ విషయం తెలిసే వరలక్ష్మి ప్రతినెలా కిరాణాసామాన్లు కొన్నట్టు, లాట్రీటిక్కెట్లు కూడా కొనేస్తుంది. అలా ఎన్ని సంవత్సరాల్నించో, ఎన్నో టిక్కెట్లు కొన్నా ఒక్క వందరూపాయల లాట్రీ కూడా ఆవిడకి తగల్లేదు. అది కూడా చిలకలదానుని కట్టుకున్న దురదృష్టంవల్లే అలా జరుగుతుందని నిష్ఠూరమాడింది.

వాళ్ల ఏకైక పుత్రసంతానం హనుమంతు. అది చిలకలదాను తండ్రి పేరు. అతని జ్ఞాపకార్థం కొడుక్కు ఆ పేరు పెట్టుకున్నా కాబోయే సినిమా హీరోకి హనుమంతు, జాంబవంతు అనే పేర్లుండకూడదని, సదరు హనుమంతు ఆ పేరుని చెరిపేసి, పవన్‌కుమార్ అని తనకి తనే కొత్త పేరు పెట్టుకున్నాడు. ''కొత్త నటీనటులు కావలెను'' అని ఎక్కడ ఏ సినిమా పేపర్లో ప్రకటన పడినా, వెంటనే మూడు పోజుల్లో ఫొటోలు రిజిష్టర్డ్ పోస్టులో పంపించి, ఆ సినిమా కంపెనీ వాళ్ల పిలుపుకోసం ఎదురుచూడ్డమే ప్రస్తుతం చిలకలదాను కొడుకు చేస్తున్నపని.

''సినిమా వేషాలు, గినిమా వేషాలు అంటూ వెధవ్వేషాలు వెయ్యకురా వెధవా'' అంటూ తండ్రి తిట్టినప్పుడల్లా వరలక్ష్మి కొడుక్కి మద్దతు ఇస్తూ మాట్లాడ్డం అలవాటు.

''పూర్వకాలంలోని ఆడవాళ్లు కొడుకుల్ని యుద్ధాలకి పంపించి, వీరవనితలనిపించుకునేవారు. నేను వీరమాతని కాలేకపోయినా, నా కొడుకుని హీరోగా చేసి, హీరోమాతననిపించుకుంటాను'' అనే డైలాగు వారానికోమాటయినా చెప్తుంది.

మీ తల్లీకొడుకుల్ని మార్చడం నావల్ల కాదంటూ ఓ ఏడాది క్రితమే దండం పెట్టేశాడు చిలకలదాను.

ఆయన కూతురు చిరంజీవి సౌభాగ్యవతి రత్నకుమారి ఎప్పుడూ నేలమీద నిలవకుండా గాల్లో విహరించే మనిషి. అందుక్కారణం ఆవిడ చదివే నవలలు, చూసే సినిమాలు! అందంగా, ఎత్తుగా బలంగా వుంటూ ఓ బెంజ్‌కార్లో వయనిస్తూ, డిక్కీలో ఓ కోటిరూపాయల మూటతో తిరిగే శ్రీమంతుణ్ణి తన భర్త పోస్టులో వూహించుకుంటూనే ఇంటర్మీడియేట్ రెండుసార్లు తన్నించేసింది.

అయినా వరలక్ష్మి కూతురి ఆశలకి గాలి తీసెయ్యకుండా తన ప్రోత్సాహంతో వూపిరిపోసింది. ''అలాంటి భర్తని కోరుకోవడంలో నీ తప్పేంలేదమ్మా! కానీ మీ నాన్నలాంటి క్లాస్ త్రీ ఉద్యోగస్తుడికి అలాంటి క్లాస్‌వన్ అల్లుడు దొరకడమ్మా! కనీసం ఆయనకి మేనేజర్ పోస్టయినా వస్తే కారుడిక్కీలో కోటిరూపాయలు కాకపోయినా, ఓ లక్ష రూపాయల బస్తా అయినా వేసుకుతిరిగేవాడు దొరుకుతాడు. కానీ, ఈ జన్మలో మీ నాన్నకా పోస్టు రాదు. నీ ఆశ తీరదు'' అంటూ చిలకలదానుకి వినబడేలా అనేకసార్లు చెప్పింది.

అంచేత ఇప్పుడు చిలకలదానుకి ప్రమోషన్ రావడం అతనికి మాత్రమే కాదు. ఇంటిల్లిపాదికి ఓ అవసరంగా మారిపోయింది.

★ ★ ★

ఎప్పుడూ వెళ్లినట్టే ఆరోజూ చిలకలదాను ఆఫీసుకి లేటుగా వెళ్లేడు. సర్కస్‌లో తిరుగుతున్న చక్రంమీదకి కత్తులు విసిరేవ్యక్తి ఎప్పుడూ పెర్‌ఫెక్ట్‌గానే విసురుతాడు తప్ప, కావాలని పందెంవేసినా, కత్తిని తప్పుగా విసరలేడు. ఎందుకంటే అతనా పెర్‌ఫెక్షన్‌కి అలవాటు పడిపోయేడు. అలాగే ఎప్పుడూ ఆఫీసుకి లేటుగా రావడానికి అలవాటుపడ్డ దాను, అలా రావడానికే అలవాటు పడిపోయేడుగాని, ఒక్కసారీ కరక్టుటైముకి రాలేదు.

ఆరోజు అతని సీటు దగ్గర కుర్చీ కనబడలేదు. ఏమైపోయిందా అని చుట్టూ కలియజూస్తుంటే, ఫ్యూన్ ఎమ్మన్‌గాడు గబగబా వచ్చి, దానుకి మాత్రమే వినబడేటట్టుగా చెప్పేడు.

''ఇందాక జి.యమ్.గారు ఈ హాల్లో ఓ చిన్న రౌండు వేశారండి. మీ కుర్చీ తప్ప మీరు కనబల్లేదండి. దానుగారు ఇంకా రాలేదా అని

అడిగితే, మన రంగారావుగారు రయ్‌మంటూ దగ్గరకెళ్లి, ఆయనెప్పుడు మాత్రం టైముకొచ్చే రండీ అంటూ చాలా అవాకులూ చెవాకులూ పేలేసేరండి. అసలే మన జి.యం.గారు కోతిక దండి. ఆ కోతికి, రంగారావుగారు చెప్పిన మాటల్తో గవర్నమెంటు సారా కొట్టినట్ట యిందండి. దాసుగారి కుర్చీ తీసుకొచ్చి నా గదిలో వెయ్, ఆయన రాగానే నన్ను కల్సుకో మని చెప్పు అని ఆర్డరేసేరండి. నేనా ఆర్డర్సు ఫాలో అయిపోయి మీ కుర్చీని ఆయన గదిలో పెట్టేసేనండి''

దాసు కుతకుతలాడుతూ రంగారావుని చూ సేడు. అంతవరకూ ఇటువైపే ఓ చెవిని, ఓ కంటిని పారేసిన రంగారావు దాసు ఇటువైపు చూడగానే, కంగారుపడి తన చెవిని, కంటిని వెనక్కి లాగేసుకుని ముఖానికి అడ్డంగా ఓ న్యూస్‌పేపరు పెట్టుకున్నాడు. వస్తున్న కోపాన్ని తమాయించుకుంటూ దాసు జి.యమ్.గారి రూములోకి వెళ్లేడు.

''గుడ్‌మార్నింగ్ సార్'' అని దాసు విష్‌చేస్తే 'అక్కర్లేదం'టూ జి.యమ్. ముఖం ముటము టలాడించేడు. తర్వాత దాసుని మందలించే డు. ఆ మందలింపులో అర్థం వున్న వ్యాఖ్యలు రెండు మూడు వాడి, అర్థం పర్థంలేని వ్యాఖ్యా లు చాలా ఎక్కువగా ఉపయోగించేడు.

''ఏవిటి దాసూ ఇది? వాటీజ్ దిస్? ఉద్యో గంలో నాకంటే చిన్నవాడివైనా, వయసులో నాకంటే పెద్దవాడివి. వయసులో పెద్దవాడి వైనా బుద్ధిజ్ఞానాల్లో చాలా చిన్నవాడివి. అందులో చిన్నవాడివైనా సీనియార్టీలో పెద్దవా డివి. అందులో పెద్దవాడివైనా, ఆఫీసు రూల్సు పాటించడంలో చిన్నవాడివి. ఇలా అయితే నీకు ప్రమోషన్ ఎలా వస్తుంది? నువ్వు ఆఫీసు కి ఎప్పుడు తగలడినా, చేసేపని కూడా సరిగా తగలెట్టవు. ఇలా అయితే మన కంపెనీ ఎలా తగలడుతుంది? ఇలాంటి కంపెనీలు తగలబ డిపోతూంటే రేపు దేశమెలా తగలడుతుంది? అసలు మనకి గాంధీగారు చెప్పిందేవిటి? మీరు చేస్తున్నదేమిటయ్యా? మొన్నటిదాకా గల్ఫ్ కంట్రీస్‌లో యుద్ధాలా? వేలకివేలు జనం చావడాలా? మనదేశంలో మొన్నమొన్నటిదాకా బోఫోర్సు గొడవలు, పంజాబ్‌లో టెర్రరిస్టుల అరాచకాలా? నిన్నటిదాకా మండల్ కమిషన్ గొడవలు, రామమందిరం, బాబ్రీ మసీదు గొడవలా? మరోపక్క ప్రభుత్వాలు పేకమేడల్లా కూలిపోవడాలు, ప్రధానమంత్రులు గాజు గ్లాసు ల్లా పగిలిపోడాలూనూ? ఇవన్నీ ఇలావుంటే, నువ్వు రోజూ లేటుగా రావడాలూ? ఛిఛిఛిఛి'' అంటూ టేబిల్‌కి తన నెత్తిని బాదుకున్నాడు.

చిలకలదాసుకి అతని మాటలేం అర్థంకాలే దు. తను లేటుగా వచ్చేమాట నిజమేగాని, దానికీ గల్ఫ్‌కంట్రీ యుద్ధానికి ప్రభుత్వాలు కూలిపోవడానికి ఏవిటి సంబంధమో అర్థం కాలేదు. అదే విషయం అడగబోతే, అతనికా అవకాశం ఇవ్వకుండా జి.యం.గారే సీరి యస్‌గా అన్నారు.

''గతంలో నువ్వు లేటుగా వచ్చినందుకు నీకేం ఇచ్చేను?''

''నాలుగుసార్లు మెమోలు, రెండుసార్లు చార్జ్ షీట్లు ఇచ్చేరు సార్''

''తర్వాతేం ఇవ్వలేదా?''

''ఇవ్వలేదండి''

''అయితే ఈసారి నీకో ఇంక్రిమెంట్ కట్ చేస్తున్నాను''

దాసు అదిరిపడ్డాడు. ఆ అదిరిపాటు ఇంక్రి మెంటు కట్ చేసినందుక్కాదు. రేపు ఎప్పు డైనా ప్రమోషన్ ఇచ్చేటప్పుడు ఇలాంటి పని ష్మెంట్లు చైనా గోడలాగా అడ్డంగా నిలబడిపో తాయి. అందుకే పనిష్మెంట్లు వద్దని ప్రాధేయ పడ్డాడు. అయినా లాభం లేకపోయింది.

చిలకలదాసే తన కుర్చీని మోసుకుంటూ తీసుకువెళ్లాలని జి.యమ్.గారు ఆదేశిస్తే చచ్చినట్టూ అలాగే మోసుకొచ్చేడు.

రంగారావు అతనిమీద జాలి చూపిస్తున్నట్టే చూపించి అందరితోనూ అదే విషయం మాట్లా డ్డం చిలకలదాసుకి చిర్రెత్తిచ్చింది.

''మిమ్మల్ని జి.యమ్.గారు నానామాటలా అన్నారటకదా?'' అన్నాడు రంగారావు అదే సమక్షంలో.

''అబ్బే అదేంలేదు... ఏవో ఫేమిలీ విషయా లు నాతో డిస్కస్ చేసేరు'' అన్నాడు దాసు కావాలని అబద్ధమాడుతూ.

అయినా రంగారావు వదల్లేదు.

''మిమ్మల్ని అమ్మా... ఆలీ అంటూ అడ్డ





మైన తిట్లు తిట్టేడట కదండీ''

''ఎవరు చెప్పేరండీ బాబు... యూజ్‌లెస్ ఫెలో, లేజీబగ్గర్ అంటూ ఏవో రెండు మాటలంటే మాత్రం వాటిని తిట్లకింద భావిస్తే ఎలా?'' దాసు లోలోపల వుడుక్కుంటూనే జవాబిచ్చేడు.

''చూసేరా... చూసేరా... మొదటడిగితే ఏవో ఫేమిలీ విషయాలు మాట్లాడేరని చెప్పేరు. నేను తిరగేసి మరగేసి అడిగితే రెండు తిట్లు తిట్టేరంటున్నారు. మీరు రెండు తిట్లే అని చెప్పినా, దాన్నిబట్టి ఎన్నితిట్లు తిట్టేరో మేం ఊహించుకోగలంలెండి. అన్నట్టు మీకేదైనా పనిష్మెంటు ఇచ్చేరా?''

''అబ్బే... అదేంలేదు''

''లేదంటారేవిటండీ... మిమ్మల్ని రివర్ట్ చేసేసారటకదా. మన ఎమ్మన్‌గాడు అంతా చెప్పేడులెండి''

దాసుకి ఒళ్లు మండిపోయింది- ''నన్నేం ఆయన రివర్ట్ చేయలేదు. డిస్మిస్ చెయ్యలేదు. కేవలం ఒక్క ఇంక్రిమెంటు, ఒకేఒక్క ఇంక్రిమెంటు కట్ చేసేడు అంతే'' అన్నాడు కాస్త ఆవేశంగా.

''ఆ జి.యమ్.గారి జులుం ఎలా పెచ్చురేగిపోతోందో చెప్పడానికీ ఒక్కదారుణమూ చాలదండి'' అంటూ ఆఫీసులో అందరి దగ్గరకీ పనిగట్టుకెళ్ళి చిలకలదాసుకి ఇంక్రిమెంటు కట్‌చేసి, అడ్డమైనబూతులూ తిట్టడం ఆ జి.యమ్.గాడికి తగునా? అంటూ డిస్కస్ చేసేడు రంగారావు. పాపం చిలకలదాసుగారికి ఫేమిలీట్రబుల్సెక్కువ కాబట్టి ఆఫీసుకి కాస్త లేటుగా వస్తాడు. అయితే అంత మాత్రానికి ఇంక్రిమెంటు కట్ చెయ్యాలా? ఆయనకి కాస్త నిద్రమత్తు ఎక్కువ కాబట్టి ఆఫీసులో గుర్రుపెట్టి నిద్రపోతాడు. అంతమాత్రానికే ఇంక్రిమెంటు కట్ చెయ్యాలా? ఆయన బుర్రలో సరుకు తక్కువ కాబట్టి, ఆఫీసులో ఏపని చేసినా ఏడ్పి ముఖం కడుక్కున్నట్టే వుంటుంది. అయితే మాత్రం ఇంక్రిమెంటు కట్ చెయ్యాలా?'' అంటూ రంగారావుగారు సాయంకాలంవరకూ అదే టాపిక్కు డిస్కస్ చేస్తుంటే, అతను తనమీద జాలిచూపిస్తున్నాడో తనని ఎండగడుతున్నాడో చిలకలదాసుకి అర్థం కాలేదు.

''ఇదంతా మనలో ఐకమత్యం, కోపరేషన్ లేకపోబట్టి, ఆ జి.యమ్.గాడికి ఆడింది ఆట, పాటింది పాటా అయిపోతోంది'' అని రంగారావు చెప్పినమాట మాత్రం చిలకలదాసుకి బాగా నచ్చింది. అతనిచేత ఆలోచింపజేసింది.

★ ★ ★

సరిగ్గా రెండురోజుల తర్వాత - జి.యమ్.గారు ప్యూన్ చేత ఓ సర్క్యులర్ పంపించేడు. ఆరోజున తన భార్య నలభైమూడవ పుట్టిన రోజని, ఆఫీసు స్టాఫంతా తనయింటికొచ్చి పార్టీ తీస్కోవాలని దాని సారాంశం!

ఆ సర్క్యులర్ చూడగానే రంగారావు రెచ్చిపోయి మాట్లాడేడు. ''సంవత్సరానికి పన్నెండు నెలలు. మన జి.యమ్‌గారి కుటుంబంలో పిల్లా మేకా అందరూ కలిపి పన్నెండు మంది. ఒక్కొక్కరూ ఒక్కో నెలలో పుట్టేరు. ప్రతీ నెలా మనకీ పుట్టినరోజు తద్దినం తప్పడంలేదు. ప్రతినెలా ఆయనగారు మనల్ని పార్టీ అని పిలవడం, కుక్కలు కూడా తినని ఓ బిస్కెట్ ముక్క, పుశువులు కూడా తాగని గెంజిలాంటి కాఫీనీళ్లు మన ముఖాన కొట్టడం, మనం తలా ఓపాతిక రూపాయిలు చందా వేసుకుని ప్రతి నెలా ఓ ప్రెజెంటేషను తగలెట్టడం ఓ దరిద్ర గొట్టు ఆచారంగా మారిపోయింది. ఇప్పుడు వాడి పెళ్లాంగారి నలభై మూడో పుట్టినరోజుట! ఈ అత్యాచారాన్ని ఇంకెన్నాళ్లు భరించాలి?''

ఇలాంటి సర్క్యులర్‌లు ప్రతినెలా రావడం, వచ్చినప్పుడల్లా రంగారావు రెచ్చిపోవడం మామూలేకాబట్టి, ఆ లెక్చరుకి ఎవరూ రియాక్ట్ కాలేదు.

కానీ చిలకలదాసు మీద ఆ మాటలు తీవ్రంగా పనిచేసేయి. పిడికిళ్లు బిగుసుకున్నాయి. జి.యమ్. తనకి చేసిన అన్యాయానికి, ప్రతీకారం తీర్చుకోడానికీ సందర్భాన్ని అవకాశంగా తీస్కోవాలనుకున్నాడు. అప్పటికప్పుడు ప్యూన్ ఎమ్మన్ చేత అందరకీ ఒన్ బై టూ కాఫీలు తెప్పించి, తన ఆవేశాన్ని, ఆవేదనని తెలియజేస్తూ వుపన్యాసం యిచ్చేడు. ''జి.యమ్.గారి పార్టీకి మనం ఎంత మాత్రం వెళ్లకూడదు. మొన్న నాకు వుత్త పుణ్యానికి ఇంక్రిమెంటు కట్ చేసేడు. నా వయసుకి, నా

నర్వీనుకి పినరంత కూడా మర్యాదయివ్వ కుండా నాచేతే నా కుర్చీ మోయించేడు. ఇంత నర్వీనున్న నాకే యింత అన్యాయం తలపెట్టే డంటే, ఇంక మీకెంత అన్యాయం చేస్తారో ఆలోచించండి! మనం ఆయన ఆహ్వానాన్ని తిరస్కరించి ఈ పార్టీని బాయ్‌కాట్ చేస్తేతప్ప మనలో వుండే ఐకమత్యం ఆయనకి అర్థంకాదు, ఆయనకి బుద్ధిరాదు" అంటూ చాలాసేపు వువన్యానం యిచ్చేడు.

"మనం పార్టీకి వెళ్లకపోతే జి.యమ్.గారికి కోపంరాదూ?" అన్నాడు భాస్కరం అనే కొత్త గుమస్తా.

"వస్తే ఏంటట? అందరూ వెళ్లి ఏ ఒక్కరో వెళ్లకపోతే ఆయనకి కోపం రావచ్చు. ఆ వ్యక్తి మీద ఏదైనా ఏక్షను తీస్కోవచ్చు. కానీ అందరం స్ట్రయిక్ చేస్తే ఆయనేం చెయ్యగల డు?"

చిలకలదాను తనకి చేతనైన లాజిక్కుల్ని వినిపించి వాళ్లందర్ని కన్విన్స్ చెయ్యడానికి ప్రయత్నించేడు. "ఆలోచించండి బాగా ఆలోచించండి" అంటూ దాను వదే వదే అంటూనే వున్నారు. ఎవరూ ఆలోచించడానికి వీల్లేకుండా మాట్లాడుతూనే వున్నాడు. వుదయం వదకొండు గంటలనించి సాయింకాలం ఆఫీను అయ్యేవరకూ వువన్యానం ఇచ్చేనరికి అందరూ ఒప్పుకున్నారు. అందుక్కారణం, రంగారావు చేసిన నపోర్టు కూడా.

"మనమంతా ఒక్క మాట మీదే వుండాలి, ఒక్కబాట మీదే నడవాలి" అంటూ వదే వదే రంగారావు ఇచ్చిన స్లోగన్ వృధాకాలేదు. సాయంత్రం అందరూ వెళ్లిపోయే నమయంలో చిలకలదాను గుమ్మందగ్గర నిలబడి తన అర చేతిలో అందరిచేతా "నేను పార్టీకి వెళ్లను" అని ప్రమాణం చేయించుకున్నాడు. అందరూ ప్రమాణంచేసేక చిలకలదాను తృప్తిపడ్డాడు.

★ ★ ★

ఆ సాయింత్రం చిలకలదాను చాలా నంతోషంగా ఇంటికొచ్చేడు. వస్తూ వస్తూ తను సాధించిన విజయాన్ని సెలబ్రేట్ చేస్కోడానికి, ఓ హాఫ్‌బోటిల్ మందు, చిప్సు తెచ్చుకున్నాడు. అతని వ్యవహారం చూసి అతని భార్య అడిగింది - "ఏమిటీ ఇవాళ ఇంత నంతోషంగావున్నారు? మీకు ప్రమోషన్ వచ్చిందా?"

"లేదు"

"మరి... అమ్మాయికి నంబంధం కుదిరిందా?"

"లేదు"

"మరెందుకూ ఇంత డబ్బుపెట్టి బ్రాందీబోటిల్ తెచ్చుకున్నారు?"

చిలకలదాను తను ఏం సాధించేడో, ఎంత కష్టపడి సాధించేడో చాలా గర్వంగా చెప్పేడు. "మీ ఆఫీనరుగార్ని ఎదిరించడమూ ఓ ఘనకార్యమే?" అంది మూతితిప్పుతూ.

"అలా మూతి తిప్పడం కాదే! పాలకుల్ని ఎదిరించడమే ఘనకార్యం అవుతుంది గాని, మన కిందవనిచేసేవాళ్ల మీద డాబు చెయ్యడం ఘనకార్యం కాదే! బ్రిటీషు వాళ్లని ఎదిరించబట్టే అల్లూరు సీతారామరాజు విప్లవ జ్యోతి అనిపించుకున్నాడు. మహాత్మాగాంధీ జాతిపిత అనిపించుకున్నాడు. మనవూ ఇప్పుడు ఆ రూట్లోనే నడుస్తున్నాం" అంటూ మీనం దువ్వేడు.

"బ్రాందీ తాగుతూ గాంధీగారితో పోల్చుకోవడం ఎందుకులెండి" అంటూ మరోసారి మూతి తిప్పుతుండగా, వాళ్లబ్బాయి, కాబోయే సినిమా హీరో వచ్చి "నాన్నా... నేను మేకప్ టెస్టుకి, స్క్రీన్ టెస్టుకి వందరూపాయిలు కావాలని అడిగేను దాని నంగతేం చేసేవు?" అన్నాడు.

"నేనివ్వనని అప్పుడే చెప్పేగా"

"ఇవ్వకపోతే ఎలా? ఆ కొత్త సినిమా కంపెనీవాళ్లు కొత్త నటీనటుల్తో సినిమా తీస్తున్నారు. మమ్మల్ని సెలక్ట్ చెయ్యడానికి మేకప్ టెస్ట్ చేస్తారట. ముందుగా వందరూపాయిలు వంపమని పేవర్లో వేసేరు"

'మేకప్ టెస్టు చెయ్యడానికే వందరూపాయిలు లేనివాళ్లు ఇంక వాళ్లేం సినిమాతీస్తార్రా? తీసినా ఇలాంటి వెధవ వనులకి నేను రూపాయి కూడా యివ్వను, నువ్వు బయటకెళ్లు''.

కొడుక్కి మహాకోవం వచ్చింది. "నేను సినిమా హీరో కావడానికి వందరూపాయిలు ఇమ్మంటే అది వెధవ వని అంటున్నావు. మరిప్పుడు నువ్వు డబ్బై రూపాయిలుపెట్టి బ్రాందీ కొనుక్కొచ్చి తాగేస్తున్నావ్, ఇది




మాత్రం వెధవవని కాదా?'' అంటూ తండ్రికొట్ట బోతుంటే బయటకి పారిపోయేడు. ఏమైతేనేం, ఆరోజు చిలకలదాను, ఆఫీసులో అందర్నీ పార్టీ కెళ్ళకుండా ఆపుచేసెయ్యగలిగినందుకు చాలా సంతోషిస్తూ నిద్రపోయేడు.

మర్నాడు వుదయం ఆఫీసుకెళ్ళి తన విక్కీ మోపెడ్‌ని స్టేండ్‌లో పెట్టి, ఆఫీసులో క్కూడా వెళ్ళకుండా, సరాసరి కేంటీన్లోకి వెళ్ళేడు. ఒళ్ళంతా నొప్పులుగా వున్నట్టనిపిస్తే దారిలోనే ఓ టేబ్లెట్ కొని తెచ్చుకున్నాడు.

మాత్రవేసుకుని టీ తాగుతుండగా, జి.యమ్.గారికి ఫ్లాస్క్‌లో కాఫీ పట్టుకువెళ్తున్న ప్యూన్ ఎమ్మన్ చిలకలదానుని చూసి ఆగి పలకరించే డు.

''ఏవిటిసార్... టేబ్లెట్ వేసుకుంటున్నారు? ఒంట్లో బాగులేదా?''

''బాగులేదురా... నిన్న సాయంకాలంనించి ఒళ్లంతా అదోలావుంటేను'' అంటూ బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్నాడు.

''అదీ అలా చెప్పండి. ఒంట్లో బాగులేకపోబట్టే మీరు నిన్న జి.యమ్.గారింట్లో జరిగిన పార్టీకి రాలేదు''

''అదేం లేదురా. నేను కావాలనే రాలేదు. అంతేకాదు, మన ఆఫీసులో ఎవ్వరూ, పిట్టమనిషికూడా ఆ పార్టీకి వెళ్లకుండా ఆపుచేసేసేను కదా'' అన్నాడు గర్వంగా.

ఎమ్మన్ అతన్ని వింతగా చూసేడు. ఆ చూపుని మరోలా అర్థం చేసుకుని దాను అడిగే డు - ''ఏవిట్రా అలా చూస్తున్నావు? ఈ ఎలకలపూడి చిలకలదానులో ఇంత విప్లవధోరణి ఎప్పుడు వచ్చిందనా?'' అంటూ నవ్వేడు.

''అది కాదండి. మీరేమో అందర్నీ ఆపు చేసేసేనని అంటున్నారు. మిగతా వాళ్లంతా పార్టీకొచ్చేరు''

చిలకలదాను ఆ మాట నమ్మలేదు. ఎమ్మన్ గాడు తనతో జోక్ చేస్తున్నాడనుకున్నాడు.

''ఏరా... నాతో జోకు చేస్తున్నావా?''

''కాదుసార్, నిజమే చెప్తున్నాను. మీరు తప్ప అందరూవచ్చేరండి''

''రంగారావు వచ్చేడా?''

''అయ్యో! పార్టీ కొచ్చిన మొదటి గెస్టూ ఆయనే, ఆఖర్నెళ్లిన గెస్టూ ఆయనే! మీరు పార్టీకి రాలేదన్న విషయం మొదట్లో మన జి.యమ్.గారు కనిపెట్టలేదండి. కానీ, రంగారావుగారే కావాలని మీ ప్రస్తావన తెచ్చి మీ మీద అవీయివీ అన్నీ చెప్పేసి జి.యమ్.గారి బుర్ర పాడు చేసేసేరండి''

దానుబుర్ర మీద నాలుగైదు పిడుగులు ఒకేసారి పడినట్టుగా అదిరిపోయేడు. ఎమ్మన్ అక్కణ్ణించి వెళ్ళిపోయినా అతనిలో వణుకు తగ్గలేదు. ఆ పార్టీకెళ్లమని అందరూ ప్రమాణంచేస్తే నిజమని గుడ్డిగా నమ్మేసేడు. కానీ ఇప్పుడు తను ఒక్కడూ తప్ప అందరూ వెళ్లేరని తెలిసింది. పైగా తనకి మద్దతుయిచ్చిన రంగారావే, తన మీద జి.యమ్.గారికి చాడీలు చెప్పి తన మీద కోపం తెప్పించేడట ఎంత దగా!

ఆవేశంగా తన ఆఫీసు రూమ్‌లోకెళ్లి అందర్నీ నిలదీసి అడిగేడు. ''నాకెందుకింత దగా చేసేరు?'' అని రంగారావుని ముఖ్యంగా అడిగే డు.

''యిందులో మేం చేసిన దగా ఏంవుంది?'' రంగారావు సీరియస్‌గానే అడిగే డు.

''పార్టీ కెళ్లనని నాకు ప్రమాణంచేసేరా? లేదా? చేసి మరీ మీరంతా పార్టీ కెళ్లేరంటే దాన్ని దగా అంటారా? అనరా?''

రంగారావు పరిహాసంగా నవ్వేడు. ''చూడండి దానుగారూ, ఎలక్షన్ టైములో ఎంతో మంది నాయకులొస్తారు. మీరు తప్పకుండా మాకే ఓటు వెయ్యమంటారు. వేస్తామని ప్రమాణం చెయ్యమంటారు. చేస్తాం. కానీ మనం ఆ ప్రమాణానికి నిలబడుతున్నామా చెప్పండి? మనం ఏం చెయ్యదల్చుకున్నామో అదే చేస్తాం. నిన్న మీరు కూడా పొలిటికల్ లీడర్లాగే అడిగేరు. మేవూ ఓటర్లలాగే ప్రమాణాలు చేసేం''

అందరూ చేసిన దగాకంటే, ఇప్పుడు రంగారావు చెప్తున్న మాటలే చిలకలదానుని మరింత రెచ్చగొట్టేయి.

''మరి నిన్న మీరు నాకు మద్దతు యిచ్చి ఎందుకు మాట్లాడేరు?''

ఆఫీసులో అందరూ పనిమానేసి ఆసక్తిగా



ఈ సంభాషణే గమనిస్తున్నారు. ఎందుకంటే రంగారావు తమందరి తరపునా వాదిస్తున్నాడు.

"నాకు ఎవర్నీ బాధపెట్టడం ఇష్టం వుండదండి. మీకు మద్దతు ఇచ్చినట్టు మాట్లాడితే మీరు సంతోషిస్తారు. మన జి.యమ్.గారి పార్టీకి వెళ్తే ఆయన సంతోషిస్తారు. అంచేత రెండు పనులూ చేసేసేం. ఒక వేళ మీ మాట విని మేం కూడా పార్టీ మానేసివుంటే, మీరు ఆయన దృష్టిలో చెడ్డయిపోయినట్టే, మేవూ చెడ్డయిపోయివుండేవాళ్లం! ఇది మిగతావాళ్లు చెప్పే మాట. కానీ నా విషయం చెప్పాలంటే, ఇంకొన్ని నెలల్లో బ్రాంచి మేనేజరుగా ప్రమోట్‌కావల్సినవాణ్ణి. జి.యమ్.గారు నాకు ప్రమోషన్ ఇచ్చే దేవుడు. ఈ నాలుగురోజులూ ఆ దేవుడికి నేను అర్చకుడిగా వుండడం మంచిదిగాని, శతృవుగా ఎందుకు మారాలి చెప్పండి"

వాదన మరి కాస్సేపట్లో ముగిసినా, దాని ప్రభావం మాత్రం ...కలదాను మనసులో గుబగుబలాడ్డం మానలేదు. ఇప్పుడు జరిగిందానివల్ల ముఖ్యంగా మూడు విషయాలు బోధపడ్డాయి. ఒకటి ఆఫీసులోని కొలీగ్స్ అంతా తనతో కలిసున్నట్టుగా కనిపించినా ఆ కలయిక తామరాకుమీద నీటి బొట్టువున్నట్టే.



వాళ్లు సమయం వచ్చేసరికి నీళ్లోవేసిన సూనెలా పైకి తేలిపోతారు. రెండు, ఆఫీసరు పిలకపట్టుకుని ఆడించాలనుకున్నాడు. కానీ ఇప్పుడు తన పిలక, జుత్తూ అంతా ఆయన గుప్పిట్లోకెళ్లిపోయేయి. మూడు, అసలే తన మీద కన్ను బుస్సుమంటున్న ఆఫీసరు చేతికి ఇప్పుడుచేసిన తప్పు ఓ కత్తిని అందించినట్టయింది. ఇప్పుడా కత్తితో రేపు మరెన్ని ఇంక్రిమెంట్లు నరుకుతాడో.

మధ్యాహ్నం, ఏదో ఆఫీసువర్కుమీద జి.యమ్.గారు పిలిస్తే చిలకలదాను వెళ్లేడు. "ఏమయ్యా ఎవర్నీ మా ఇంటికి రావొద్దని చెప్తూ అందరికీ విప్లవ భావాలనూరి పోసేవట?" అంటూ జి.యమ్. చెడా మడా తిట్టేస్తాడని వూహించాడు. కానీ అతను తిట్టలేదు. కనీసం ఆ విషయాన్ని ప్రస్తావించలేదు. అదే చిలకలదానుకి బాధ కలిగించింది. అతను తనకోసం తీరేవరకూ తిట్టేస్తే, తను చేతులూ గెడ్డం పట్టుకుని క్షమించండి మహాప్రభో క్లాస్ త్రీ ఎంప్లాయీ కోపంవాడి ప్రమోషన్‌కే ప్రమాదం తెచ్చిపెడుతుందనీ ప్రాధేయపడేవాడు. కానీ జి.యమ్. ఆ టాపిక్కే ఎత్తకుండా తనకి కావల్సిన ఆఫీసు పనేదో అడిగి పంపించేసేడు. అంటే తనుచేసిన తిరుగుబాటుని అతను మనసులో పెట్టుకున్నాడని అర్థమవుతూనే వుంది.

ఇల్లు కాలి బాధపడుతున్నవాడి మీద ఇన్‌కమ్‌టేక్సు వాళ్లు రైడ్ చేసినట్టు జి.యమ్.గారికి కోపం తెప్పించేనే అని బాధపడుతున్న చిలకలదానుని మరీ బాధ పెడుతూ మరో విషయం తెల్సింది.

అనకాపల్లి బ్రాంచి మేనేజరు ఆంజనేయులు మరో ఆరు నెల్ల తర్వాతే రిటైరవాలి! కానీ అతను హెల్త్‌గ్రౌండ్స్ మీద నిన్ననే వాలంట్రీ రిటైర్మెంటు తీసుకున్నాడట. అంటే ఇప్పుడు తను ప్రమోట్ అవాల్సిన పోస్టు ఖాళీ అయింది. కానీ ఆ పోస్టుకి తనే ప్రమోట్ అవుతాడనే గ్యేరంటీలేదు. ఎందుకంటే తనతో సమానమైన సీనియార్టీ రంగారావుకీ వుంది. పైగా "ఇంకొన్ని రోజుల్లో మేనేజరుగా ప్రమోట్ కావల్సినవాణ్ణి, నాకు జి.యమ్.గారితో విరోధం ఎందుకూ?" అని మొన్ననే రంగారావు అన్నాడు. అంటే దానర్థం ఆ పోస్టు గ్యేరంటీగా తనకేవస్తుందన్న నమ్మకంతోనే అతనా మాట అనివుండాలి.

ఇప్పుడేం చేయాలి?

ఉబ్బినిబిల్లి సుబ్బయ్యనాయుణ్ణి సలహా అడిగితేనో!



ఉబ్బినిబిల్లి సుబ్బయ్యనాయుడు స్వయాన చిలకలదాను భార్యకి పిన్నమ్మ కొడుకు. పేరులో వున్నంత గంభీరత ఆ మనిషిలో కనిపించదు. గట్టిగా యాభై కేజీలు వుంటాడా? అనే అనుమానాన్ని కలిగించే శరీరంలో ఆ భగవంతుడు డబ్బై కేజీల బరువు, బలంవుండే బ్రెయిన్ని పెట్టేసేడా అన్న అనుమానం కూడా కలిగిస్తాయి ఆయన చేసేవనులు! గొడ్డలి లేకుండా చెట్లుల్ని నరికించెయ్యడం, విత్తనాలు వేయకుండా చెట్లు మొలిపించడం లాంటి వింత కలిగించే పనులు ఆయన సొంతం అని చాలా మంది ఒప్పుకుంటారు. అతను మాటలు అమ్ముకు బతికెయ్యగలడు. సలహాలిస్తూ డబ్బు సంపాదిస్తాడు. తన సలహాల్ని అమల్లో పెట్టలేనివాళ్లకి స్వయంగా వెళ్లి సాయం కూడా చేస్తుంటాడు.

చిలకలదాను ఆ యింటి బయట విక్కీ అపుచేసి లోపలకెళ్లేడు. అప్పటికి సుబ్బయ్యనాయుడు ఓ పదిమంది ఫ్యాక్టరీ వర్కర్సుతో ఏదో డిస్కస్‌చేస్తూ దానుని చూడగానే మహదానందంగా పలకరించేడు. దాను తనో సమస్య మీద వచ్చేననగానే "మనవి ఫేమిలీ సమస్యలు, తర్వాత తీరిగ్గా మాట్లాడుకుందాం. ఈ వర్కర్స్పుది లేబర్ ప్రోబ్లమ్" అంటూ ఓ కుర్చీ మీద కూర్చోబెట్టి, ఫ్లాస్కు లోనించి ఓ గ్లాసులో కాఫీపోసి అతని కందించేడు. "నువ్వు చాలా




మంచి టైములో వచ్చేవుబావా'' అన్నాడు. దానుకాఫీ పూర్తిగా తాగేదాకా ఆగి ఓ ముసలి వర్కర్ని చూపిస్తూ ''ఇదిగోబావా! ఈ కార్మికుడి పేరు సింహాచలం. ఇతను నిన్న రాత్రి తప్ప తాగి నైట్‌డ్యూటీ కెళ్లి పని చేయకుండా షెడ్లో పడుకుంటే వీళ్ల ఫోర్‌మన్ చూసి ఇతన్ని ఉద్యోగం నించి సస్పెండ్ చేసేడు. రేపు ఎంక్వయిరీ కమిటీముందు ఇతను నిలబడి జవాబు చెప్పుకోవాలి. ఇతనికి ఎలాంటి పనిష్మెంటూ రాకుండా నేను కాపాడాలంటూ నా దగ్గరకొచ్చేరు'' అన్నాడు.

''అతను తాగేడు, డ్యూటీలో నిద్రపోయేడు. వాళ్ల ఫోర్మెన్ స్వయంగా చూసేడు. ఇంక అతన్ని ఎవరూ మాత్రం ఎలా కాపాడగలర్రా? తప్పు ఒప్పేసుకుని క్షమించమనడంకంటే మరో మార్గం లేదు'' దాను అన్నాడు.

నాయుడు ఏదో జోక్ వింటున్నట్టుగా పగలబడి నవ్వి ''నువ్వో అమాయిక చక్రవర్తివి బావా! ఎవడి తప్పువాడు ఒప్పేసుకుంటే ఈ లోకంలోని లాయర్లంతా రోడ్డుమీద పడిపోయి కూలిపనులు చేస్కోవాలి. నీకు ఆఫీసువనిలో అపారమైన అనుభవంవుందిగదా! రేపు ఆ ఎంక్వయిరీలో ఇతన్ని ఏ ప్రశ్నలు అడుగుతారో, నువ్వు అడుగు, వాటికి నేను, ఈ సింహాచలం తరవున జవాబులు చెప్తాను'' అంటూ మిగతా వర్కర్సుతో - ''నేను చెప్పిన వన్నీ నోట్ చేసుకుని ఈ సింహాచలంచేత కంఠతా చేయించి రేపు చెప్పించండి'' అంటూ వాళ్లకో నోట్‌బుక్ పెన్ అందించేడు. ఒక వర్కరు రాయనారంభించేడు.

''నువ్వు అడుగుబావా'' అని చిలకలదానుతో చెప్పి తనే ముద్దాయిలా ఫీలవుతూ వినయంగా చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

''ఏవయ్యా... సింహాచలం నువ్వు తప్పుతాగి డ్యూటీకెందుకొచ్చేవు?'' దాను దర్జా ప్రదర్శిస్తూ అడిగేడు.

''మరేనండి నిన్న నా కూతురూ అల్లుడూ నాయింటికొచ్చేరండి. అల్లుడు మందు కావాలన్నాడండి, తెప్పించేనండి. నువ్వూ తాగుమావా అన్నాడండి. నేను తాక్కపోదునండి. పెళ్లికిస్తానన్న కట్నం ఇంకా నేను ఇవ్వలేదండి. ఇప్పుడు నేను తాగనంటే నా కట్నం డబ్బు తక్షణం ఇస్తావా? చస్తావా? అని పీకలమీద కూర్చుంటాడేమోనని భయపడి తాగేనండి. అంటే నాకూతుర్ని వరకట్న దురాచార సమస్య నించి తాత్కాలికంగా కాపాడ్డానికి దానికావరం నిలబెట్టడానికే తాగేను గాని ఒళ్లు కొవ్వెక్కి తాగలేదండి''

నాయుడు చెప్పిన సమాధానానికి దాను చిన్నగా నవ్వుతూ రెండో ప్రశ్న అడిగేడు.

''సరే నువ్వెందు కోసం తాగినా, తాగేనని నువ్వే ఒప్పుకుంటున్నావుగదా''

''అన్నంతినే ఈ నోటితో అబద్ధం ఎలా ఆడమంటారండి?''

''సరే... తాగినవాడివి ఇంట్లో పడుకోకుండా డ్యూటీకెందుకొచ్చేవు?''

''డ్యూటీ అంటే నాకు ప్రాణమండి. వర్క్ ఈజ్‌వర్షిప్ అని ఫేక్టరీ గోడలన్నిండా బోర్డులు తగిలించేరు కదండి. ఆ బోర్డుల్నే నేను ఫాలో అయిపోతున్నానండి'' నాయుడు ఆ మాటలు చెప్తూ చేస్తున్న అభినయాన్నిబట్టి అతను చాలా మంచినటుడని కూడా అక్కడున్నవారందరూ భావించేరు.

''తర్వాత ప్రశ్న: డ్యూటీ అంటే ప్రాణంగా భావించేవాడివి పనిచెయ్యకుండా ఎందుకు నిద్రపోతున్నావు?''

''మా యజమాని గారంటే నాకు దేవుడితో సమానవండి. ఆయనకి నష్టం రావడం ఇష్టంలేక మిషిన్ దగ్గరకెళ్లకుండా నిద్రపోతున్నానండి''

''యజమాని మీద అంత భక్తి వున్నప్పుడు పనిచేసి ఆయన్ని మెప్పించాలిగాని, తాగిపడుకుంటే ఆయన సంతోషిస్తాడా?''

నాయుడు అక్కడున్న గ్లాసుతో మంచినీళ్లు తాగి, మళ్లీ చేతులు కట్టుకుని జవాబు చెప్పేడు.

''నిన్న నేను తప్పుతాగేను కదండి. అలాంటప్పుడు నేను మిషన్ దగ్గర నిలబడి పనిచేసేననుకోండి. అందులో నా కాలు వుండిపోవచ్చు. చెయ్యివుండిపోవచ్చు. నాబాధంతా కాలు గురించి చెయ్యిగురించే కాదండి. ఒకకాలు పోతే మరో కాలుంటాది. ఓ చెయ్యిపోతే మరో చెయ్యి వుంటాది. అదికాదండి నా పాయింటు. కాలో, చెయ్యో మిషిన్లోవుండిపోతే మిషిన్ పాడైపో

ద్దండి. రెండు మూడు రోజుల్దాకా అది సరిగ్గా పనిచెయ్యదండి. దానివల్ల మా యజమానికి ఎంత నష్టం వస్తాదండి? ఆ సంగతాలోచించే, పనిచెయ్యకుండా తొంగుండిపోయేనండి. ఇప్పుడు చెప్పండి, నేను చేసింది తప్పంటారా?''

చిలకలదాను, నాయుడు చెప్పిన సంజాయిషీకి పగలబడి నవ్వేడు. వీడుచెప్పిన సమాధానాలవల్ల ఆ సింహాచలం వుద్యోగం నిలబడినా నిలబడకపోయినా వాడి తెలివి తేటలు, మాట చమత్కారం మాత్రం అద్భుతంగా వున్నాయని లోలోపలే సంతోషించేడు. వర్కర్సు చాలా సంతోషంగా వెళ్లిపోతూ ''మరి మీ ఫీజు?'' అన్నారు.

''ఆపక్క గదిలో పెట్టండి'' అన్నాడు నాయుడు.

అయిదు నిమిషాల తర్వాత దానుని తీస్కుని నాయుడు పక్కగదిలోకి వెళ్లేడు.

అక్కడ నాయుడి అసిస్టెంటు ఓపుల్‌బోటిల్ బ్రాందీ, రెండు గ్లాసులూ వగైరా సరంజామా ఏర్పాటుచేసివుంచేడు.

''ఇదేవిట్రా?'' అన్నాడు దాను ఆశ్చర్యంగా.

''నేనిచ్చిన సలహాకి ఆ కార్మిక సోదరులిచ్చిన ఫీజుయిదే'' అంటూ దానుకోగ్లాసు అందించేడు.

''పగటిపూట ఇదేం పని?'' అంటూనే దాను గ్లాసు అందుకున్నాడు.

''పగటిపూట మందు తాగొద్దని ఏ సీసామీదా ఇంతవరకూ రాయలేదు. ఇంతకీ నన్ను వెదుక్కుంటూ ఎందుకొచ్చేవో చెప్పు బావా'' అన్నాడు గ్లాసుతో ఛీర్స్‌కొడుతూ.

చిలకలదాను తనకొచ్చిన సమస్యని ముందుచూపు లేకుండా తను చేసినతప్పుని వివరంగా చెప్పేడు. అంతా విన్నాక నాయుడు, కాస్సేపు ఏమీ మాట్లాడలేదు. రెండు రౌండ్లు పూర్తయేక, అర్జునుడికి గీతోపదేశం చేస్తున్న కృష్ణుడిలా పోజుపెట్టి మాట్లాడేడు.

''బావా ఎలకలపూడి చిలకదానూ! నీకొచ్చిన సమస్య వైకుంఠపాళీ సమస్య. ఆఫీసు అనే వైకుంఠపాళీలో ప్రమోషన్ అనే పరమపదం చేరడానికి నువ్వు ప్రయత్నిస్తున్నావు. అయితే వైకుంఠపాళీలో నిన్ను మీదకి పంపించే నిచ్చెనలూ వుంటాయి. నిన్ను కిందకి తోసేసే పాములూ వుంటాయి''

''కరక్ట్‌రా! నా ఆఫీసు వైకుంఠపాళీలో ఆ రంగారావుగాడే పెద్దపాము. వాడే నన్ను మింగెయ్యాలని చూస్తున్నాడు'' అన్నాడు దాను కసిగా పకోడీ ముక్క నములుతూ.

''వాడు పాము అయితే దాన్ని ఆడించే నాగస్వరం మన దగ్గరుంది బావా! ఇప్పుడు మనం ఆలోచించవలసింది ఆ పాము గురించి కాదు. నీ ప్రమోషన్ గురించి. నువ్వు ఆవేశాలకి, విప్లవాలకీ పోయి దెబ్బ తినేశావ్. ఆవేశాలకి పోయి విప్లవాలు సృష్టించిన క్రాంతికారులు తేలేని స్వతంత్రాన్ని శాంతియుతంగా గాంధీగారు తెచ్చేరు''

''అంటే నేనూ గాంధీగారి పోలసీ ఫాలో అయిపోవాలంటావా?''

''ఆయన పోలసీ ఫాలో అవడానికి నువ్వేమైనా దేశంకోసం పాటుపడుతున్నావా? నీ ప్రమోషన్‌కోసం పాటుపడుతున్నావ్. నువ్వు ఫాలో అవాల్సింది గాంధీయిజాన్ని కాదు. కాకాయిజాన్ని''

''ఏయిజాన్ని?'' రెట్టించి అడిగేడు దాను.

''కాకాయిజాన్ని బావా! కమ్యూనిజం, సోషలిజం, ఫేసిజమ్, నక్సలిజమ్లాంటి నూటడబ్బయ్యారు ఇజాల్లో మొట్టమొదటిది కాకాయిజమే''

ఆ మాటలు అంటున్నప్పుడే సుబ్బయ్యానాయుడికి ఒళ్లుపట్టే కొండలరావు అక్కడకొచ్చేడు. నాయుడు బట్టల విప్పి చిన్న తువ్వాలు కట్టుకుని అక్కడున్న బల్లమీద బోర్లా పడుకున్నాడు. కొండల్రావు ఒళ్లుపట్టనారంభించేడు.

''నేనీ మాలీష్ ఎందుకు చేయించుకుంటున్నానో చెప్పు బావా'' అన్నాడు నాయుడు తన అసిస్టెంటు నోటికి అందించిన గ్లాసులోనించి మందుతాగుతూ.

''మాలీష్ చేయించుకుంటే ఒళ్లంతా సుఖంగా వుంటుందని పట్టించుకుంటున్నావు''

''కరక్ట్! కాకాయిజమ్ కూడా యీ మాలీష్ లాంటిదే. పట్టేవాడికి కష్టంగావున్నా పట్టించుకునే వాడికి మాత్రం చాలా ఆనందంగా వుంటుంది. నువ్వు మధ్యలో మాట్లాడకుండా





వుంటే కాస్త వివరంగా చెప్తాను. ఈ కాకాయిజాన్ని క్రీస్తు పూర్వం సున్నానున్నా ఒకటో సంవత్సరంలో కైలాసంలో వున్న వినాయకుడు కనిపెట్టేడని కాకా మహర్షి తన కాకాతాకీయం అనే గ్రంధంలో రాసేడు.

క్రీస్తుపూర్వం, ఇప్పుడు నేను చెప్పిన సంవత్సరంలో ఓ ఆదివారం పొద్దుట ఈశ్వరుడు తన ఇద్దరు కొడుకులైన వినాయకుణ్ణి, కుమారస్వామినీ పిల్చి "నాయినలారా, ఈ రోజు సర్దాగా మీ యిద్దరికీ రన్నింగ్ రేసు పెడదామనుకుంటున్నాను. మీరిద్దర్లో ఎవరైతే ఈ విశ్వమంతట్నీ మూడుసార్లు తిరిగి, ముందుగా వస్తారో వాళ్లకి మన ప్రమథగణాల మీద ఆధిపత్యం ఇస్తాను" అన్నాడట. వెంటనే కుమారస్వామి క్షణం ఆలస్యం చెయ్యకుండా తన నెమలి వాహనం ఎక్కి రయ్‌మంటూ ఆకాశంలోకి ఎగిరిపోయేడు. కానీ వినాయకుడు తొందరపడకుండా క్షణంపాటు ఆలోచించేడు. "తమ్ముడిది నెమలి వాహనం కాబట్టి రయ్‌మంటూ ఎగిరిపోయేడు. కానీ మనది మూషికవాహనం. దీనిమీదెక్కి బయలుదేరితే ఓడిపోవడం ఖాయం" అనుకుంటూ వాళ్లనాన్నని కదలకుండా కూర్చోమని చెప్పి అతని చుట్టూ మూడుసార్లు తిరిగేసి "నేనే గెలిచేను" అంటూ చంకలు గుద్దుకున్నాడట. కాస్సేపు పోయేక కుమారస్వామి తిరిగొచ్చి "నేనే గెలిచేను" అన్నాడట. కాదు నేనే గెలిచేను అంటూ వినాయకుడు వాదించేడు. "అదెలా అన్నయ్యా... నువ్వు అసలు ఇక్కడనించి కదలందే" అన్నాడు కుమారస్వామి.

"నేనిక్కణ్ణించి కదలని మాట నిజమే. కానీ మననాన్నగారంటే ఎవరు? విశ్వనాధుడు. అంటే ఈ విశ్వానికే నాథుడు. ఆయనే విశ్వం. అందుకే ఆయన చుట్టూ మూడు సార్లు తిరిగేను. అంటే విశ్వమంతా మూడు సార్లు తిరిగేసినట్టేగా" అంటూ తనలాజిక్కు వినిపించేడు వినాయకుడు.

ఆ లాజిక్కుని ఒప్పుకోకుండా కుమారస్వామి గొడవపెట్టినా, ఈశ్వరుడుమాత్రం వినాయకుడి మాటలకి లొంగిపోయి, ప్రమదగణాధిపత్యాన్ని అతనికే కట్టబెట్టేడు. ఈ కథలో మనకేం అర్థమైంది? వినాయకుడు కాకాయిజమ్‌ని ఫాలోఅయ్యేడు. ఆ ఇజమ్‌కి ఎవరు లొంగిపోయేరు? ఒకటీ, రెండు కాదు, మూడు కళ్లున్న మహాదేవుడే లొంగిపోయేడు. అంటే, కాకాయిజానికి మూడుకళ్లున్న మహాదేవుడే లొంగిపోగాలేంది, రెండుకళ్లున్న మానవులు లొంగకతప్పదనేగా దీని తాత్పర్యం!"

సుబ్బయ్యనాయుడు మాట్లాడ్డం ఆపుచేసి, మాలీష్‌చేసిన కొండ్రావుకి ఓ ఖాళీసీసాలోకి రెండు పెగ్గులు మందు పోసి "యిదే, యివాళ నీకిచ్చే ఫీజు" అన్నాడు.

పుత్రకామేష్ఠి యజ్ఞంచేసి పాయసాన్ని పొందిన దశరథుడిలాగ ఆనందంగా నవ్వుకుంటూ మాలీష్‌వాలా వెళ్లిపోయేడు.

చిలకల దాసుకి నాయుడు చెప్పిన కాకాయిజమ్ కొంతవరకే నచ్చిందిగానీ, అంతా నచ్చలేదు. "కాకా పట్టడంవల్ల పనులు నెరవేరేమాట నిజమేగాని, అందువల్ల మన ఆత్మగౌరవం, వ్యక్తిత్వం దెబ్బతింటాయిగా" అంటూ తన సంశయాన్ని వినిపించేడు. నాయుడు అతన్ని జాలిగా చూసి, జాలీగా నవ్వుతూ, రెండు సిప్‌లు సిప్‌చేసి మళ్లీ చెప్పనారంభించాడు.

కాకాయిజమ్ అంటే ఏమిటనుకుని నువ్వా ప్రశ్న వేశేవు బావా? కాకా అనగా బాకా! బాకా అనగా పొగడ్త! పొగడ్త అనగా మస్కా! మస్కా అనగా మాయ! మాయ అనగా తెలివి! తెలివి అనగా లౌక్యం! చూసేవా కాకాయిజమ్ తిరిగి తిరిగి లౌక్యం అనే రూపం ధరించింది. తెలివితేటల్లో లౌక్యం వుండాలి. లౌక్యం లేని తెలివితేటలు సత్తురూపాయిల్లా చెలామణీకి పనికిరావు. పూర్వకాలంలోని కవులు నీకంటే, నాకంటే తెలివైనవాళ్లేకదా! ఆకాలంలోని రాజులు కుస్తీలు పట్టడానికి పహిల్వాన్లని పోషించినట్లు, కవిత్వాన్ని చెప్పడానికి కవుల్నిగూడా పోషించేవారు. ఆ కవుల్లోగూడా తెలివైన కవులు, లౌక్యం తెల్సిన కవులని రెండురకాలుగా ఉండేవారు. తెలివైన కవులు దైవస్తోత్రాలు, ప్రకృతి వర్ణనలు, ప్రబంధాలు రాసి గొప్పవాళ్లనిపించుకుంటే, లౌక్యం తెల్సిన కవులు ప్రభువుల్ని పొగుడ్తూ పద్యాలు చెప్పేవారు. వారు రాసిన గ్రంధాల్ని ప్రభువులకే అంకితమిచ్చి, యిదే నా జీవిత ధ్యేయం అంటూ వినయంగా చెప్పి కాకాబ్రాండ్ నవ్వుల్ని కాకరపువ్వొత్తుల్లా వెలిగించేవారు.

కాకాయిజమ్ అండ్‌కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్‌వారు తీసిన లెక్కలప్రకారం, దేవుణ్ణి పొగుడుతూ గ్రంధాలు రాసిన కవులకంటే, రాజుని పొగుడుతూ రాసిన కవులే ఎక్కువ డబ్బు సంపాదించుకున్నారని తేలింది. వాళ్ళు రాజుల్ని పొగడ్డం మళ్ళీ అలాగా యిలాగా కాదు. మాటవర్సకి ఒకరాజుగార్ని ఓ కాకా కవి ఎలా పొగిడేడంటే, "రాజా, నిన్న తమరు ఏనుగు అంబారీమీద వూళ్ళోకి బయలుదేరినప్పుడు ఆకాశమంతా మబ్బేసింది. ఎందుచేతో తెలుసా? తనకంటే లక్షరెట్లు ధవళకాంతులీనుతున్న తమ ముఖ మండలమును చూసి, యీ లోకానికి వెలుతురివ్వడానికి ఆ ఒక్క ముఖమూ చాలు, యింక నేనెందుకూ అని సూర్యభగవానుడు సిగ్గుపడిపోయి మబ్బులచాటున దాక్కుండిపోయాడు" అని. వెంటనే ఆ రాజుగారు ఆ కాకా కవిని మెచ్చుకుని, కాకినాడ ప్రాంతంలోవున్న తన పది ఎకరాల స్థలాన్ని ఆ కవిగారికి బహుమతిగా యిచ్చేసేడు. సామర్లకోట రైల్వేస్టేషన్ని అదిగో ఆ స్థలంలోనే కట్టేరని చరిత్ర చాటుతోంది. నిజానికా రాజుగారి ముఖం తాటిబెల్లం దిమ్మలాగా నల్లగా, మొద్దుగా వుండేదట. అయినా ఆ కవిగారి పొగడ్త లోని నిజా నిజాలు తెల్సుకోలేక, ఆ తాటిబెల్లం రాజావారు దభేలుమంటూ కవిగారి బుట్టలో పడిపోయేరు. అంటే, అది ఆ కవిగారి గ్రేట్‌నెస్! ఆ పొగడ్తకి పడిపోవడం రాజుగారి వీక్‌నెస్! నిజంచెప్పి నిష్ఠూరవడేబదులు, అబద్ధాలుచెప్పి ఆత్మీయులవడం బెస్టూ అని ఆనాటి కాకా కవులందరికీ, కాగుణింతం నేర్చుకున్నప్పుడే అర్థమైపోయింది.

సరే, రాజులు పొగడ్తలకి లొంగిపోయేరంటే అర్థంవుంది. ఎందుకంటే అధికారంరీత్యా అతనూ రాజే అయినా, అతనూ మానవుడేగా! కానీ, ఈ సృష్టికి కారణభూతుడయిన భగవంతుణ్ణి కూడా ప్రసన్నంచేస్కోడానికి దండకాలు, స్తోత్రాలనే ఆధారంచేసేరు. ఆ రెండింటి నిండా పొగడ్తలేకదా! పోనీ అవన్నీ పాతకాలం కబుర్లు. ఇప్పుడు రాజకీయాల్లో జరుగుతున్న చెక్కభజనల సంగతేమిటి?

"ప్రజలే నా దేవుళ్ళు, వారు నివసించే వూరిళ్లే నాపాలిటి దేవుడి గుళ్ళు, వాళ్లని పూజించి, సేవించడమే నా జీవితధ్యేయం" అంటూ ప్రతీ నాయకుడూ కొడుతున్న గేస్‌కబుర్లేమిటి? కాకాయిజమ్‌కాదా? ఎలక్షన్లో గెలిచేక, ఎమ్మెల్యేలు చీఫ్‌మినిస్టర్ని యంపీలు, ప్రైమ్‌మినిస్టర్ని పొగిడే పొగడ్తలన్నీ కాకాయిజమ్ కాదా? మా నాయకుడు అడగాలేగాని, నా తలకాయ నరికి ఆయనకి కొబ్బరికాయలాగా నైవేద్యం పెట్టేస్తానని స్టేట్‌మెంటివ్వడం కాకాయిజమ్‌కాదా? తమ నాయకుడు కనబడగానే, కాళ్లదగ్గర కొబ్బరికాయలు కొట్టేసి, పూజలు చెయ్యడం కాకాయిజమ్‌కాదా?

ఇలాంటివాటివల్ల ఆత్మగౌరవం హరించుకుపోదా? వ్యక్తిత్వం వల్లకాటికెళ్లిపోదా? అని నువ్వు అన్నావుకాబట్టి అడుగుతున్నాను. ఇప్పుడునేను చెప్పిన కవులు, భట్రాజులు, నాయకులు, అధికార్లు వీళ్లందరికీ ఆత్మగౌరవాలు మంటకల్సిపోయాయా? లేవే! వాళ్లకి చరిత్రలోనైనా, సమాజంలోనైనా యింత గౌరవం లభించింది. అంతంత పెద్దవాళ్లే ఆలోచించని ఆత్మగౌరవాలు, నీకూ, నాకూ ఎందుకు బావా?

మరో వుదాహరణ చెప్తాను. ఓ చెట్టుమీద ఓ కాయ వుందనుకో. ఒకడు కష్టపడి చెట్టెక్కి దాన్ని కోసుకుంటాడు. వాణ్ణి కష్టజీవి అంటాం. వాడు చెట్టు ఎక్కేలోగా మరొకడు నేలమీద నిలబడే రాయి విసిరి, ఆ కాయని తన కాళ్లదగ్గర పడేలా చేసుకుంటాడు. వాణ్ణి తెలివైనవాడు అంటాం"

చిలకల దానుకివ్వుడు కాకాయిజం తాలూకు తత్వం దాదాపు పూర్తిగా తలకెక్కినట్టయింది.

"అయతే, కాకాయిజమ్ అంటే తెలివితేటలు ప్రదర్శించడమే తప్ప మరో తప్పువనేం కాదంటావ్?"

అతని ప్రశ్నకు, ఆవులిస్తూ, బల్లమీద పడుకోబోతున్న నాయుడు మళ్లీ లేచి, బద్ధకంగా ఒళ్లు విరుచుంటూ అన్నాడు-"నేను చెప్పింది తెలివితేటలు కావాలని కాదు బావా, లౌక్యం కావాలని మొత్తుకుంటున్నాను"

"తెలివితేటలంటేనే, లౌక్యం కదా?"

"అదే తప్పు. వెనకటికో రాజుగారు ముగ్గురు వ్యక్తుల్ని మంత్రిపదవికి ఇంటర్వ్యూ చేస్తూ ఓ ప్రశ్న అడిగేడు. మనదేశంలోవున్న కాకుల సంఖ్య ఎంతా? అని అడిగేడు. కాకులు ఒక





చేట నిలకడగా వుండవు, పైగా అవి ఈ దేశంనించి ఆ దేశం ఎగురుతుంటాయి కాబట్టి వాటి నంఖ్య ఇంతా అని చెప్పడం కష్టం అన్నాడు మొదటివాడు.

వాడు యదార్థం చెప్పేడు. అంటే మూర్ఖుడన్నమాట!

రెండోవాడు ఏమన్నాడంటే, మనుమల్లో లేని ఐకమత్యం కాకుల్లో వుంటుంది కాబట్టి, ఓ కాకిని చంపి మన కోటముందు పడెయ్యండి, దానిమీద సానుభూతితో దేశంలోని మిగతా కాకులు తప్పకుండా వాలుతాయి. అప్పుడు నేను క్షణాలమీద లెక్కగట్టి మీకు చెప్పేస్తాను అన్నాడు.

వాడు కాకుల మనస్తత్వాల్ని గూడా తెల్సుకున్న తెలివైనవాడు.

అయినా రాజు సంతృప్తి పడకుండా మూడోవాణ్ణి అడిగేడు, వాడుఎంతమాత్రం తడుముకోకుండా, మనదేశంలో రెండులక్షల, డబ్భైమూడువేల ఆరువందల తొంభైరెండు కాకులున్నాయి ప్రభూ అన్నాడు.

మనదేశంలో మరీ యింతెక్కువగా కాకులున్నాయా? అంటూ రాజుగారు ఆశ్చర్యపోయేరు.

"చిత్తం మహాప్రభో, తమరి పరిపాలనలో వర్షాలు పుష్కలంగా కురుస్తున్నాయి. పంటలు సమృద్ధిగా పండుతున్నాయి. అంచేత ప్రజలు తినగలిగినంత తిని, రేపటి గురించి భయపడకుండా, మిగిలిన అన్నాన్ని బయట పారబోస్తున్నారు. వాటిని తింటానికి కాకులు విపరీతంగా ఎగబడుతున్నాయి. మీరు రాజ్యానికొచ్చిన మర్నాటినించి బయటదేశాలనించి కూడా కాకులొచ్చి ఈ దేశంలో స్థిరపడిపోయేయి. అంచేత మనదేశంలో కాకుల నంఖ్య ఎక్కువయింది" అన్నాడు.

అతను చెప్పిన జవాబులో లౌక్యంతోపాటు ఇన్‌డైరక్టుగా రాజుగార్కి పొగడ్తకూడా ఉంది. దాంతో రాజుగారు నగం పడిపోయినా, తమాయించుకుని యింకా అతన్ని ప్రశ్నించాలని అడిగేడు- "నువ్వు చెప్పిన సంఖ్యకంటే ఎక్కువ కాకులుంటేనో" అన్నాడు.

దానిక్కూడా వాడు తడుముకోకుండా జవాబు చెప్పేడు. "ఈవారంలో సంక్రాంతి పండగ కదా, ఈ దేశంలో పుష్కలంగా తిండి లభిస్తుంది కాబట్టి, మన కాకులు పొరుగూళ్లనించి తమ బంధువుల్ని పండక్కి పిల్చివుంటాయి. అంచేత నేను చెప్పిన నంఖ్య తప్పయినా కావచ్చు" అని. రాజుగారు మరో ప్రశ్న వేసేడు- "ఒకవేళ నువ్వు చెప్పిన నంఖ్యకంటే కాకులు తక్కువుంటేనో?" అని.

"చిత్తం మహాప్రభో, దానికీ అవకాశం వుంది. ఎందుకంటే తమకు బద్ధశత్రువు అయిన నరసింహవర్మ రాజ్యంలో పంటలు పండక ప్రజలు కటకటలాడిపోతున్నారు. ఇంకాదేశంలోని కాకులకి ఎక్కడ తిండి వుంటుంది? అంచేత మనదేశంతాలూకా కాకులు కొన్ని ఆ దేశానికి వెళ్లి, తమ స్నేహితుల్ని బంధువుల్ని కలిసి, మీకేం ఫర్వాలేదు, మాదేశంలో తిండీ, తిప్పలకేం లోటులేదు. మారాజుగారు దయార్ద్రహృదయులు కాబట్టి, మీరు శత్రుదేశపు కాకులయినా మీకు తన రాజ్యంలో చోటు యిస్తామని చెప్పి, వాటిని తీస్కొరావడానికెళ్లుంటాయి. అంచేత నాలెక్క తప్పయినా ఆశ్చర్యంలేదు" అన్నాడు.

వాడు లౌక్యం తెలిసినవాడు!

ఈ కథలో మనకి తెల్సిందేమిటి. ఆ దేశంలో ఎన్ని కాకులున్నాయో, ఆ లౌక్యుడికీ తెలియదు. అయినా ఏదో నోటికొచ్చిన అంకె చెప్పేసేడు. ఆ నంఖ్య తప్పా, రైటా అని తేల్చడానికి రాజుగారు ఎలాగూ కాకుల్ని లెక్కపెట్టించలేరని వాడికి తెలుసు. అది ఆసరాగా తీస్కొని, పబ్లోపనిగా ఈ కాకుల లెక్కలోనే, తన కాకాయిజమ్‌తో రాజుని పొగిడి అతన్ని బోర్లా పడగొట్టి మంత్రిపదవికి సెలక్ట్ అయిపోయేడు. ఇదీ తెలివికి, లౌక్యానికీ వున్న డిఫరెన్సు"

చిలకల దాను పూర్తిగా సంతృప్తిచెందేడు. "అయితే యిప్పుడు నన్నెలా ప్రొసీడ్ అవమంటావు?" అన్నాడు.

"నీకు ప్రమోషన్ యిచ్చేదెవరు?"

"మా జి.యమ్.గారు"

"ఆయనకి వెంటనే ఓ మందుపార్టీ కొట్టించు"

"ఛ! మందుపార్టీకి పిలిస్తే ఏమనుకుంటాడో"

"మునీశ్వరులంతటివాళ్లే యజ్ఞాలుచేస్తూ దేవతల్ని ప్రార్థిస్తూ, నీకు కుండలకొద్దీ సోమరసం యిస్తాను. నేను అడిగిన కోర్కెనిమాత్రం

లేదనకు అంటూ దేవతలకి మందు ఆఫర్‌చేసేవారు. సోమరసం అంటే, ఓరకమైన విప్పసారాలాంటిదే! అంతటి దేవతలే మందుకోసం ఎట్రాక్ట్ అవగాలేంది, మీ జి.యమ్. ఓ లెక్కా?'' అంటూ పకపకమని నవ్వేడు నాయుడు.

''నేను రెడీ అనుకో... కానీ అతను మందు తాగుతాడా అని?''

''ఎందుకు తాగడు? అయితే సొంత డబ్బు ఖర్చుపెట్టి చచ్చినా తాగడు. ఎవరైనా యిస్తే చచ్చినా వదలడు. ఆయనగారి సంగతి నీకంటే నాకే బాగా తెలుసు. మందుమాత్రం కాస్త కాస్ట్లీగా వుండేటట్టుచూడు. ఓ వెయ్యిరూపాయలు నీవికావనుకో''

చిలకలదాసు ఆలోచనలో పడ్డాడు. యివాళ యిరవై ఏడోతారీఖు. మరో నాలుగు రోజులదాకా జీతమందదు. ఈలోగా వెయ్యి రూపాయిలు ఎక్కడనుంచి వస్తాయి. అంచేత ఫస్ట్ తారీఖు నాడు యిస్తానన్నాడు. నాయుడు కస్సుమంటూ లేచేడు. ''రేపు చెయ్యాల్సిన పనిని యివాళే చెయ్యడం వుత్తముల లక్షణం అని ఓ ఇంగ్లీషు కవి చెప్పేడు. దేనిగురించి చెప్పేడు? ఇదిగో యిలాంటి మందుపార్టీల గురించే చెప్పేడు. ఓపక్కనుంచి రంగారావుగాడు గోతికాడ నక్కలా ఎదురుచూస్తున్నాడని చెప్తూనే, మీ జి.యమ్.కి పార్టీయివ్వడం ఆలస్యం చేస్తానంటావేమిటి? రేపే యిచ్చెయ్! యింక డబ్బు అంటావా? నీచేతికి వేలుంది, వేలుకి వుంగరం వుంది. ఈ వీధిచివర వెండి, బంగారు నగల మీద అప్పులివ్వబడునూ అని బోర్డు పట్టుక్కూర్చున్న మార్వాడీ వున్నాడు'' అలా చెప్పేసి సుబ్బయ్యనాయుడు బల్లమీద నిద్రపోయి గురకలు పెట్టసాగేడు. చిలకల దాసు మర్నాటి కార్యక్రమం గురించి ఆలోచిస్తూనే సీసాలో మిగిలిందంతా తాగేసేడు.

★ ★ ★

మర్నాడు వుదయం ఏడుగంటలకే చిలకలదాసు డైరక్టుగా జి.యమ్.గారింటికి వెళ్లిపోయేడు. ఆఫీసులో అడిగితే ఆయన పార్టీకి రావడానికి మొహమాటపడొచ్చు, లేదా రంగారావు సైంధవుల్లా అడ్డుపడిపోవచ్చు. దాను వెళ్లే టైముకే జి.యమ్.గారు కాంపౌండులోని మొక్కలకి వాటరింగ్ చేస్తున్నాడు. అతనికి వినయంగా నమస్కరించి ''నేనుండగా తమకెందుకండీ ఈ శ్రమ?'' అంటూ అతని చేతిలోనించి రబ్బరు పైపు తీసుకుని చిలకల దాసే, మొక్కలకి నీళ్లుపోసే పని ఆరంభించేడు. జి.యమ్.గారు అక్కడనించి వెళ్ళిపోయేరు.

ఓ పదినిమిషాలపాటు ఆ పనిని శ్రద్ధగా చేసేక, మళ్లీ జి.యమ్.గార్ని కలుసుకున్నాడు. అప్పుడాయన వ్యాయామంచేస్తూ బస్కీలు తీస్తున్నాడు.

''నేనుండగా మీకెందుకండీ శ్రమ? నేను బస్కీలు తీసిపెడతాగా, మీరు ఆగిపొండి'' అంటూ అతన్ని ఆపుచేసి తనే బస్కీలు తీయబోయేడు, కానీ, జి.యమ్.గారు చాలా సీరియస్‌గా అడిగేడు- ''నేను నీ కంటికి ఎలా కనిపిస్తున్నానయ్యా?''

''అహల్యకంటికి శ్రీరాముల్లా కనిపిస్తున్నారు సార్''

''నేను శ్రీరాముడినైతే కావచ్చేమోగాని, నువ్వు అహల్యవెలా అవుతావయ్యా? నువ్వు ఆడదానివి కాదుగా! అయినా, యిప్పుడు నా ఆరోగ్యంకోసం నేను బస్కీలు తీస్తున్నాను. నాబదులు నువ్వు బస్కీలు తీస్తే ఎలా. యింతకీ యింత పొద్దున్నే ఎందుకొచ్చేవో చెప్పు''

దాసు చెప్పేడు. అతను ముఖం బిగించి బస్కీలు తీస్తూనే ''రాలేనయ్యా, వర్కు చాలా టైట్‌గా వుంది'' అన్నాడు.

''వర్కు ఎంత టైట్‌గా వున్నాసరే, మీరుమాత్రం నాకు వరం యివ్వకతప్పదు''

జి.యమ్.గారు వెంటనే జవాబు చెప్పకుండా, కాస్సేపు ఆగి, అక్కడికక్కడే జాగింగ్‌చేస్తూ ''నీకు వరం యిచ్చెయ్యాలనే వుంది. కానీ, నా వర్క్ పొజీషన్ మాత్రం చాలా టైట్‌గా వుంది'' అన్నాడు.

చిలకలదాసు కూడా అతనిపక్కనే తనూ జాగింగ్ చేస్తూ మాట్లాడేడు ''మీరు వరం యిచ్చేదాకా నేను కదలను''

''నువ్వా మాటంటావని నాకు తెలును. నీకు వరం యివ్వాలనే వుంది. నువ్వు కూడా ఏ డాల్ఫిన్ హొటల్‌కో తీసుకెళ్లి, ఓ ఏ.సీ. రూమ్ బుక్‌చేసి, రాయల్ శెల్యూట్ విస్కీ యిస్తావని తెలుసు. కానీ... నా పొజీషన్ సంగతే ఆలోచిస్తు

న్నాను'' అన్నాడు జి.యమ్. దానువైపు చూడ కుండా కాంపౌండ్‌మీదున్న కాకిని చూస్తూ. చిల కల దానుకి అతను కోరిన కోరికలు మింగుడువ డలేదు. మందువరకు అయితే అతను అడి గిన బ్రేందు యివ్వొచ్చు. కానీ, డాల్ఫిన్ హొట లూ, ఏసీ రూమూ అంటున్నాడే! కాస్త తమా యించుకుని, నీరసమైన గొంతుతో "అయినా తమరు నాకు వరం యివ్వక తప్పదు'' అన్నా డు.

"అబ్బా... నువ్వు నన్ను మరీ యిబ్బంది పెట్టేస్తున్నావయ్యా. నా కారు రిపేర్లో వుంది కాబట్టి, ఆ హొటల్‌కి వెళ్లడానికి, తిరిగి రావ డానికీ ఓ టేక్సీ ఎంగేజ్ చేస్తావని నాకు తెలును. మా మిస్సెస్‌కి ఒంట్లో బాగులేదు కాబట్టి, ఈ రాత్రికి వంట చెయ్యదు, కాబట్టి, ఓ రెండు బిర్యానీ పేకెట్సు, చిల్లీ చికెన్, రెండు ప్రాన్స్ పకోడా పార్శిల్ చేయించి టేక్సీలో పెట్టి స్తావని నాకు తెలుసనుకో, అయినా...'' అంటూ పక్కనున్న దానువైపు చూసేడు. అతను నేల మీద చతికిలబడిపోయి, ఇంకో క్షణం ఆగితే "ఈ పార్టీ కేన్సిల్" అని అరవడానికి సిద్ధంగా వున్నట్టు కనిపించేడు. అతని మనోభావాన్ని యిట్టే గ్రహించిన జి.యమ్ "ఒక్కే ఒక్కే... నిన్ను డిసప్పాయింట్ చెయ్యడం నాకిష్టంలే దు'' అంటూ బిగ్గరగా అరిచేడు.

* * *

జి.యమ్.గారు మందుపార్టీ విషయంలో వైట్ ఎలిఫెంట్ అని అర్థం అయిపోయింది కాబట్టి, వుంగరం తనఖాపెట్టి తీసుకున్న వెయ్యి రూపాయల్తోపాటు మరోచోట ప్రోనోటు మీద సంతకంచేసి మరో పదిహేనువందలు అప్పు తీసుకున్నాడు. జి.యమ్.గారు కోరిన విధంగా అన్ని ఏర్పాట్లూ పకడ్బందీగా చేసాక, ఆయన సంతృప్తి చెందేక, మెల్లగా తన మనసులోని మాటని బయటకి వదిలేడు.

"అనకాపల్లి బ్రేంచిలో మేనేజరు పోష్టు ఖాళీ అయిందిగదా! దాన్ని యీనెల్లో ఫిలప్‌చే స్తారనుకుంటాను'' అన్నాడు.

"చెయ్యాలికదా'' అన్నాడు జి.యమ్. చిల్లీ చికెన్ నములుతూ.

"అందర్లోకీ నేనే సీనియర్‌ని...''

"తెలుసుగదా''

"మరి నాకు ప్రమోషన్ ఆర్డర్సు...''

"శ్రీనివాసమూర్తిగారు తప్పకుండా వేస్తారు''

"శ్రీనివాసమూర్తా? ఆయనెవరండీ?'' ఆశ్చ ర్యంగా అడిగేడు.

"ఎల్లుండినించి మీ బ్రేంచికొచ్చే జెనరల్ మేనేజరుగారు''

"మరి... మీరు?''

"నాకు ట్రాన్స్‌ఫరైపోయిందిగా! నేను రేపు రాత్రికే విజయవాడ బ్రాంచీకి వెళ్లిపోతు న్నాగా''

జి.యమ్.గారు నిదానంగా చెప్తూ మందు తాగుతున్నా చిలకల దానుమీద ఒక్కో అక్షరం ఒక్కో పిడుగుని కురిపించింది! తనకి రెండు వేల అయిదువందలు ఖర్చైపోయేక "నాకు ట్రాన్స్‌ఫరైపోయిందన్న చావుకబురు చెప్త న్నందుకు, ఆ సీసాతో అతని నెత్తిమీద కొట్టి చంపెయ్యాలన్నంత కోపం వచ్చింది. ఈ సంగతి పొద్దుటే చెప్పివుంటే, ప్రమోషన్ సంగ తెలావున్నా రెండువేల అయిదువందలు మి గిలివుండేవి. అయినా తమాయించుకుంటూ ఆఖరిబాణం ప్రయోగించాడు.

"అంటే, తమరు విజయవాడ వెళ్లిపోతూ వెళ్లిపోతూ, నాకు ప్రమోషన్ యివ్వాలనే ఆ ఒక్క అమృత వాక్యాన్ని ఆ శ్రీనివాసమూర్తిగా ర్కి చెప్పి, నాకు ఆర్డర్సు వేయించి వెళ్లిపోతార నుకుంటాను''

జి.యమ్. అప్పటికే బాగా ఔట్ అయిపోయే డు. "ఛిఛీ! ఆ శ్రీనివాసమూర్తిగాడికి నేను చెప్పడమా? నెవ్వర్, వాడో ఇడియట్, వాడో క్రేక్‌మాస్టర్ జెనరల్! వాడూ, నేనూ గుడివాడ బ్రేంచిలో వున్నప్పుడు చాలాసార్లు గొడవపడ్డాం. అప్పట్నించీ వాడితో మాట్లాడ్డం మానేసేను. రేపు కూడా వాడితో ఆఫీసు హేండోవర్ గురించి తప్ప మరో విషయమేదీ మాట్లాడను! ఎనీహౌ, మిస్టర్ చిలకలదాస్, యూఆర్‌ఏ గ్రేట్‌మేన్! నాకు సడన్‌గా ట్రాన్స్‌ఫర్ అయినా, ఆఫీసులో ఎవరికీ ఈ విషయం తెలియకపోయినా, నామీద అభిమానంతో నువ్వా విషయాన్ని తెల్సుకుని మరీ నాకు పార్టీ యిచ్చేవంటే, యూఆర్ సోగ్రేట్! మన స్టేఫ్ నాకు సెండాఫ్ పార్టీ యిచ్చే అవకాశంలేదు. అయినా వాళ్లంద రితరపునా నువ్వే నాకు పార్టీ యిచ్చావను కుంటాను'' అంటూ దభ్‌మంటూ




మంచంమీద పడిపోయేడు.

చిలకలదాను, ఆయన ముందు తాగితే మర్యాదగుండదని ఒక్క చుక్క గూడా తాగలేదు. అయినా జి.యమ్. యిచ్చిన షాక్‌తో అతని మెదడు మొద్దుబారిపోయింది. ఇప్పుడేంచెయ్యాలి? కడుపుమంటతీరేలాగా వీణ్ణి కాలికొచ్చిన తన్ను, చేతికొచ్చిన గుద్దూ గుద్ది వెళ్లిపోతే! అందువల్ల తన ప్రమోషన్ రాదునరిగదా, వీడిలా మంచంమీదే రేపు రాత్రివరకూ వుండిపోతే, తను రేపటి రూమ్‌రెంటు కూడా కట్టుకోవాలి! అని తనమీద తనే చిరాకుపడుతూ, బేరర్స్‌ని పిల్చి, వాళ్ల సాయంతో జి.యమ్.ని బయటవరకూ మోసుకెళ్లి టేక్సీలో పడుకోబెట్టి జి.యమ్.గారి యింటికి పోనిమ్మన్నాడు.

తీరా ఆ యింట్లో ఆయన్ని స్పృహలేకుండా, ఏదో లగేజీని దింపినట్టుగా దింపితే, అతని భార్య దానుమీద కన్నుమంటూ లేచింది-

"మా ఆయన్నింతలా తాగిస్తావా? నీకేమైనా బుద్ధుందా? నువ్వసలు మనిషివే? ఆయనకసలే లివర్‌ట్రబులుంది. అలాంటప్పుడు ఆయనకింతలా మందు తాగిస్తావా? మనిషికి ఓ కన్నుపోతే మరో కన్నుతో బ్రతకొచ్చు. ఓ కిడ్నీ చెడిపోతే మరో కిడ్నీతో బ్రతకొచ్చు. కానీ - లివర్‌మాత్రం ఒక్కటే వుంటుందయ్యా! మేం యిక్కడినుంచి రేపు రాత్రి వెళ్లిపోతున్నాం కాబట్టి సరిపోయింది. లేకపోతే మా ఆయన మీద హత్యాప్రయత్నం చేసేవని నీమీద పోలీస్ కంప్లయింట్ యిచ్చేదాన్ని" అంటూ చెడామడా చెరిగేసింది.

చిలకలదాను మాటపడిపోయినవాడిలా ఆవిణ్ణి చూస్తూ వుండిపోయేడు తప్ప ఒక్క మాటకూడా మాట్లాడకుండా బయటకి నడిచేడు.

* * *

జరిగిన నష్టం, జి.యమ్. భార్య తిట్టిన తిట్లు, మర్చిపోలేక చిలకల దాను యింట్లో కూర్చొని బాధపడుతుంటే గాయంమీద గొడ్డుకారం జల్లినట్టు అతని భార్య వరలక్ష్మి మాటల్తో అతన్ని దులిపేసింది.

"ఆ వుంగరం మన పెళ్లికి మా నాన్న యిచ్చింది. దాన్ని యిన్ని సంవత్సరాల్లో ఏనాడూ తనఖా పెట్టలేదు. యిప్పుడా దిక్కుమాలిన మందుపార్టీకోసం తనఖా పెడతారా?" అంటూ తను పెట్టే చీవాట్లల్లో రెండుపాళ్లు సెంటిమెంటు కూడా కలిపింది.

"నేను తాగడానికి తనఖా పెట్టలేదే! ప్రమోషను వస్తుందికదాని తనఖా పెట్టేను. అయినా నాకు ప్రమోషన్ రాలేదో రాలేదో అని నువ్వేగా రోజూ నన్ను కాల్చుకుతినేదానివి" అంటూ వుక్రోషంగా మాట్లాడుతుండగా సుబ్బయ్యనాయుడు సుడిగాలిలా ఆ యింట్లోకొచ్చేడు. అతన్ని చూస్తూనే దాను "యిదిగో యిదంతా నీ తమ్ముడిచ్చిన అయిడియావల్లే వచ్చింది" అన్నాడు కోపంగా.

"యిది మరీ బాగుంది బావా! అగ్గిలో పెట్టి ఇనుమును లొంగదీస్కోవాలన్నట్టు, మందులో ముంచి వాడి మెడలు వంచమన్నానుగాని, వాడికి ట్రాన్స్‌ఫరైపోయింతర్వాత నిన్ను సెండాఫ్ పార్టీ యిమ్మన్నానా?" అన్నాడు నాయుడు. వరలక్ష్మి కూడా అతన్నే సమర్థిస్తూ మాట్లాడింది.

"వాడికి ట్రాన్స్‌ఫర్ అయిందన్న సంగతి నాకూ తెలీదు. ఫుల్‌బాటిల్ మింగేసేదాకా వాడూ ఆ సంగతి చెప్పలేదు. నేను ఫస్టుతారీఖునాడు పార్టీ యిస్తాన్రా అంటే, అబ్బెబ్బె యిలా ఆలస్యం చెయ్యడానికి కాకాయిజమ్ రూల్సు ఒప్పుకోవంటూ తొందరపెట్టేసేవ్"

ఇలా ఓ గంటసేపు నీది తప్పంటే నీది తప్పంటూ ఒకర్తో మరొకరు గొడవపడ్డంతోనే సరిపోయింది, మధ్యలో చిలకల దాను కొడుకు ప్రవేశించి, ఓ సినిమా పత్రికలో వచ్చిన మరో ప్రకటన చూపించి- "అందరూ కొత్తవాళ్లతో తీసే సినిమా స్కోప్ పిక్చర్ విత్ స్టీరియోఫోనిక్ సౌండ్ ఎఫెక్ట్స్ సినిమా నాన్నా! వంద రూపాయలు పంపిస్తే మేకప్‌టెస్టు, స్క్రీన్ టెస్టూ చేస్తారట, ఓ వంద యివ్వు నాన్నా" అంటూ అడిగేడు.

దానుకి కోపం ఆగక వాడి వీపుమీద దభీదభీమని రెండు దెబ్బలు వేసి "మళ్లీ మేకప్‌టెస్టూ, వందరూపాయలూ అన్నావంటే వీపు చీరేస్తాను వెధవా" అని కసురుకున్నాడు.

పవన్‌కుమార్ కూడా తండ్రిని ఎదిరిస్తూ వెక్కిరిస్తూ మాట్లాడేడు "ఔను నాన్నా... నేను సినిమా హీరోనవడానికి వంద రూపాయలు

అడిగితే, సినిమాలో విలన్లాగా డైలాగులు చెప్తావు. కానీ మీ ఆఫీసరుకి పార్టీలు యివ్వడానికి మాత్రం వేలకువేలు ఖర్చుచేస్తావు"

చిలకలదాను కొడుకుని కొట్టడానికి అక్కడున్న కర్రతీసేనరికి వాడు బయటకి పారిపోయేడు.

అతర్వాత అరగంట వరకూ చిలకలదాను నిరాశగా నిట్టూర్పులు విడుస్తుంటే సుబ్బయ్యనాయుడు అతన్ని పెరట్లోకి తీసుకెళ్లి వూరడించేడు- "నువ్వు నిరాశపడకు బావా! పాండవులంతటివాళ్లకి ప్రతీకారం తీర్చుకోడానికి పదమూడేళ్ల టైము పట్టింది. రాముడిదొకటే బాణం అని పాటలు పాడుకుంటాం. రామబాణానికి తిరుగులేదని భజనలు చేస్తుంటాం. కానీ, రావణాసురుణ్ణి చంపడానికి రాముడుగూడా చాలా బాణాలు వదలవలసివచ్చింది. అంచేత నేను చెప్పేదేమిటంటే పాత ఆఫీసరు పోయేడు. రేపట్నించి కొత్త ఆఫీసరు వస్తున్నాడు. ఆయనగారి పెర్సనల్ లొసుగులు, వాడి ఫేమిలీ డిటైల్సు వగైరా వగైరా అన్నీ నేనో వారంలోగా తెల్సుకుంటాను. నువ్వుకూడా నీకు తెల్సినమేరకి తెల్సుకో! రేపు నువ్వు ఏంచెయ్యాలంటే, మీ కొత్త జి.యమ్.గారు వచ్చీరాగానే ఆయన మెడలో ఓ పెద్దసైజు దండవేసెయ్! రెండుచేతుల్తో దండంపెట్టెయ్. అంటే యీయనమీద కాకాయిజమ్‌లోని మొదటి బాణంనించి, అన్ని బాణాలూ ప్రయోగిస్తాం" అంటూ చాలాసేపు ధైర్యంచెప్పేక నాయుడు తన భుజానికి తగిలించుకున్న సంచిలోనించి ఓ పకోడీ పొట్లాం తీసేడు.

"బావా, యివాళ నాదగ్గరకి సలహాలకోసం ఎవ్వరూ రాలేదు, కాబట్టి, ఈరోజు మనదగ్గర నో కేష్‌బేలన్స్. ఈరోజుకి ఫుడ్ ఖర్చు నాది, ఓ హాఫ్‌బాటిల్ మందు ఖర్చు నీది" అంటూ తను తెచ్చిన ఫుడ్ అని పకోడీ పొట్లాన్ని చూపించేడు. దానుకి ఒళ్లు మండిపోయింది. "అర్ధరూపాయి పకోడీ పొట్లాం నీవంతూను, డబ్బైరూపాయిల మందు బాటిలు నావంతూనా? నీ తెలివితేటలు నాదగ్గరకాదు" అన్నాడు.

నాయుడు అతన్ని కాస్సేపు ప్రాధేయపడ్డాక దాను ఒప్పుకున్నాడు. ఎంతో కొంత మందు వేస్తే తప్ప నిన్న జరిగిన విషయం మరుపుకొచ్చి నిద్ర పట్టదనే దానూ బోటిల్ తెప్పించడానికి ఒప్పుకున్నాడు.



కొత్త జి.యమ్.గారు ఆరోజే ఆఫీసు/కొస్తున్నారు. చిలకలదాను వందరూపాయిలు ఖర్చుచేసి ఓ పెద్దదండ తీసుకొచ్చేడు. ఆఫీసులో మరో నలుగురు చిన్న చిన్న దండలు తీసుకొచ్చేరు. "ఎవరు ఎన్నిదండలు తెచ్చినా, ఆఫీసుకి నూవర్నొంటుని నేను కాబట్టి నాదండే ముందు పడాలి" అంటూ అందరితోనూ ఖచ్చితంగా చెప్పేసేడు. రంగారావు జాడ ఎక్కడా కనిపించలేదు, అతను లేనందుకు దాను సంతోషించేడు.

ఆఫీసు ముందుకి కారు వచ్చింది. జనరల్ మేనేజర్ మూర్తిగారు కారు దిగేరు. అతన్ని చూసి చిలకలదాను ఆశ్చర్యపోయేడు. ఎందుకంటే ఆయన మెడలో అప్పటికే ఓ దండ వుంది. అతన్తోపాటు రంగారావూ కారు దిగేడు. అది మరీ ఆశ్చర్యం కలిగించింది.

దానుని చూసి రంగారావు "ఇహ్హిహ్హి" అంటూ వెకిలిగా నవ్వుతూ, ఆ దండ నేను వేసిందే అంటూ కళ్లతోనే సంజ్ఞ చేసేడు. దాను తన వుక్రోషాన్ని తమాయించుకుంటూ, చిరునవ్వుని కావాలని తెచ్చుకుంటూ మూర్తి మెడలో దండవేసి తనపేరేవిటో, ఆఫీసులో తన బ్రతుకేవిటో రెండు వ్యాఖ్యల్లో వివరించేడు. మిగతావాళ్లూ దండలు వేసేరు. మూర్తిగారు తన మెడలో పడిన ఏ దండనీ తీసెయ్యకుండా, అన్నీ మెడలోనే వుంచుకున్నాడు. అలా, దండలతోనే హాల్లోకొచ్చి అందరి మధ్యా నిలబడి, మెడలోవున్న దండల్ని ఓసారి వాసన చూసి, చిరునవ్వు నవ్వుతూ అందరితోనూ అన్నాడు-





"వేసిన దండల్ని తీసెయ్యకుండా ఎందుకిలా వుంచుకున్నానా అని మీరు ఆశ్చర్యపోతున్నారు కదూ? నాకు తెలుసు. చాలామంది యిలా మెడలో దండవడగానే దానివల్ల ఏదో షాక్ తగిలినట్టు వెంటనే తీసేస్తారు. అలా చెయ్యడానికి నేను ఫూల్‌ని కాదు. మీరు ఎంతో ప్రేమతో, ఎంతో ఖర్చుచేసి మరీ దండలు వేస్తే, మీరేదో నా మెడలో నాగుపాముని వేసినట్టుగా దాన్ని తీసి పారెయ్యడం న్యాయంగా వుంటుందా? ఇప్పుడు మాటవర్సకి మన రంగారావుగారు వుదయం ఆరింటికే నా ఇంటికొచ్చి, నేను స్నానం, పానం ముగించుకునే వరకూ నిరీక్షించి మరీ నాకు దండవేసేరు. అప్పట్నించి ఇప్పటిదాకా ఆ దండని మోస్తూనే వున్నాను" అంటూ మరోసారి దండల్ని చేత్తో నవరించుకుంటూ తనరూమ్‌లోకి వెళ్లి పోయేడు. తనకంటే ముందుగా రంగారావు మూర్తి గారి మెడలో దండవేయడం, అదీ తెల్లారగట్లే ఆయన ఇంటికెళ్లి మరీ వేయడం, ఆయన కార్లోనే రావడం, అందరి సమక్షంలో జి.యమ్.గారు అతన్ని గురించి స్పెషల్‌గా చెప్పడం... దానుకి ఒక్కొక్క పాయింటూ ఒక్కో గుండుసూదితో గుచ్చినట్టుగా బాధపెట్టింది. అవి సూదిపోట్లు అయితే, దబ్బనం పోటులాంటి మరోమాట రంగారావు చెప్పేడు.

"జి.యమ్.గారిదీ నాదీ ఒక్కటే కేష్టు"

ఆ మాటతో దాను అదిరిపడ్డాడు. జి.యమ్.గారు వచ్చిన తొలి రోజున, తొలి గంటలోనే కులాల వెరిఫికేషన్‌దాకా వెళ్లిపోయేడంటే అతను వుచ్చుని గట్టిగానే బిగిస్తున్నాడన్న మాటే! అందులోనూ కులాలగొడవ ఈమధ్యన మరీ పెరిగిపోయింది. ఒకవక్కనించి గవర్నమెంటు కులాలు, మతాలు లేని సమసమాజ స్థాపనకి మీరూ ఒకూలీగా పని చెయ్యండని నినాదాలు చేస్తూనే కులాల ప్రాతిపదికమీద వుద్యోగాలు, ఇతర రిజర్వేషన్లు మంజూరు చేస్తోంది. కులాల ఆధారంగానే ఎలక్షన్లో కేండేట్లకి టిక్కెట్లు ఇస్తున్నారు. ఫలానా ప్రాంతంలో ఫలానా కులస్థులు ఎక్కువగావున్నారు కాబట్టి ఆ ప్రాంతంలో ఆ కులస్థుడు నిలబడితేనే గెలుస్తాడు కాబట్టి, మేం ఫలానా వాడికి టిక్కెట్టిచ్చేం అని అన్ని పార్టీలు ఎవరికివారే బాహాటంగా పేవర్ స్టేట్మెంట్లు ఇస్తున్న తరుణంలో ఈ ఆఫీసులో మాత్రం కేష్ట్ ఫీలింగు వర్కవుట్ కాలేదనేనమ్మకం ఏమిటి?

ఈ ఆలోచనే దానుని కుదురుగా వుండనివ్వలేదు. సుబ్బయ్య నాయుడు చెప్పినట్టు దండా వేసేడు, నమస్కారంచేసేడు. కానీ ఈ రెండు పనులూ రంగారావు తనకంటే ముందే చేసేసేడు. నాయుడు చెప్పినట్టు ఈ రెండు పనులవల్లా ఏదైనా మంచి జరిగితే అది రంగారావుకే జరుగుతుందిగాని తనక్కాదే! నాయుణ్ణి కలిసి సలహా అడుగుదామని వెళ్లేడుగాని, అతను ఇంట్లోలేడు. ఎక్కడికెళ్లేడని అతని అసిస్టెంటు నడిగితే "ఏమోసార్... నాకూ చెప్పలేదు. ఇందాక రెండు పార్టీలు గురువుగారి సలహా కోసం వచ్చి మళ్లీవెళ్లిపోయేరు" అన్నాడు. "సరే, మీ గురువుగారొస్తే నేను వచ్చి వెళ్లేనని చెప్పు" అని విక్కీ మోపెడ్ మీద ఇంటికి బయలుదేరేడు.

ఇంటికెళ్లేసరికి పవన్‌కుమార్ ఓ కొత్త సమస్యతెచ్చిపెట్టేడు. ఏదో సినిమా కంపెనీవాళ్లు పదివేలు తెస్తే సపోర్టింగ్ హీరో వేషం యిస్తానని వుత్తరంరాసేరట. ఇప్పుడా పదివేలూ ఇస్తావా? చస్తావా? అంటూ తండ్రిని నిలదీసేడు. అలాంటి భోగస్ కంపెనీని నమ్మకురా అని చెప్తే వినలేదు.

ఈనాడు గొప్పగా వెలిగిపోతున్న చాలామంది ఆర్టిస్టుల్లో చాలామంది మొదట్లో ఇలాగే ఎదురు డబ్బిచ్చి వేషాలు సంపాదించుకున్నవాళ్లేనని పవన్‌కుమార్ కొంతమంది హీరోల భంగిమల్ని అభినయిస్తూ ఓ లెక్చరిచ్చేడు. వరలక్ష్మి ఎప్పట్లాగే కొడుక్కి వంతపాడింది. "మీ నాన్నగారు మేనేజరుగా ప్రమోషన్ సంపాదించుకునుంటే నెలకి అయిదు వేల జీతం వచ్చుండేది. ఓ రెండు నెల్ల జీతం పోతే పోయిందని చెప్పి, ఆ పది వేలూ నీకిచ్చి సపోర్టింగ్ హీరోనైనా చేసేదాన్ని. రెండు నెల్ల క్రితం మనకి టీటీ డబ్బు వచ్చినప్పుడైనా ఈ ఆఫరు వచ్చుంటే ఫ్రిజ్, గ్రైండరు కొనకుండా, ఆ డబ్బు నీకేయిచ్చుండేదాన్ని. కనీసం ఇన్ని లాట్రీ టిక్కెట్లలో ఒక్కటి తగిలినా బావుండేది" అంటూ ఆవిడ అలా అనేసరికి, పవన్‌కుమార్ మరీ రెచ్చిపోయేడు. "నా ప్రగతిని నిరోధించే దుష్టశక్తివి నువ్వే నాన్నా నువ్వే" అంటూ లెక్చరివ్వబోతే చిలకలదాను

ఒక్కతన్ను తన్నేడు.

తల్లీకొడుకుల కామెంట్స్ అతనికి తలపోటు తెప్పిస్తే, అతని కూతురు మరో కామెంట్ చేసింది. "ప్రైవేట్ కంపెనీలో పనిచేసే ఓ నూపర్నెంటు కూతురిగా, నేనూహించుకునే హీమేన్ నాకు ఎలాగూ దొరకడు. కనీసం, ఓ సినిమా యాక్టరు అక్కగానైనా నాకు కావల్సిన భర్తని పొందుదామంటే నువ్వు తమ్ముడి భవిష్యత్తుకి నిప్పుపెట్టేస్తున్నావ్" చిలకలదాను కూతుర్ని కొట్టడానికి కర్ర అయితే అందుకున్నాడుగాని, ఆవిడ వయసు, తన బాధ్యత గుర్తొచ్చి తమాయించుకున్నాడు.

మరో రెండు రోజులు పోయేక సుబ్బయ్యనాయుడు ఓ సాయంత్రం వేళ వచ్చేడు. వస్తూనే, "ఈ మూడు రోజులూ నీ పనిమీదే వున్నాను బావా, ఈ పనిలోపడి, నాదగ్గరకి అయిడియా లకోసం వచ్చే చాలామందిని వదిలేసుకున్నాను. బోలెడంత కేమ నష్టపోయేను" అన్నాడు.

"ఇంతకీ ఏం ఇన్ఫర్మేషన్ తెచ్చేవు?" అన్నాడు దాను ఆత్రంగా.

"తిరిగి తిరిగి నాలికంతా ఎండుకుపోయింది. రెండు పెగ్గులు పడితే తప్ప, నా బుర్ర పనిచెయ్యదు"

"అంటే, మందుకోసం వచ్చేవన్నమాట. బాగుందిరా, నీ పకోడీ పొట్లానికి, నా హాఫ్ బోటిల్‌కి లంగరు అందడంలేదు" అంటూ చిరాకు పడ్డాడు దాను. "ఈసారి అలా కాదులే బావా! నేనే మందు పట్టు కొచ్చేను. కాకపోతే అది చాలకపోతే మిగిలిన బేలన్సు నువ్వు తెప్పించాలి. ఓకేయేనా?" అంటూ దానుని ఒప్పించేక, అతనికి కితకితలు పెట్టి నవ్వించేక తన సంచిలోనించి పూర్తిగా కాగితంతో కవర్‌చేసిన ఓ ఫుల్‌బోటిల్‌ని తీసేడు. దాను సంతోషించేడు. కానీ, ఆ పేపర్ని పూర్తిగా తీసి పారేసింతర్వాతగాని దానుకి షాక్ తగల్లేదు. ఆ ఫుల్ బోటిల్లో ఒక్కటంటే ఒక్కటే పెగ్గు మందుంది. "ఈ ఒక్క పెగ్గూ, ఒక్కడికీ ఒక్క రౌండూ సరిపోదు, మిగిలిందంతా నేను తెప్పించాలా? అంటూ దాను అలిగేడు.

"అది కాదు బావా! మీ జి.యమ్. గురించి ఇన్ఫర్మేషన్‌లాగడానికే తిరుగుతూ ఇందులోని మందు అంతా మింగేసేను. అయినా ఇప్పుడు మనం ఎన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడుకోవాలి చెప్పు. అన్నింటికంటే ముందు ఆ రంగారావుగాడూ, మీ జి.యమ్. ఒక్కటే కేష్ట్..." అంటూ దాను రియాక్షన్ని గమనించడానికి ఆగేడు.

దాను మరేం మాట్లాడకుండా జేబులోనించి డబ్బు తీసేడు. అదే నాయుడికి కావల్సిన రియాక్షన్ మరి, బోటిల్ తేడానికి మనిషెవడూ లేడు" అన్నాడు దాను.

కిటికీ దగ్గర తారాడుతున్న పవన్‌కుమార్ని పిలిచేడు నాయుడు. "నేను బోటిల్‌తీస్కురాను" అంటూ అలిగినట్టుగా అన్నాడు వాడు. వాడి చిరకాలవాంఛ, జీవితాశయం ఏవిటో నాయుడికి తెల్సు. అందుకే దాన్నే ఇప్పుడు ప్రయోగించి మాట్లాడేడు. "నీకు సినిమాల్లో వేషాలే కదా కావల్సింది. నాకు పెద్ద పెద్ద డైరెక్టర్లు చాలామంది తెల్సురా, నువ్వెళ్లి బోటిల్ పట్టుకొచ్చెయ్ చెప్తాను" అన్నాడు. అంతే, పవన్‌కుమార్ ఇలా వెళ్లి అలా బోటిల్ పట్టుకొచ్చేడు. "నా గురించి ఏ డైరెక్టరుకి చెప్తావు మావయ్యా?" అన్నాడు ఆసక్తిగా. నాయుడు ఆ ప్రశ్నకి జవాబు చెప్పకుండా, వాడి చేతనే అయిసువాటర్, వూరగాయ ముక్కలూ తెప్పించుకున్నాక అప్పుడన్నాడు. "నేను ఏ డైరెక్టరుకి చెప్పినా నీకు వేషం ఇవ్వర్రా"

"అదేవిటి? నీకు బోలెడంతమంది డైరెక్టర్లు తెలుసన్నావ్‌గా"

"వాళ్లు నాకు తెలుసన్నానుగాని వాళ్లకి నేను తెలుసనలేదుగా!"

నాయుణ్ణి బైటకి సౌండు రాకుండా లోలోపలే తిట్టుకుంటూ వెళ్లిపోయేడు పవన్‌కుమార్. చిలకలదానూ, నాయుడూ ఛీర్స్ చెప్పుకున్నాక, నాయుడు తను సంపాదించిన సమాచార సారాంశాన్ని వివరించేడు.

"ఫస్ట్ పాయింట్! మీ రంగారావుగాడూ, మీ జి.యమ్‌గారూ ఒక్కటే కేష్టన్న మాట నిజమేగాని, అందువల్ల నీకేదో ప్రమాదం జరుగుతుందనుకోవడం మాత్రం అనవసరం. ఈ రోజుల్లో ఎవడికి వాడు తన కులంవాడిని ప్రోత్సహించడం, మద్దతు యివ్వడంలాంటి పనులు అక్కడక్కడా జరుగుతున్నమాట ఎంత నిజమో, అన్ని చోట్లా జరగడంలేదనేది అంతకంటే నిజం. మాటవర్సకి రాజకీయాలే




తీస్కో, మనదీ మనదీ ఒకటే కులం అంటూ అందులో ఒకణ్ణి నాయకుడిగా చేస్తున్నదీ వాళ్లే, తర్వాత అనమ్మతివాదం పెట్టి ఆనాయకుణ్ణి దించేసేదీ ఆ కులంవాళ్లే. అటుపైన సేమ్ కేష్ట వాడు అభివృద్ధి చెందితే బావుణ్ణని ఎంత మంది అనుకుంటున్నారో, మాకులంలో నా పరిధిలో నాకులస్థుడు మరొకడు నాకంటే పైకి రాకూడదని అంత కంటే ఎక్కువమందే అను కుంటున్నారు. నేనేం గేస్ కబుర్లు చెప్పడం లేదు. ఈ విషయంలో బాగా సర్వేచేసే చెప్తున్నాను. మీ జి.యమ్.గారు రెండోరకం మనిషి. అంటే రంగారావు తనకులస్థుడైనంత మాత్రాన వాణ్ణి తీసుకెళ్లి మేనేజరు సీట్లో కూర్చోబెట్టేస్తాడనుకోవడం శుద్ధ అబద్ధం. వేరే కారణాలు వర్కవుట్ అవుతాయేమో తర్వాత ఆలోచిద్దాం.

ఇక రెండో పాయింటు, మీ జి.యమ్.గారి ఫేమిలీ వివరాలు. ఆయన పేరు శ్రీనివాసమూర్తి. అంటే ఏడుకొండల వెంకటేశ్వరుడి పేరు గదా! పేరుకి తగ్గట్టే మీ వాడూ ఇద్దరు పెళ్లాల ముద్దుల మొగుడే. అయితే జనాభాలెక్కల్లోను, ఓటర్ల లిస్టులోనూ, రేషన్‌కార్డుల్లోనూ ఆయనకి ఒక్కతే పెళ్లాం అని. ఆవిడ పేరు సరస్వతీదేవి అని రాసుంటాది. ఆయనగారు ఓపెన్ చేసిన సెకెండ్ ఛానల్‌వుందే, అదే బావా సెకెండ్ వైఫ్, ఆవిడ పేరు చాముండి. సెకెండ్ ఛానల్ గురించి ఫస్ట్ ఛానల్‌కి తెలీదు. కానీ ఫస్ట్ ఛానల్ గురించి సెకెండ్ ఛానల్‌కి సహజంగా తెలిసుంటాది కాబట్టి, ఈ కేసులోనూ తెలిసింది. ఇన్నాళ్లు మీ జి.యమ్. మహాశయుడు ఎలా దొంగాటలు ఆడుకొచ్చేడోగాని, మొత్తం మీద బాగానే ఆడేడు. మొదటావిడతోనే ఆయన ఈ వూరికి దిగేడు. రెండో ఆవిడ ఎప్పుడొస్తాదో, అసలు వస్తాదో రాదో ఇంకా మనకి ఇన్ఫర్మేషన్ అందలేదు.

ఇంక, ఆ ఫేమిలీ లోనిఅదర్ డిటైల్సు! మీ జి.యమ్.గారి మామగారు, అంటే మొదటావిడ తండ్రిగారి పేరు వరదరాజులు. కానీ చాలామంది ఆయన్ని దురదరాజులూ అనే పిలుస్తారట. ఎందుచేతంటే ఆయనకి ఒక్కసారైనా ఒక్కరోజయినా మంత్రిపదవిలో వుండాలనే దురదతో ఆస్తిలో ముప్పావొంతుకి పైగా కరగబెట్టేసుకున్న ఆయన ఎమ్మెల్యే కూడా కాలేకపోయేడట. దేశంలో వున్న అన్ని పార్టీలని తిట్టుకుంటూ ప్రస్తుతం కూతురితోపాటు ఇక్కడకే వచ్చేసేడట.

పాయింట్ నెంబర్ త్రీ! మీ జి.యమ్.కో దిక్కుమాలిన సరదావుందట. తన అండర్లోవున్న వాళ్లని కొన్ని ప్రశ్నలు అడుగుతాడట. ఓ వందరూపాయిలు పందెం కాయమంటాడట. మీరు ఆ ప్రశ్నకి ఎంత కరెక్టు ఆన్సర్లు చెప్పినా, థట్ అది కాదు జవాబు అంటూ అతనో చిత్రమైన సమాధానం చెప్పి, దానికో ముదనష్ట పులాజిక్కు చూపించి పందెం డబ్బు లాక్కుంటాడట. అలాగని అతనేం డబ్బు కోసం గడ్డి కరిచే రకంకాదట. మరైతే అలాంటి పందేలు ఎందుకు వేస్తున్నట్టు? మీకంటే అతను చాలా తెలివైనవాణ్ణని, మీకు తెలియని లాజిక్కుల్ని ఎంత బాగా చెప్పేనో చూసేరా అంటూ తనలో తాను సంతోషపడ్డానికీ, మీ అందర్నీ ఫూల్స్‌ని చేసేనూ అని గర్వపడ్డానికి మాత్రమే అలా చేస్తాడట. ఇంక లాస్ట్ పాయింట్! ఆయన చెల్లెలు, బావమరిది గూడా ఈ వూళ్లోనే వున్నారట. చెల్లెలంటే మీ జి.యమ్.గారికి ప్రాణమట. ఆయన బావమరిది పేరు భాస్కరప్రసాద్. ఏ బ్రేంచీయో తెలీదు గాని, బేంక్ ఆఫ్ బరోడాలో మేనేజరుగా పనిచేస్తున్నాడట. అంతకుమించి నాకు వివరాలు అందలేదు. ఇదీ నేను సంపాదించిన ఇన్ఫర్మేషన్. అంతా గుర్తుందాలేక, టీ.వీ. వార్తల్లో చెప్పినట్టు, ఈ పూట విశేషాలు మరోసారంటూ హెడ్ లైన్సు మరోసారి చెప్పమంటావా?" అన్నాడు.

నీరసంగా వున్న చిలకలదాసుకిప్పుడు గ్లూకోజు వెల్లరసం ఇచ్చినూతన శక్తిని తెప్పించినట్టయింది. "నువ్వు మళ్లీ హెడ్‌లైన్స్ చెప్పక్కర్లేదు. ఇక మీదట నేషనల్ నెట్‌వర్క్ కార్యక్రమాన్ని ఎలా నడిపిస్తానో నువ్వే చూసి కంగారుపడి పోతావ్, చూస్తుండు" అంటూ సంతోషంగా నాయుడి గ్లాసులో తనే మందుపోసేడు.

★ ★ ★

సుబ్బయ్యనాయుడు చెప్పినట్టే, మర్నాడు మధ్యాహ్నం లంచ్ అయేక స్టేఫ్ మెంబర్సందర్నీ తన రూములోకి పిలిచేడు జి.యమ్.

"మనం భగవంతుడిచ్చిన కాళ్లు, చేతులు, కళ్లు, ముక్కు, ఇలా సర్వావయవాలని నిత్యం

వుపయోగిస్తాం. కానీ మెదణ్ణి మాత్రం పెద్దగా వుపయోగించం. అంచేత మీ అందరి మెదళ్ల కీ పని కల్పించేలా ఓ క్విజ్ కార్యక్రమం పెడుతున్నాను'' అంటూ పందెం కింద తనజేబులో నించి వందరూపాయిల నోటు తీసి టేబిల్ మీద పెట్టేడు.

''తాజ్‌మహల్‌ని కట్టిందెవరు?'' ఇదీ ఆయన అడిగిన ప్రశ్న.

రంగారావు క్షణం కూడా ఆలోచించకుండా ''బాబర్ కట్టించేడు సార్'' అన్నాడు.

''కాదు పందెం వేస్తారా?'' అన్నాడు జి.యమ్.. కవ్విస్తున్నట్టుగా.

రంగారావు జేబులోనించి వందనోటు తీసి టేబిల్ మీద పెట్టేడు.

రంగారావుకి ఈ పాటి నాలెడ్జి కూడా లేదా అని చిలకలదాను మనసులో అనుకుంటూనే ''తాజ్‌మహల్‌ని కట్టింది షాజహాన్ సార్'' అన్నాడు.

''కాదు'' అని దబాయించేడు జి.యమ్.

దానుకిప్పుడు జి.యమ్.గారి జెన్రల్‌నాలెడ్జి గురించి సందేహం వచ్చింది తప్పదుకదా! అని అతనూ పందెం వేసేడు.

జి.యమ్. ఇప్పుడు వారందర్నీ బచ్చాల్లాగ చూస్తూ అన్నాడు. ''తాజ్‌మహల్‌ని కట్టించిందెవరూ అని అడిగితే షాజహాన్ అనే మాట కరెక్ట్ అవుతుంది. కానీ నేను తాజ్‌మహల్‌ని కట్టిందెవరూ అని అడిగేను. దాన్ని కట్టింది తాపీ మేస్త్రీలు, కూలీలేకదా!''

అతనిలాజిక్కుకి అందరూ అభినందిస్తున్నట్టుగా చప్పట్లు కొట్టేరు.

రంగారావు, దాను పందెంగా కాచిన రెండు వందల్నీ జి.యమ్. తీస్కుని జేబులోపెట్టుకున్నాడు. తర్వాత వారిద్దర్నీ వుద్దేశిస్తూ అన్నాడు. ''రంగారావుగారు కాస్త తొందరపడి బాబర్ అని జవాబు చెప్పివుంటారు. ఎందుకంటే డైరెక్టుగా నాతో పందెం కాయడంకదా! కాస్త టెన్షన్ ఫీలైవుంటారు. ఏమ్ ఐ కరెక్ట్ మిస్టర్ రంగారావ్?''

''యస్సార్, యూ ఆర్ సెంట్ పెర్సంట్ కరక్ట్'' అన్నాడు రంగారావు చాలా ఆనందాన్ని వ్యక్తం చేస్తూ.

''ఇంక మన చిలకలదానుగారు.... నేను అడిగిన ప్రశ్నలో ఏదో మెలిక వుందేమోనని ఒక్కక్షణం కూడా ఆలోచించలేదు. అందులో, ఏ ట్విష్టూ లేకపోతే, చంటి కుర్రాళ్లు కూడా చెప్పగలిగే అంత సింపిల్ క్వశ్చెన్ ఎందుకడుగుతాను? కాస్త కామన్ సెన్సు వుపయోగించి వుంటే బావుండేది'' అంటూ జి.యమ్. ఆనాటి క్విజ్ కార్యక్రమాన్ని ముగించి అందర్నీ వాళ్ల సీట్స్‌లోకి వెళ్లమని చెప్పేడు.

దాను తన సీట్లో కూర్చుని ఆలోచించేడు. సుబ్బయ్య నాయుడు అంతలా చెప్పినా తను ఆ విధంగా ప్రవర్తించలేకపోయేడు. రంగారావుగాడు మహా డాకూగాడు కాబట్టే, కావాలని ఓడిపోయి ఆఫీసర్ని మెప్పించేడు. కానీ తను? ఆఫీసరుకంటే తెలివైనవాడిలా ప్రవర్తించి, అతని చేత మెత్తగా చీవాట్లు తినాల్సి వచ్చింది. తనకి కామన్‌సెన్సు లేదని అందరి ముందూ అనేసాడు. ఆ విషయాన్ని అతను మనసులో పెట్టుకుంటాడా? ... ఎందుకైనా మంచిది రేపట్నించి తను కాకాయిజాన్ని మరి కాస్త డెవలప్ చెయ్యాలి.

★ ★ ★

మర్నాడు జి.యమ్.గారు రాగానే పోర్టికో లోనే చిలకలదాను రెండు చేతుల్తో నమస్కరించేడు. అతను సైలంట్‌గా రిసీవ్ చేస్కుని తన రూములోకి వెళ్లిపోయేడు. మధ్యాహ్నం ఆయనేదో పనిమీద ఆఫీసు హాల్లో కొచ్చేడు. అప్పుడూ దాను నమస్కరించేడు. మిగతావాళ్లెవరూ ఆ పనిచెయ్యలేదు. జి.యమ్. చిలకలదానుని కాస్త చిరాగ్గా చూసి వెళ్లిపోయేరు. మరో గంట తర్వాత ఏదో ఫైలు తెమ్మని దానుని పిలిచేడు. చంకలో ఫైలు పెట్టుకుని గది బయటనించే రెండు చేతుల్ని నమస్కారం పొజీషన్లో పెట్టుకుని చాలా ఇబ్బంది పడుతూనే గది తలుపులు తెరచుకుంటూ లోపలకెళ్లి ''నమస్కారం సార్'' అన్నాడు. అలా అనడంలో చంకలోని ఫైలు టేబిల్ మీదపడింది. ఆ అదురుకి టేబిల్ మీదున్న నీళ్లగ్లాను కింద పడబోయింది. జి.యమ్. గభీమని ఆ గ్లాసుని పట్టుకున్నాడు. తర్వాత దానుని చిరాగ్గా చూస్తూనే, ఆ ఫైలు విషయం మాట్లాడి పంపించేసేడు. సాయంత్రం ఆఫీసు అయిపోయేక జి.యమ్. బైటకు వెళ్లడానికి కారిడార్‌లో నడు




స్తూ లేవెట్రీ దగ్గర ఆగేడు. మళ్లీ తన రూమ్‌కెళ్లి యూరినల్స్ ఎందుకు పాస్ చేస్కోవడమని ఆలోచించి, స్టాఫ్ కోసం పెట్టిన లేవెట్రీలోకి వెళ్లేడు. పేంటు జిప్పు సరిగా పడకపోతే దాంతో కుస్తీ పడుతూనే బయట కొస్తుంటే 'నమస్కారంసార్' అనే స్వరం వినిపించి తల ఎత్తిచూసేడు.

ఎదురుగా, రామభక్త హనుమాన్‌లా రెండు చేతుల్తో నమస్కరిస్తున్న చిలకలదాసు కనిపించేడు. మూర్తిగారు సహనం చచ్చిపోయినట్టుగా చూసి "ఏమండీ చిలకలదాసుగారూ, మీ నమస్కారబాణాల్తో నన్ను చంపెయ్యాలనా రోజుకి ఇన్నిసార్లు నమస్కారాలు పెడుతున్నారు? మీరు మునుపటి ఆఫీసర్లకి గూడా ఇలాగే విష్ చేసేవారా? లేక నేను కొత్తగా వచ్చేనని మీరు కొత్త పద్ధతులు ప్రవేశపెడుతున్నారా? దిసీజ్ టూమచ్! మనిషికి ఏ సెన్సు ఉన్నా లేకపోయినా కామన్‌సెన్సు మాత్రం వుండాలండి" అంటూ వడివడిగా వెళ్లిపోయేడు.

నమస్కారబాణాలు బెడిసి కొట్టినందుకు తనని తనే తిట్టుకుంటూ ఛీ అంటూ నెత్తిమీద కొట్టుకున్నాడు.

★ ★ ★

రెండు రోజుల తర్వాత జి.యమ్.గారు తన స్టేఫ్‌తో మళ్లీ మాట కచేరీ జరిపిస్తూ, క్విజ్ కార్యక్రమం జరిపించేడు. ఈసారి ఆయన ఏం అడిగినా ఆన్సర్ కాకుండా, కామన్ సెన్సు వుపయోగించి లాజిక్ పూరితమైన జవాబు చెప్పాలని చిలకలదాసు చాలా గట్టిగా నిర్ణయించుకున్నాడు.

"అధికంగా సిగరెట్లు కాలిస్తే ఏం వస్తుంది?" అదీ జి.యమ్.గారు అడిగిన ప్రశ్న. వందరూపాయిల షరతు సంగతి మామూలే కాబట్టి రంగారావు చేత్తో రెడీగా పట్టుకున్న నోటుని టేబిల్ మీదపెట్టి కావాలనే అర్థం పర్థంలేని జవాబు చెప్పేడు. "అధికంగా సిగరెట్లు కాల్చడంవల్ల అధికంగా నీళ్ల విరేచనాలు పట్టుకుంటాయి"

అతని జవాబుకి జి.యమ్.తో సహా అందరూ పగలబడి నవ్వేరు. "హమ్మయ్యా, జి.యమ్.గారు ఆశిస్తున్నట్టుగా ఆయన దృష్టిలో ఫూల్ నవగలిగేను" అంటూ రంగారావు లోలోపలే పొంగిపోయేడు.

ఆ ప్రశ్నకి సమాధానంగా ఒకరు, అధికంగా సిగరెట్లు కాల్చడంవల్ల టీ.బీ. వస్తుందని చెప్పేరు. మరొకరు కేన్సరు వస్తుందని చెప్పేరు. జి.యమ్. దేన్నీ ఒప్పుకోలేదు.

చిలకలదాసు వంతు వచ్చింది. అతను వందరూపాయిల వందెంకాచి జవాబు చెప్పేడు "అధికంగా సిగరెట్లు కాల్చడంవల్ల అధికంగా పొగవస్తుంది"

అందరూ ఆశ్చర్యంగా చూసేరు. జి.యమ్.గారి ముఖం మాడిపోయింది. దాన్ని మరోలా అర్థం చేసుకుని దాను, వుత్సాహంగా తనిచ్చిన జవాబుకి వివరణ కూడా ఇచ్చేడు. "ఔనుసార్! అధికంగా సిగరెట్లు కాల్చడంవల్ల కేన్సర్ టి.బి.ల్లాంటి వ్యాధులు వచ్చే మాట నిజమే కావచ్చుగాని, ఆ వ్యాధులు వచ్చిన వాళ్లంతా సిగరెట్ స్మోకర్స్ కాదు. సిగరెట్సు కాల్చిన వాళ్లందరికీ ఆ జబ్బులు రావడంలేదు. కానీ అధికంగా సిగరెట్లు కాలిస్తే అధికంగా పొగ రావడం మాత్రం ఖాయం. కామన్ సెన్సు వుపయోగిస్తే సింపుల్‌గా తెల్సిపోయే పాయింట్ సార్ ఇది"

అతను చెప్పిందానికి అందరూ చప్పట్లు కొట్టేరు. లోలోపల కుతకుతలాడిపోతున్న జి.యమ్‌గారు, ఆనందం నటిస్తూ చప్పట్లు కొడుతూ - "మీరే వందెం గెలిచేరు" అంటూ తన వంద రూపాయిలూ చిలకలదాసుకి అందించేడు.

అందరూ మళ్లీ చప్పట్లు కొట్టేరు.

అందర్నీ వెళ్లమని చెప్పి, ఒక్క చిలకలదాసుని మాత్రం గదిలో వుండమన్నాడు. బహుశా, తన కామన్ సెన్సు కెపాసిటీని ప్రశంసించడానికే తనని వుండమన్నాడని అనుకున్నాడు దాను. నిన్న అందరి ముందూ తనకి కామన్‌సెన్సు లేదని చిరాకుపడిన వాడు, ఇవాళ అందరిముందూ ప్రశంసిస్తే బావుండు అని అనుకున్నాడు. కానీ ఇప్పుడా గదిలో అతను, జి.యమ్.గారు మాత్రమే వున్నారు.

అందరూ వెళ్లేక జి.యమ్.గారు గంభీరముద్ర వహించి దానుని నఖశిఖ పర్యంతం చూసేడు. తర్వాత ముఖంలో ముఖంపెట్టి సీరియస్‌గా చూసేడు. అతని కళ్లకే గనక దివ్యశక్తి వుంటే ఆ చూపులకి చిలకలదాసు

చిటికెడు భస్మంగా మారిపోయివుండేవాడు.

అతను తనని ఎందుకంత సీరియస్‌గా చూస్తున్నాడో అర్థం కాలేదు.

"ఏవిటండీ చిలకలదానుగారూ, ఏవిటి మీ వుద్దేశ్యం? ఈ ఆఫీసుకి జెన్రల్ మేనేజర్ని నేననుకున్నారా? మీరనుకున్నారా? క్విజ్ ప్రోగ్రాం కండక్ట్ చెయ్యవలసింది నేనా? మీరా? కాస్త కామన్‌సెన్సు వుపయోగించమని నిన్న చెప్పినందుకు, ఇవాళ పూర్తిగా ఆ సెన్సునే వాడేసి, నన్ను అందరి ముందూ ఇన్సల్ట్ చేస్తారా?"

దాను అదిరిపడ్డాడు. "నో సార్! నేనేం మిమ్మల్ని ఇన్సల్ట్ చెయ్యలేదు" అన్నాడు కాస్త వణుకుతూ.

"నో... మీరు నన్ను అవమానించేరు. నా ప్రశ్నలకి మీరు అలాంటి లాజిక్కులు తీసి జవాబులు చెప్పనంతకాలం మీరు నాకు సబార్డినేట్సు అనిపించుకుంటారు. మీరు తెల్లముఖాలు వేసినప్పుడు, ఆ జవాబులు నేను చెప్తేనే, నేను మీకు జెన్రల్‌మేనేజర్ననిపించుకుంటాను. మీరు చెప్పిన సమాధానాన్ని అదే లాజిక్కుని నేను చెప్పి, అందర్నీ ఆశ్చర్యపరచి, మీ అందరిచేత అభినందనలు పొందాలనుకున్నాను. అసలు అందుకోసమే నేనీ క్విజ్ ప్రోగ్రామ్ ఏర్పాటుచేస్తుంటాను. కానీ, నా డ్యూటీ మీరు చేసేసి, నా ధ్యేయాన్ని దెబ్బకొట్టేసేరు..." అంటూ అతను ఓ పదినిమిషాలపాటు బాధ, కోపం, వెర్రితనం, పిచ్చిలాంటి చిత్రవిచిత్రమైన భావాన్ని వ్యక్తంచేస్తూ మాట్లాడేడు. దాను ఏంచెప్పినా అతను వినలేదు.

తను ఎటు వెళ్ళినా అందువల్ల గొడవలే వస్తున్నాయి. జి.యమ్.గారికి తనమీద అభిమానం కలగడానికిబదులు, అయిష్టత ఎక్కువయిపోతోంది, అవడంకాదు, తనే అలా అయ్యేటట్టు చేసుకుంటున్నాడా? అన్న సందేహం అతనికొచ్చింది.

"జి.యమ్.గారు ప్రైవేటుగా ఏం మాట్లాడేరు? అంటూ రంగారావు డైరక్టుగా అడక్కుండా మిగతావాళ్లచేత అడిగించేడు.

"ఏవో ఫేమిలీ విషయాలు..." అంటూ తన సీట్లో కూర్చున్నాడు.

రంగారావు కృత్రిమంగా పగలబడి నవ్వుతూ "మన జి.యమ్.గారూ నేను ఒకటే కేష్టు. అయినా నాతోనే ఫేమిలీ ఎఫైర్స్ మాట్లాడరు, అలాంటిది మీతో మాట్లాడతారా? మన జగ్గారావు తలుపుదగ్గర నిలబడి అంతా విని, మాకు చెప్పేడులెండి" అన్నాడు.

తలుపుదగ్గర నిలబడి విన్నది జగ్గారావు కాదు, రంగారావే అయివుంటాడని చిలకల దాను సులభంగానే వూహించేడు. అంతా విన్నాడుకాబట్టే, తనని వెటకారం చెయ్యడానికి వాడికి మరో ఆయుధం దొరికినట్టే! జి.యమ్.గార్ని ప్రసన్నుణ్ణి చేస్కుని, ఆయనకి తన మీద కలిగిన కోపాన్ని తగ్గించుకోవాలంటే ఆఫీసులో వీలుపడదు. రంగారావుగాడి నిఘా తన మీద వుంటుంది. అంచేత రేపు ఆదివారంనాడు డైరక్టుగా జి.యమ్.గారి యింటికి వెళ్లిపోవడం మంచిది.

★ ★ ★

ఆదివారం వుదయం తొమ్మిది గంటలప్పుడు చిలకలదాను ఓ రిక్షాలో ఓ పళ్లబుట్ట, ఓ స్వీట్ పేకెట్, రెండు పనసకాయలు వేయించుకుని జి.యమ్.గారింటికి వచ్చేడు. అప్పుడు ఆ యింటి డ్రాయింగురూమ్‌లో జి.యమ్.గారి సతీమణి నలుగురైదుగురు లేడీస్ వెల్‌ఫేర్ క్లబ్ మెంబర్సుతో వాళ్ల ఎగ్జిక్యూటివ్‌బాడీ సమావేశాన్ని నిర్వహిస్తోంది.

ఆ సమయంలో రిక్షావాడిచేత సామాన్లు మోయించుకుంటూ, సరాసరి అక్కడకొచ్చేసేడు చిలకలదాను! రిక్షావాడు వెళ్లిపోయేడు. అప్పుడు జి.యమ్.గారు ఆ యింట్లోలేరు. కానీ, ఆ సంగతి చెప్పడానికి అక్కడా సమయంలో నౌకరెవడూ కనిపించలేదు.

అతనిరాకతో జి.యమ్.గారి భార్య సరస్వతీదేవి, ఓ మహాయజ్ఞానికి బ్రహ్మరాక్షసుడు అడ్డంతగిలినట్టుగా చిరాకు, కోపం ప్రదర్శిస్తూ, "ఎవరు మీరు? ఎందుకొచ్చేరు? అని అడిగింది.

తను ఫలానా అని, తన వుద్యోగం ఫలానా అని చెప్పి "అయ్యగారి దర్శనం చేస్కుందామని వచ్చేను మేడమ్" అన్నాడు.

మేడమ్‌గారు ఆ పళ్లబుట్టలూ వగైరాలు చూసి మరొకప్పుడైతే ఏంఅనేదోగాని, తను కొత్తగా ప్రెసిడెంటు అయిన లేడీస్ క్లబ్ తాలూకు మెంబర్లముందు అతని విషయంలో





కటువుగా వుండాలిగాని, మెత్తగా వుంటే వాళ్లకి అలుసైపోతాననే భయంవచ్చింది. ఆ నలుగురు ఆడవాళ్ల భర్తలూ ఆఫీసరు హోదాలోనే వున్నారు. తన భర్త వాళ్ల భర్తలందరికంటే వుత్తమ పురుషుడని బిల్డప్పు యివ్వడానికైనా తను యమా స్ట్రిక్టుగా వున్నట్టు నటించాలనుకుంది.

"అయ్యగారు లేరు. అయినా వారానికి ఆరురోజులు అయ్యగారి అండర్లో పనిచేస్తూ వారి దర్శనం చేసుకుంటున్నారు. అయినా, అది చాలనట్టుగా ఆదివారంకూడా వచ్చి దర్శనంచేస్కోవాలా? ఆయన ప్రాణసమానంగా చూసుకునేవి రెండే రెండు. ఒకటి, నేను! రెండు ఆఫీసు! ఆయన ఆదివారం అనికూడా చూడకుండా ఆఫీసుకెళ్లి, అర్జంటు పని చూసుకుంటున్నారు. ఈ విషయం ఎవరికీ చెప్పొద్దన్నారు. కానీ, మీరు అయన్ని కాకా పట్టడానికొచ్చేరు. కాబట్టి చెప్పాల్సివచ్చింది. ఒకవేళ ఆయన యింట్లోవున్నా మీలాంటివార్నించి యిలాంటి కానుకల్ని స్వీకరించరు. ఆయనకి ఏకపత్నీవ్రతం, నిజాయితీ, క్రమశిక్షణ, కార్య దీక్ష అనే లక్షణాలున్నాయి కాబట్టి, మరెప్పుడూ యిలాంటి కానుకలు పట్టుకొచ్చి ఆయన ఆగ్రహానికి గురికాకండి" అంటూ ఆవేశంగా మాట్లాడేసరికి చిలకలదాను కంగారుపడిపోయి, ఒక్కో వస్తువుని గబగబా గేటుబయటకి మోసుకుపోయి ఆయాసం తీర్చుకుంటూ రిక్షాకోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

తన టైము బాగులేదుకాబట్టే, ఆఫీసులో జి.యమ్.గారూ తిట్టేరు. క్షమాపణ కోరడానికి యింటికొస్తే ఆయన భార్యాతిట్టింది. దురదృష్టంలో అదృష్టంలా, అక్కడున్న ఆడవాళ్లు తనకి తెల్సినవాళ్లు కాదుకాబట్టి సరిపోయింది. లేకపోతే, అవమానంమీద అవమానం ఏర్పడేది. ఔను... మేడమ్‌గారు యిందాక కోప్పడుతూ, జి.యమ్.గారు ఆఫీసుకెళ్లేరని చెప్పిందేమిటి? తను యిక్కడకొచ్చేటప్పుడు రిక్షాలో ఆఫీసుముందునించే వచ్చేడు. ఆఫీసు మెయిన్ గేటుకి రెండు తాళంకప్పులూ వేసేవున్నాయి. పోర్టికోలో ఓ కారుగాని, ఓ మనిషిగాని ఎవరూ కనిపించలేదు. ఒకవేళ ఆయన ఆఫీసుకెళ్తున్నానని అబద్ధంచెప్పి, మరెక్కడికైనా చెక్కేసేడా? పెళ్లాంతోగూడా అబద్ధంచెప్పి ఎక్కడికెళ్లుంటాడు?

అలా కొన్ని క్షణాలపాటు ఆలోచించేక, తన ప్రశ్నల్ని తనే చెరిపేసుకున్నాడు. ఆయనెక్కడికెళ్తే తనకెందుకు? ఎందుకు అబద్ధం ఆడితే తనకెందుకు? ఇప్పుడు తను కానుకలు పట్టుకుని యింటికొచ్చినందుకు, ఆయన్తో మేడమ్‌గారు ఏంచెప్తారో? రేపాయన ఆఫీసులో ఏమంటాడో? ఆ విషయం ఆలోచించాలి అనుకుంటూ, దారంటవెళ్తున్న రిక్షాని పిలిచేడు.

★ ★ ★

చిలకలదాను వూహ అబద్ధంకాలేదు.

మధ్యాహ్నం రెండు దాటేక, జి.యమ్.గారు నీరసంగా నడుచుకుంటూ లోపలకొచ్చి, హాల్లో వున్న సోఫాలో కూలబడ్డాడు. అతనికోసమే ఎదురుచూస్తున్న సరస్వతి, అతని ఎదుటి సోఫాలో కూర్చుంటూ సీరియస్‌గా అడిగింది.

"ఎక్కడికెళ్ళేరు?"

"ఆఫీసుకని చెప్పేగా"

"నిజంగా మీరు ఆఫీసుకే వెళ్లేరా?"

ఆమె సూటిగా అడిగిన ప్రశ్నకి అతను గతుక్కుమన్నాడు. ఆఫీసులో అర్జంటు పని వుందని చెప్పి, వుదయం ఎనిమిది గంటలకే వెళ్లిపోయేడు. అప్పుడామె ఎలాంటి అనుమానాన్నీ వ్యక్తంచేయలేదు. కానీ, యిప్పుడు డౌట్ చేస్తోందేమిటి? నిజానికతను వెళ్లింది ఆఫీసుక్కాదు. అతని సెకండ్‌వైఫ్ ఆరోజు వస్తున్నట్టుగా నిన్ననే ఫోన్‌వస్తే యివాళ ఆవిణ్ణి రిసీవ్ చేస్కోడానికి స్టేషన్‌కెళ్లేడు. ఆవిడకోసమే వారంరోజులక్రిందట లీలామహల్‌దగ్గరున్న నారాయణ స్ట్రీట్‌లో ఓ యిల్లు అద్దెకు తీసుకున్నాడు. ఆఫీసు ప్యూన్ ఎమ్మన్‌చేత ఆ యింట్లోకి ఫర్నిచరూ వగైరా సామాన్లు తెప్పించేడు. "మా ఫ్రెండు ఒకాయనకి యీ వూరికి ట్రాన్స్‌ఫరైంది. వాడొచ్చేసరికి, ఫర్నిచర్‌తోసహా ఓ యిల్లు ఏర్పాటుచెయ్యమని వుత్తరం రాసేడు. అందుకే యీ ఏర్పాట్లు చేస్తున్నాను" అంటూ ఎమ్మన్ ఏమీ అడక్కపోయినా తనే కావాలని అబద్ధంచెప్పేడు. దాంతోపాటు మరో రిక్వెస్టు కూడా చేసేడు. "అన్నట్టు ఈ యిల్లు విషయంగాని, నా ఫ్రెండు విషయంగాని, మీ మేడమ్‌గారికి చెప్పొద్దు. ఎందుకంటే మా ఫ్రెండుకి, మీ మేడమ్‌గారి ఫేమిలీకి చాన్నాళ్ల



ంచి విరోధం. మావాడికి నేనీ సాయం చేసే నని తెలిస్తే ఆవిడ కోప్పడుతుంది'' అంటూ అడ్డంగా ఓ అబద్ధం ఆడేసాడు. ఎవరితోనూ చెప్పనని ఎమ్మన్‌గాడూ ప్రమాణంచేసేడు. అలాంటప్పుడు నేనివాళ ఆఫీసుకి వెళ్లేనా? లేదా? అనే అనుమానం యీావిడకెందుకొ చ్చింది?

''ఆఫీసుకి ఫోన్‌చేసేవా? ఫోన్ సరిగ్గా పనిచె య్యటం లేదులే! ఔట్‌గోయింగ్ కాల్స్‌తప్ప, ఇన్ కమింగ్ కాల్స్ సరిగా రావడంలేదు'' తన మాటలు నమ్మిందో లేదోనని ఆమెను ఓరకంట చూసేడు. కానీ, ఆవిడ రియాక్షన్లో మార్పు కనిపించలేదు.

''మీ సూపరెన్నొంటు ఎవరో ఎలకలపూడి చిలకలదానట, పళ్లబుట్టలూ అవీ పట్టుకుని మీ దర్శనంకోసం వచ్చేడు. అదీ ఎప్పుడు వచ్చేడు? సరిగ్గా నేను మా క్లబ్ మెంబర్స్‌తో



చాలా ఇంపార్టెంటు మేటరు డిస్కస చేస్తుండగా వచ్చేరు. నిజంగా ఆ కానుకలు ఇచ్చేవాడైతే ఆ టైమ్‌లోనా వస్తాడు? అవి తీస్కోవడమా, లేదా? అన్నది నాకు అగ్నివరీక్షలా తయారైంది. నిజంగా తీన్కునుంటే మా మెంబర్సుముందు నాకెంత తలవంపులై వుండేది. వాళ్లు ఆయన వుత్త లంచగొండి



ఆఫీసరు అని పూరందరికీ వాళ్లు ప్రచారంచేసుండేవారు''

జి.యమ్. ఆ మాటలు వింటూనే పిడికిళ్లు బిగించేడు. ఆ చిలకలదానుగాడి రాకవల్ల తన భార్య తనని శంకించే పరిస్థితి ఏర్పడింది. తన భార్య తిరస్కరించడంతో, ఆ సంఘటన అక్కడితో అయిపోయిందిగాని, లేకపోతే తన భార్య సరాసరి ఆఫీసుకి కారు తీసుకొచ్చి వెరిపైచేసుంటే?

సరస్వతి మళ్లీ ప్రశ్నించింది "అయినా మీరు ఆఫీసులో అర్జంటు వర్కు చేస్తున్నట్టు మీ ఆఫీసు సూపర్నెంటుకే తెలీదా?''

జి.యమ్. యీసారి గతుక్కుమనలేదు. అనుకోకుండానే అబద్ధం నోట్లోనించి పుట్టుకొచ్చేసింది "నేనివాళ మా ఆఫీసు స్టేఫ్ తాలూకా కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్సు రాయడానికి వెళ్లేను. ఇది చాలా రహస్యంగా చెయ్యాల్సిన పని. అందుకే, చివరకి సూపర్నెంటుక్కూడా చెప్పలేదు.''

ఆవిడ నమ్మిందో, లేదోగాని, అబద్ధంమాత్రం బ్రహ్మాండంగా కుదిరింది. రహస్యంగా రెండో పెళ్లాన్ని కీప్‌చేస్తే ఏమగాడికైనా తెలివితేటలు అభివృద్ధి చెందుతాయేమోనని లోలోపలే అనుకున్నాడు.

"మీరు ఆఫీసులో జాయినై పట్టుమని పది రోజులు కూడా కాలేదు. అప్పుడే మీరు మీ స్టేఫ్ గురించి కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్సు రాయడం ఏమిటి?'' అని ఆవిడ ప్రశ్నిస్తుందేమోననుకున్నాడుగాని, ఆవిడ ఆలోచన ప్రస్తుతం తను తిరగ్గొట్టేసిన పళ్లబుట్టలమీదే వుండడంవల్ల మరేం ప్రశ్నించలేదు.

ఆ చిలకలదాను రాకూడని సమయంలో వచ్చినందుకు ఆవిడకి కోపంవచ్చింది!

అసలా చిలకలదాను తనింటికెందుకొచ్చి, తన భార్యకి ఎందుకు అనుమానం కలిగించాలి? అని జి.యమ్.గారు ఆవేశపడుతూ, రేపు ఆ దానుకి ఎలా డోస ియివ్వడమా? అనే ఆలోచనలో పడ్డాడు.

★ ★ ★

మర్నాడు చిలకలదాను ఆఫీసుకి వస్తూ వస్తూ ఆంజనేయస్వామి గుడి దగ్గర ఆగి, దేవుడికి దండంపెట్టేడు. అతనికి తెలిసి, దేవుళ్లలో, తమపైనున్న దేవుళ్లచేత ఎప్పుడూ ఏ చీవాట్లు తినని దేవుడంటూ వుంటే అది ఆంజనేయ స్వామి ఒక్కడే! శ్రీరాముడికతను సబార్డినేటే అయినా, అతన్తో సమానంగా పూజించబడే దేవుడు యితనే!'' ఈరోజు మా జి.యమ్.చేత చీవాట్లు తగలకుండా దీవించు'' అని ప్రార్థిస్తూ ఆఫీసుకి బయలుదేరేడు. కానీ, ఒంటిచేత్తో సంజీవిపర్వతాన్ని పట్టుకుని, గాల్లో ఎగురుకుంటూ వచ్చిన హనుమంతుడికిసైతం ఆరోజు చిలకలదానుని జి.యమ్. తిట్టకుండా ఆపే శక్తి లేకపోయింది.

"మీరు మా యింటికి కానుకలు పట్టుకురావడంలోని వుద్దేశం ఏమిటి? నేను లంచాలు తీసుకుంటున్నానని వూరంతా ప్రచారం చెయ్యడానికే అలా చేసేరా? ఆఫీసులో చిన్న చిన్న తప్పులు చేస్తూ, హాలిడేనాడు పెద్ద తప్పులు చెయ్యడం మీ నైజమా?'' అంటూ జి.యమ్.గారు వీరపాండ్యకట్టబ్రహ్మన్నలాగా వీరావేశంతో డైలాగులు చెప్తూ ధాం, ధూంమన్నాడు.

"అదికాదుసార్! ఆఫీసులో నేను చేసిన తప్పులకి క్షమాపణ చెప్పడానికే వచ్చేను. మీ పాదాలతోడుగా చెప్తున్నాను'' అంటూ కిందకి ఒంగి ఆయన పాదాలమీద చెయ్యి వెయ్యబోయేడు. అదే సమయంలో రంగారావు తలుపు తోసుకుంటూ లోపలకొచ్చేడు. అది చూసి చిలకలదాను గభీమని నిలబడిపోయేడు. అప్పటికి లక్కీగా చేతిలోవున్న బాల్‌పెన్నుని రంగారావుకి చూపిస్తూ "ఈ పెన్ను కిందవడిపోతే ఒంగొని తీసుకుంటున్నాను'' అన్నాడు గిల్టీగా. రంగారావు అతన్ని గిల్లుతున్నట్టుగా చిన్నగా నవ్వుతూ "నేనేం అడగలేదుకదండి'' అన్నాడు.

రంగారావు వచ్చేకగూడా జి.యమ్.గారు అసలు విషయమేమిటో మాటల్లో చెప్పకుండా దాస్తూ, చిలకలదాను చేసిన ఏదో తప్పుకి మందలిస్తున్నట్టుగా మాట్లాడి పంపించేసేడు. ఆ గదిలోనించి బయటకొచ్చేక రంగారావు తప్పకుండా "ఏంజరిగిందీ?'' అని అడుగుతాడు. విన్నాక, తను చెప్పిందానికి వక్రభాష్యాలు పలుకుతూ కామెంట్ చేస్తాడు. జి.యమ్. తిట్టిన తిట్లకంటే, రంగారావు చేసే వెటకారమే దుర్భరంగా వుంటుంది. ఎందుకొచ్చిన గొడవ యిదంతా అనుకుంటూ ఆరోజుకి లీవ్




ఎప్లయ్‌చేసి ఇంటికెళ్లిపోయేడు చిలకలదాను.

★ ★ ★

అతనింట్లోవాళ్లంతా అతన్ని విమర్శించేవాళ్లు, చులకనగా మాట్లాడేవాళ్లేతప్ప ఎవరూ అతని సమస్యల్ని వినరు, జాలి చూపించరు, సలహా ఇవ్వరు. వరలక్ష్మికి గబగబా ఏదో యింత వంటచేసేసి కూతురి సాయంతో తను నిర్వహిస్తున్న చీటీల తాలూకు లెక్కలు చూస్కోడంతోనే సరిపోతుంది. చీటీల డబ్బు వసూలుచెయ్యమని అప్పుడప్పుడు తన కొడుకు పవన్‌కుమార్ని పంపించాలనుకుంది. కానీ, అతను ఒప్పుకోలేదు. "నేను రేపో మాపో సినిమా హీరో కాబోతున్నవాణ్ణి, నేనో టాప్ పొజీషన్ కెళ్లిపోయాక, యిప్పుడు నీదగ్గర చీటీలు వేసేవాళ్ళంతా ఈ కుర్రాడే చీటీల డబ్బు కోసం మా యింటిచుట్టూ కుక్కలా తిరిగేవాడు అంటూ తేలిగ్గా మాట్లాడ్డం, నా ఫొటోకోసం వుత్తరాలు రాస్తూ, యీ చీటీల విషయమే రిఫరెన్సు యివ్వడం చేస్తారు. అది నా గ్లామర్‌కి, నా ఇమేజ్‌కి దెబ్బకొడుతుంది" అంటూ తను వెళ్లకపోడానికి గల కారణాలు వివరించేవాడు.దాంతోఆ డ్యూటీ చిలకలదాను చెయ్యాల్సివచ్చింది. కానీ, ఈమధ్య అతను తన ప్రమోషన్ విషయమై తీవ్రంగా ప్రయత్నిస్తూ బిజీగా వుండడంచేత అతనూ వెళ్లనంటున్నాడు. దాంతో వరలక్ష్మి తన కూతుర్నే చీటీ డబ్బుల వసూళ్లకు పంపించనారంభించింది. అలా ఆ అమ్మాయి డబ్బు వసూలు చెయ్యడానికి వెళ్లే యిళ్లలో ముఖ్యమైన ఇల్లు కార్పొరేటర్ చిట్టితల్లిగారిది. ఆ వార్డుకి శ్రీమతి చిట్టితల్లిగారే కార్పొరేటరు. ఆవిడ కార్పొరేషన్ ఎలక్షన్లో గెలవకముందునించీ వరలక్ష్మితో చీటీలు వేస్తోంది. కార్పొరేటర్ అయ్యేక గూడా చీటీల్ని కంటిన్యూ చేస్తోంది. వరలక్ష్మి కూతురు రత్నకుమారి చీటీ డబ్బు వసూళ్లకి వెళ్లమంటే, ముందు వెళ్లనంటూ చిందులువేసింది. కానీ, ఓసారి ఆ పనిమీద వెళ్లొచ్చేక ఎంతో సంతోషించింది. అంతేకాదు, కార్పొరేటరు చిట్టితల్లి తను వెళ్లిన వెంటనే డబ్బు ఇచ్చెయ్యకుండా, నాలుగుసార్లు తిప్పితే బావుణ్ణని కూడా అనుకుంది. అందుక్కారణం, చిట్టితల్లిగారి కొడుకు సత్యప్రసాద్! అతను రత్నకుమారికంటికి, ఆమె కలల్లోకి రాజకుమారుల్లాగే కనిపించేడు. రూపానికేకాదు, మాటకారితనానిక్కూడా అతను నిజమైన హీరోలాగే కనిపించేడు. అతన్తో మాట్లాడిన పది నిమషాలూ ఆమెకు పదినెలలపాటు గుర్తుంచుకునే మాటల్లాగే అనిపించేయి. తనకు కలిగిన ఈ కొత్త అనుభూతిని తన తల్లికిగాని, యితరులకిగాని చెప్పలేదు. అది ఇతరులకి చెప్పి ఆనందాన్ని పంచుకోగలిగే విషయం కాదనుకుంది. ఆమెలో వస్తున్న కొత్తమార్పుల్ని చీటీల హడావిడిలోపడి వరలక్ష్మి గమనించలేదు. ప్రమోషన్ హడావిడిలో చిలకలదాను టోటల్‌గా కూతురి విషయమే పట్టించుకోలేదు.



ఆఫీసులో చిలకలదానుని, ఏదైనా ప్రత్యేకమైన పనివుంటే తప్ప జి.యమ్. పిలవడం మానేశాడు. అది అసరాచేస్కుని, రంగారావు తనకి సంబంధంవున్న పనులూ, లేనిపనులూ తన నెత్తిమీద వేస్కుని, జి.యమ్.గారి గదిలోకి వెళ్లొస్తూ ఆయన్తో టచ్ మరింత పెంచుకున్నాడు. పెంచుకున్నాడో లేదోగాని అలా అని చిలకలదాను అనుమానం! ఆ అనుమానమే అతని భయాన్ని పెంచింది. పేకాటలో ఒకడు ఓడిపోతేతప్ప మరొకడు లాభంపొందడు! పరిస్థితి అంతా వివరించి, సుబ్బయ్యనాయుణ్ణి సలహా అడుగుదామనుకున్నాడు, కానీ, "ప్రతీ చిన్న సమస్యకీ నన్నే సలహా అడుగుతున్నావు. నీకు సొంత తెలివి యింతమాత్రం కూడా లేదా?" అంటూ వెటకారంచేస్తాడని సందేహించేడు. ఒకరోజు ఫ్యూన్ ఎమ్మన్ని కాంటీన్లో కూర్చోబెట్టి, కాఫీ, టిఫిను యిప్పించి, "నేను జి.యమ్.గార్ని ఒంటరిగా కల్సుకుని, వివరంగా మాట్లాడాలి. ఆయన యింటికి వెళ్లకూడదా అని సలహా చెప్పకు. వేరే స్థలం ఏదైనా

వుంటే చెప్పు. ఈ విషయం మనిద్దర్లోనే వుండా లిసుమా'' అంటూ రిక్వెస్టుచేసేడు. ఎమ్మన్ ఓ నిమిషంపాటు ఆలోచిస్తూ మోకాలు విపరీతంగా గోక్కున్నాడు. ''అదేమిట్రా అక్కడ అంతలా గోక్కుంటున్నావు? ఏదైవా దురదల జబ్బా?'' అడిగేడు దాసు.

''అబ్బే! అదేంలేదండి, నాకు మోకాలు గోక్కుంటేనే నా బుర్రలోకి అయిడియాలు వస్తాయి'' అంటూ యింకా ఆ పనిమీదే వున్నాడు. ''ఔనులే ఎవడికి ఎక్కడ మెదడుంటే అక్కడే గోక్కోవాలి'' అని మనసులోనే అనుకున్నాడు దాసు.

రెండు నిమిషాల తర్వాత ఎమ్మన్ ఓ అయిడియా చెప్పేడు. ''మన జి.యమ్.గారు లీలా మహల్ పక్కనున్న నారాయణా స్ట్రీట్లో ముప్పైఒకటో నెంబరు యిల్లు అద్దెకు తీసుకున్నారు''

''ఎందుకు?''

''ఆయన ఫ్రెండుగారెవరో యీవూరొస్తున్నారట. వారికోసమే తీస్కున్నానని నాతో చెప్పేరు. ఈవారంలో నేను గమనించిందేమిటంటే సాయంకాలం ఆఫీసు అయిపోయేక ఆయన ఆయింటికే వెళ్తున్నారు. ఎందుకంటే, మేడమ్గారంటే మన జి.యమ్.గారికి కాస్త భయం ఎక్కువలావుంది. ఇంటికెళ్లి రెస్టు తీస్కునే ఛేన్సు ఎలాగూ వుండదు కాబట్టి, ఖాళీగావుండే తన ఫ్రెండు ఇంటికెళ్లి కాస్సేపు రెస్టుతీసుకెళ్తారని నా అనుమానం!''

''ఆయన ఫ్రెండు యింకా రాలేదా?''

''రాలేదనే నా నమ్మకం, ఎందుకంటే ఆ ఫ్రెండుకోసం ఫర్నిచరూ, గిర్నిచరూ నాచేతే తెప్పించేరు. ఇల్లంతా నాచేతే శుభ్రంచేయించేరు. యిన్ని పనులూ నాచేతే చేయించిన మనిషి తన ఫ్రెండు వచ్చేడన్న సంగతి చెప్పలేదంటే, ఆ ఫ్రెండుగారెవరో రానట్టేగదా! వచ్చుంటే, చిన్నా చితకా పనులు నాచేత చేయించేవాళ్లుగా! అలా చేయించలేదంటే ఆ ఫ్రెండుగారు రానట్టే! ఆయనక్కడ ఒంటరిగా ఓ గంటో, రెండు గంటలో వుంటారు. ఆ టైములో మీరు వెళ్లి మాట్లాడెయ్యండి. అన్నట్టు, ఆ యింటి సంగతి నేను మీతో చెప్పినట్టుగా మాత్రం చెప్పకండి''

అలాగేనంటూ ఎమ్మన్కి మాటయిస్తూనే, ఈ సాయంకాలం జి.యమ్.గార్ని ఒంటరిగా కలిసి, ఏం మాట్లాడాలా అని ఆలోచించేడు. ఆ సాయంకాలం జి.యమ్.గారు ఆఫీసునించి వెళ్లేవరకూ ఆగి, అతను కారెక్కి వెళ్లడంకూడా దూరంనించి గమనించి, తను గమనిస్తున్న విషయం రంగారావు గమనించకుండా జాగ్రత్తపడిమరీ బయలుదేరేడు. నారాయణా స్ట్రీట్ లోకొచ్చి, వీధిచివర విక్కీమోపెడ్ వదిలేసి, మెల్లగా నడుచుకుంటూ ముప్పైఒకటో నెంబరు యింటిముందు ఆగేడు. జి.యమ్.గారి కారు వుందిగాని, అది ఆ యింటిముందు లేదు. ఆ వీధికి మరో చివర పార్క్చేసివుంది! శబ్దంకాకుండా ఆ యింటి గేటు తీస్కుని రెండడుగులు ముందుకువేసి, కొన్ని క్షణాలపాటు ఆగేడు.

అంతకు ఓ అరనిమిషంక్రితందాకా ఏంజరిగిందంటే-

జి.యమ్.గారి సెకెండ్ ఛానల్గారైన చాముండేశ్వరి ''యివాళ మనం ఫస్ట్షో సినిమాకి వెళ్దాం పదండీ'' అంది. యివాళ కుదరదూ అన్నాడు జి.యమ్. ''ఇవ్వాళే కుదరదా? లేక, మనిద్దరం పబ్లిక్లోకి వెళ్లడం మీ జీవితాంతం కుదరదా? మీ ఆవిడకి నా సంగతి చెప్పకుండా ఎన్నాళ్లు దాస్తారు? ఎన్నాళ్లు నేను మీ భార్యగా కాకుండా ఓ వుంపుడుకత్తెలా బతకాలి? మీ పెళ్లాం అంటే మీకంత భయం వున్నప్పుడు, వెధవ కబుర్లు చెప్పి నన్ను ఎందుకు వల్లోవేస్కోవాలి?'' అంటూ చెడామడా తిట్టింది. ''ఛీఛీ... నా భార్యంటే నాకు భయమనుకున్నావా? నా అండర్లో అయిదు వందలమంది వినయవిధేయతల్తో బతుకుతుండగా, నేను నా పెళ్లానికి భయపడతానా?'' అంటూ జి.యమ్.గారు మహాగర్వంగా మీసం మెలివేసి మరీచెప్పేడు. ఆ ఘర్షణ పెరగబోతుండగా చాముండేశ్వరికి సడన్గా కాళ్ల పిక్కల్లో నెప్పివచ్చింది. ఆవిడకి అలా రావడమూ మామూలే! ఆ నెప్పి వచ్చినప్పుడు జి.యమ్.గారు అమృతాంజనం రాసి మర్దనా చేయడమూ మామూలే!

చిలకలదాను సరిగ్గా ఆ యింట్లోకి అడుగు పెట్టేటప్పటికి, లోపల నిశ్శబ్దంగా జరుగుతున్న తంతంగం అదే! నిశ్శబ్దంగా వుంది కాబట్టి, జి.యమ్.గారు ఒంటరిగా విశ్రాంతి తీసు




# ఏరినముత్యాలు

★ కుళ్ళిపోతున్న కురుపుమీద వైద్యుడు జరిపే శస్త్రప్రయోగాన్ని హింస అని ఎవ్వడూ అనలేడు.

— శ్రీ శ్రీ

★ భావాలకు, స్వప్నాలకు తేడాలేదు. ఆచరణలో పెట్టని ఆలోచనలు కరిగిపోయే కలలతో సమానం.

★ అన్నివైపుల నుండి ఉదాత్త భావనలను రానివ్వు.

— ఋగ్వేదం

★ తన అజ్ఞానాన్ని గ్రహించడమే జ్ఞానానికి తొలిమెట్టు.

—డిజ్రాయిలి

★ అబద్ధాలు చెప్పేవాడికి జ్ఞాపకశక్తి ఎక్కువగా ఉండాలి.

★ అబద్ధంయొక్క ఆయువు కొద్దికాలం మాత్రమే.

— సోఫోకిల్స్

★ అసహ్యాన్ని అసహ్యంతో ఎన్నడూ జయించలేం. ప్రేమద్వారా అసహ్యంపై విజయం సాధించగలుగుతాం.

— గాంధీజీ

★ అసహ్యించుకోవడం పిశాచాలవని. క్షమించడం మానవుల ధర్మం. ప్రేమించడం దేవతల సుగుణం.

— భర్తృహరి

★ మానవుల పిచ్చివసే ఏవగింపు.

— బైరన్

★ మనిషి పుట్టుకతోనే నొసట తిలకం, యజ్ఞోపవీతం ధరించి రావడం లేదు. మంచిపనులు చేసేవాడెవడయినా బ్రాహ్మణుడే. చెడు కార్యాలుచేసేవారే ఛండాలురు.

— గౌతమబుద్ధుడు

★ అస్పృశ్యత హిందూమతానికి కళంకం వంటిది. దీనిని రూపుమాపనంతవరకూ హిందూమతం ప్రమాదంలోనే ఉంటుంది.

— గాంధీజీ

★ అస్పృశ్యత అనేది శాస్త్రీయ ఆధారంగా ఎక్కడాలేదు. ఈశ్వరుని ద్వారాలు కొందరికోసం మూసివేయబడిలేవు. ఒకవేళ మూసివేయబడితే ఆ ఈశ్వరుడు ఈశ్వరుడేకాదు.

— తిలక్

★ అస్పృశ్యత దేశాన్ని నాశనంచేసింది. జాతి నిర్వీర్యమైపోయింది. ఇప్పుడు మనం కళ్ళుతెరిచాం. అస్పృశ్యత మూర్ఖమైన ఆచారం.

— నెహ్రూ

---

**సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

---

కుంటున్నాడని భావించేడు. కాలింగ్‌బెల్ నొక్కుదామా అనుకున్నాడుగాని, ఆ తలుపుకి బెల్ లేదు. తలుపు మెల్లగా తోసేడు. శబ్దంకాకుండా తెరుచుకుంది. హాల్లో ఎవరూ కనిపించలేదు. ఓవైపుకి తిరిగి చూసేడు. అది బెడ్‌రూమ్! తలుపులు తీసేవున్నాయి. జి.యమ్.గారు చాముండేశ్వరికి పిక్కలు నొక్కుతూ మసాజ్ చేస్తున్నాడు. ఆ దృశ్యాన్ని చూడగానే చిలకలదాసు కంగారుపడి, బైటకి వెళ్లిపోదాం అనుకున్నాడు. అదేసమయంలో జి.యమ్.కూడా అటుచూసి షాక్అయిపోయి నిలబడ్డాడు. చాముండి గూడా మంచంమీద పడుకునే చిలకలదాసుని చూసి, గబగబా చీర సర్దుకుని, మంచంమీదనుంచి దిగింది. కొన్నిక్షణాలపాటు ఎవరినోటంటా మాట రాలేదు. చిలకలదానుకి భయంతో కాళ్లు వణుకుతున్నాయి. జి.యమ్.కి విపరీతమైన కోపంవల్ల చేతులు వణుకుతున్నాయి. కొన్నిక్షణాల తర్వాత చిలకలదాస్ సాహసంచేసి మాట్లాడేడు.

"క్షమించండి సార్... తమరు ఒంటరిగా వున్నారనుకుని వచ్చేసేను"

"అనలిక్కడకెందుకొచ్చేరు? నేను యిక్కడుంటానని మీకెవడు చెప్పేడు?" జి.యమ్. గంభీరంగా ప్రశ్నించేడు, ఈ యింటిసంగతి ప్యూన్ ఎమ్మన్‌కి తప్ప మరెవరికీ తెలియదు. ఒకవేళ వాడు చెప్పుంటాడా అన్న అనుమానం అతనికి కలిగింది. అతను మళ్లీ రెట్టించేడు. "చెప్పండి, నేనిక్కడుంటానని మీకెలా తెలుసు? ఎవరు చెప్పేరు?"

చిలకలదానుకి అబద్ధం తట్టేసింది. "ఎవరూ చెప్పలేదుసార్. యీ వీధిలో నన్ను తెలిసినాయన ఒకరున్నారు. మీరు మా బాస్ అని ఆయనకి తెలునండి. నేను ఓ చిన్న పనిమీద ఈ వీధిలోకొస్తే మీ బాస్‌గారు ఆ యింట్లో వున్నారని ఈ యిల్లు చూపించేడు. మీకేమైనా సాయం చెయ్యొచ్చుకదాని, వచ్చేను సార్! క్షమించండి" అంటూ వెళ్లబోయేడు.

"ఆగు! ఈ వీధిలో మీ ఫ్రెండు పేరేమిటి? అతనిల్లు ఎక్కడో చూపించు" అన్నాడు జి.యమ్.

చిలకలదాను గతుక్కుమన్నాడు. ఎవరిపేరని చెప్పడం. ఈ వీధిలో తనకెవరూ తెలిసినవారు లేరు. కాస్త తటపటాయిస్తూనే అన్నాడు "ఆయన ఇవాళే యిల్లు ఖాళీచేసి వెళ్లిపోయేడండి. ఆఖరివిడత సామాన్లని బండికెక్కిస్తుండగా నన్ను చూసేడు. ఈపాటికా బండి వెళ్లిపోయివుంటుంది" ఈ అబద్ధం అతనికే నచ్చలేదు. పైగా యిది జి.యమ్. నమ్మే అబద్ధంకూడా కాదు. జి.యమ్.కి తన రహస్యం బయటపడిపోయిందన్న కంగారు, భయంలో కాస్త లిమిట్స్ తప్పిమరీ దానుని చెడామడా దులిపేసేడు. ఈ సంఘటన, చిలకలదాను చెప్పిన ఒకేఒక్క మాటతో కొత్తమలుపు తిరిగింది.

"మీరేం బాధపడకండి సార్! యిక్కడున్న స్మాల్ మేడమ్ గురించిగాని, మీరు ప్రేమతో చేస్తున్న సేవల్ని గురించిగాని, అటు ఆఫీనులోనూ చెప్పను, ఇటు పెద్ద మేడమ్‌కు అస్సలు చెప్పను. ఆ మేడమ్‌గారు ఎంత ఖచ్చితమైన మనిషో నాకు తెల్సుగదా"

ఇదీ చిలకలదాను చెప్పింది. అందులోని ఆఖరిరెండు వాక్యాలు వినగానే చాముండేశ్వరి కాళ్లకి స్ప్రింగులున్నట్టు తైతైమని గెంతింది. కోపంతో రెచ్చిపోయింది.

"ఆవిడ ఖచ్చితమైన మనిషీ అంటే నేను ఖచ్చితమైనదాన్ని కాననేగా" అంటూ రీజన్ తీసింది.

"అబ్బే! అమాట నేను అనలేదు" అన్నాడు జి.యమ్. కంగారుపడుతూ.

"ఆ మాట మీరన్నా బావుండు. ఆఫీసులో మీ అందర్లో పనిచేసే మామూలు వుద్యోగస్తుడన్నాడు. అంటే, నేనొకదాన్ని వున్నానన్న సంగతి మీ ఆఫీనులో అందరికీ చెప్పినా, మీ ఆవిడకెందుకు చెప్పలేదు?"

"నీ విషయం నేనెవరికీ చెప్పలేదు"

"చెప్పకుండా నా సంగతి అతనికెలా తెలిసింది? యిప్పుడు మీరు నన్ను పరిచయం చెయ్యలేదుగా! అయినా నేను అతనికెలా తెలిసేను?

నేను మీ గర్ల్‌ఫ్రెండుననుకోవచ్చుగా. అలా అనుకోకుండా నేను వాళ్ల స్మాల్ మేడమ్‌నని ఆయనకెలా తెల్సిపోయింది. ఎవరికీ తెలియకుండా ఈ ఇల్లు అద్దెకు తీనుకున్నానన్నారు.




కానీ ఈ ఇంటి ఎడ్రెస్ ఈయనకెలా తెలిసింది? ఇన్నాళ్లూ నా గురించి ఎంతమందికి తెలుసో నాకు తెలీదు. కానీ ఇప్పుడీ చిలకలదానుకి తెల్సిపోయింది కాబట్టి ఇప్పుడు నిలదీసి అడుగుతున్నాను.

జనాభా లెక్కల్లో మా ఆయన పేరు ఏవిటీ అని అడిగితే జవాబు చెప్పలేకపోయాను. రేషన్‌కార్డుల్లో నా పేరు కుమారి చాముండేశ్వరీ అని రాయించుకున్నాను. మీతో బెడ్‌రూమ్‌లో పడుకోవడం తప్ప, మీతో కలిసి ఓ సినిమాకెళ్లడానికి వీల్లేదు. ఓ షికారు కెళ్లడానికి వీల్లేదు. ఓ షాపింగ్ కెళ్లడానికి వీల్లేదు. ఇలా ఎన్నాళ్లు నన్ను అజ్ఞాతవాసంలో వుండమంటారు చెప్పండి. నా సంగతి మీ ఆవిడగారికి చెప్పనని ఆయనన్నాడు. అంటే దానర్థం ఏవిటి? ఆవిడంటే మీకు భయమా? నా సంగతి తెలిస్తే ఆవిడ ఏం చేస్తుందట? నన్ను చంపేస్తుందా? లేక మీకు విడాకులిస్తుందా? ఇస్తే ఇవ్వమనండి'' అంటూ జి.యమ్. ఎంత ఆపినా ఆగకుండా దడదడమంటూ తన వుక్రోషాన్ని వెళ్లగక్కేసింది. ఆవిడ అలా దులిపేసినందుకు తను బాధపడలేదు. కానీ చిలకలదాను ఎదుట దులిపేసిందే అని గిలగిల్లాడిపోయేడు. చిలకలదానుపనీ అలాగే వుంది. రెండో భార్యకి పాదసేవ చేస్తుండగా తను రావడమే తప్పు. వచ్చేక అతని భార్య తన సమక్షంలో జి.యమ్.గార్ని దులిపెయ్యడం మరీ ఇరకాటంగా వుంది. ఆవిడ మళ్లీ శక్తి తెచ్చుకుని మరికొన్ని మాటల్తో జి.యమ్.ని చెరిగేస్తుండగా ఏమైతే అయిందని చిలకలదాను అక్కడనించి గబగబా బైటకి వెళ్లిపోయేడు.

అలా వెళ్లి వెళ్లి సుబ్బయ్యనాయుడి ఇంట్లో వద్దాడు. జరిగిందంతా చెప్పేడు. తను పూర్తిగా చెప్పేవరకూ నాయుడు నోరు విప్పలేదు. అంతా విన్నాక ''ఓ బోటిల్ తెప్పించు బావా...'' అన్నాడు.

''నాకు తాగాలని లేదు''

''నాకు తాగాలని వుంది. నీకిప్పుడు అయిడియా చెప్పాలంటే నా బుర్ర పనిచెయ్యాలి. అది పనిచెయ్యాలి అంటే దానికి కాస్త పెట్రోలు కొట్టించాలిగదా''

చిలకలదానుకి ఇష్టం లేకపోయినా బోటిల్ తెప్పించేడు. కానీ అతను తాగలేదు. నాయుడు గబగబా మూడు రౌండ్లలో బోటిల్ ఖాళీ చేసేసి, చిలకలదానునిలా దుయ్యబడుతూ మాట్లాడేడు.

''నీ కసలు బుద్ధుందా? నిన్నసలు జి.యమ్. ఇంటికెవడు వెళ్లమన్నాడు? వెళ్లినా అతగాడి పెళ్లాం లేడీస్‌క్లబ్ మెంబర్సుతో మీటింగులో వున్నప్పుడు ఎందుకెళ్లావు? హాల్లో ఆ మీటింగు జరుగుతున్నప్పుడు, కాస్సేపు ఆగి, తర్వాత వెళ్లుంటే, నీకు అనుకూలంగా పనిజరిగుండేదేమో. ఆవిధంగా నీ సొంత తెలివితేటలుపయోగించి మీ జి.యమ్.కి ముప్పయివంతులు కోపం తెప్పించేవు. ఇంక రెండోపాయింటు. అతనికో రెండో పెళ్లాం వుందని నీతో చెప్పానేగాని, ఆ ఇంటి ఎడ్రెస్ కనుక్కుని, ఆవిడకి మీ ఆఫీసరుగారు కాళ్లు పట్టేటైములో వెళ్లమని నేను చెప్పేనా? వెళ్లినా, ఈవిడ సంగతి ఆవిడకి చెప్పనులెండీ అనే దిక్కుమాలిన డైలాగు ఎందుకు వాడేవు? అందువల్ల ఆయన సంతోషించకపోగా, ఆవిడ రెచ్చిపోయింది. ఆయన్ని కాకాపట్టి ప్రసన్నం చేస్కోవయ్యా బాబూ అంటే నువ్వు చేస్తున్న పనిఇదా? వద్దు బావా... ఇంక నీకు సలహాలు ఇవ్వడం అనవసరం'' అంటూ అలిగిపోయేడు. చిలకలదాను అతన్ని ప్రాధేయపడ్డాడు- ''కాకాపట్టి మా ఆఫీసర్ని మెప్పించటం సంగతలాగుంచి ఇప్పుడు నేనాయనకి విరోధినైపోయేను. ఈ పరిస్థితిలో నీ చావు నువ్వు చావూ అంటూ నన్ను వదిలెయ్యడం భావ్యంకాదు'' అంటూ వాపోయేడు. సుబ్బయ్యనాయుడికి జాలికలిగింది. కాస్సేపు మౌనంగా జాలిపడ్డాక, తర్వాత దాన్ని మాటల్లో బయటపెట్టేడు.

''నువ్వేం కంగారుపడకు బావా... ఎన్నో తప్పులుచేసి, ఎంతమంది చేతో ఛీ అనిపించుకున్న ప్రజానాయకులే కాస్త సీజన్ మారగానే చక్రంతిప్పి, ముందు తిట్టినవాళ్ల చేతే జేజేలు కొట్టించుకుంటున్నారు. నా అంచనా కరక్టయితే రేపట్నించీ మీ జి.యమ్. నిన్ను ఆఫీసులోగాని, బయటగాని తిట్టడు. అంటే దానర్థం నీ మీదున్న కోపం తొలగిపోయి, నిన్ను నెత్తిమీద పెట్టుకుంటాడని కాదు. అతని జీవిత రహస్యాన్ని నువ్వు తెలుసుకున్నావు కాబట్టి, అతని కాలు నీవలలో చిక్కుకున్నట్టే.



ఇప్పుడా రహస్యాన్ని నువ్వు ఎవరికీ చెప్ప కుండా జాగ్రత్తపడితే, ఓ నెలరోజుల్లో నువ్వు నిజంగా పెద్దమనిషివే అన్న నమ్మకం ఏర్పడు తుంది. ఆ తర్వాత నువ్వు ఆయన్తో మనలు కునే విధానంబట్టి నీ ప్రమోషన్ ఆధారపడి వుంటాది. ఈలోగా మనం చెయ్యాల్సిన నేష నల్ నెట్‌వర్క్ కార్యక్రమం ఏవిటంటే, వాళ్ల బంధువర్గంనించి కూడా మనం నరుక్కురా వాలి. ఎందుకంటే ఆ రంగారావు ఎప్పుడూ నాదీ జి.యమ్.ది ఒకటే కేష్టు, ఒకటే కేష్టూ అని గెంతుతున్నాడుకదా! అంచేత మనం జి.యమ్.గారి బంధువర్గంనించి ప్రొసీడ్ అవ డంలో తప్పులేదు. మీ జి.యమ్.కి ఇంట్లో వున్నవాళ్లెవరు? ఆయన భార్య! మొదటిసారి వెళ్లే దెబ్బతినేసేవు కాబట్టి ఆవిడ ద్వారా నీకు పనిజరగదు. సో, ఆవిణ్ణి వదిలెయ్యాలి. ఇంక మిగిలింది ఆవిడ తండ్రి వరదరాజులు. అత న్ని మనం ప్రసన్నం చేస్కోవాలి. మనక్కావల సిన మరో కేండేటు. జి.యమ్.గారి చెల్లెలు మొగుడు భాస్కర్‌ప్రసాద్. అతన్ని మంచి చేస్కోడంవల్ల ఏమైనా పనిజరుగుతుందేమో ఆలోచిద్దాం''

ఈ డొంకతిరుగుడు వ్యవహారం చిలకలదా నుకి నచ్చకపోయినా రెండుసార్లు సొంత తెలివి ఉపయోగించి దెబ్బతినేసేడు కాబట్టి, ఈసారి సుబ్బయ్యనాయుడు చెప్పినట్టు నడుచుకోవ డమే మంచిదనుకున్నాడు.

★ ★ ★

నాయుడు ఊహించినట్టే, చిలకలదానుని జి.యమ్. ఆఫీసులో మళ్లీ ఏమీ అనలేదు. ఆఫీసు వర్కు విషయంలో కూడా అతన్ని ఎక్కువసార్లు పిలవలేదు. పిల్చినా తక్కువసా ర్లు, అతితక్కువగా మాట్లాడేడు. అతనూ తల దించుకునే అడగవలసినవి అడిగేడు. చిలక లదానూ తలదించుకునే చెప్పవలసినవి చెప్పే డు. అలా రెండు మూడురోజులు గడిచిపో యేయి. నాలుగోరోజు సుబ్బయ్యనాయుడు ఓ వార్త పట్టుకుని చిలకలదాను ఇంటికొచ్చేడు. అప్పటికి చిలకలదాను, తన కొడుకు పవన్‌కు మార్‌తో గొడవపడుతున్నాడు. శెభాష్ ఆర్ట్ ఫిలిమ్ ప్రొడక్షన్స్‌వాళ్లు దొంగ రాస్కెల్ అనే సినిమా తీస్తున్నారట. కొత్త నటీనటులకు అవ కాశం ఇవ్వబడునూ అని ప్రకటించేరట. ఊరూరా టెంట్‌వేసి సర్కస్ ఆడించినట్టు, వీళ్లు కొన్ని ముఖ్యమైన ఊళ్లలో లాడ్జీలోదిగి, స్థానికంగా ఉన్న నటీనటుల్ని పిల్చి ఇంట ర్వ్యూ చేస్తారట. ఇది మొన్నటి న్యూస్‌కాగా, ఇవాళ్టి తాజాఖబర్ ఏవిటంటే పవన్‌కుమార్ సపోర్టింగ్ హీరోగా ఎన్నికయ్యేడట. ఓ పదివేల రూపాయలు డిపాజిట్ కట్టమన్నారట.

''డిపాజిట్ కట్టడానికిదేమైనా ఉద్యోగమా? అయినా ఇలా డిపాజిట్లు కట్టమనే సినిమా కంపెనీల్ని నేనెక్కడా చూడలేదు'' అన్నాడు చిలకలదాను.

''చూడలేదూ... అని కొట్టిపారెయ్యడానికి ను వ్వు చూసిన సినిమాలెన్ని? నువ్వు చాలా సినిమాలు చూసుండొచ్చేమోగాని, సినిమా కంపెనీల్ని నువ్వెప్పుడు చూసేవు? వాళ్లేం ఆ పదివేలూ జేబులో పెట్టేసుకోవడానికి అడగలే దు. నేను షూటింగ్ మధ్యలో మానేస్తే వాళ్లకి బోలెడంత నష్టం వస్తుందట. అంచేత ముందుచూపుకింద భరోసాగా పదివేలు కట్ట మంటున్నారు'' ఇదీ దానుగారి పుత్రరత్నం చెప్పిన సమాధానం.

''చదువూ సంధ్యా మానేసి సినిమా సినిమా అని అఘోరిస్తున్నవాడివి నువ్వు షూటింగ్ మధ్యలో ఎందుకు మానేస్తావు?'' అంటూ చిల కలదాను వాదనకి దిగినా పవన్‌కుమార్ శాంతించలేదు. సుబ్బయ్యనాయుడు రావ డంతో ఆ సమస్య పరిష్కారం కాకపోయినా, తాత్కాలికంగా వాయిదా పడింది- ''మనం ఓ అర్జంటు పనిమీద వెళ్ళాలి'' అంటూ దానుని తీసుకుని బయటికి నడిచేడు నాయుడు.

దార్లో ప్రస్తుత కర్తవ్యాన్ని వివరించేడు- ''నే ను లాగిన ఇన్ఫర్మేషన్ ప్రకారం మీ జి.య మ్.గారి మామ వరదరాజులుగారు ప్రతిరోజూ షికారుకొచ్చి, రోడ్డుమీద కనబడిన ప్రతి షాపు లోకీ వెళ్లి, ప్రతీ సామాను తాలూకు రేటు ఎంతో కనుక్కుని వచ్చేస్తాడట. అలా కనుక్కుని రావడం అతనికో హాబీ అట. దేవుడి సాక్షిగా అతను ఇంతవరకూ ఏ షాపులోనూ, ఏ వస్తువూ కొనలేదట. అతనీరోజు అక్కయ్యపాలెం దగ్గరు న్న షాపుల్లోకి పాదయాత్ర చేస్తాడట. మనం అక్కడికి వెళ్లి అతన్తో పరిచయం చేసుకుని, నువ్వు మంచివాడివని అతనిచేతో నాలుగు మార్కులు వేయించేసుకుంటే ఆ మార్కులు




రేపు నీ ప్రమోషన్ ట్రైములో ఉపయోగపడ తాయి. అందుకు నిన్ను తీసుకుని వెళ్తున్నా ను''

మాటలు పూర్తయ్యేసరికి అక్కయ్యపాలెం చేరుకున్నారు. అదృష్టవశాత్తు వాళ్లకి వెళ్లిన వెంటనే వరదరాజులు కనిపించేడు. విక్కీమో పెడ్‌ని ఓచోట ఆపి, అతని మూవ్‌మెంట్సుని కాసేపు గమనించేరు. ఓ ఖాదీవస్త్రాలయంలోకి వరదరాజులు వెళ్లేడు. ఖద్దరుబట్ట మీటరు ఎంత? తాను ఖరీదెంత? అంటూ వివరంగా కనుక్కున్నాడు. తర్వాత ఆ పక్కనున్న కళ్ల ద్దాల షాపులోకి వెళ్లి, ఓ కూలింగ్ గ్లాసుని చూస్తూ, దాని ఖరీదెంత? ఉత్త ఫ్రేము ఖరీ దెంత? దానికి ఫిట్‌చేసిన అద్దాల ఖరీదెంత? ఇది ఇండియన్ మేడ్ అంటున్నారు కాబట్టి, ఫారిన్ గ్లాసెస్ లేవా? అంటూ ప్రశ్నలు వేసి, సమాధానాలు పొంది బయటకొచ్చేశాడు. ఈయనకిదేం దిక్కుమాలిన అలవాటో అని చిలకలదాసు, సుబ్బయ్యనాయుడు ఆశ్చర్యపో తూనే గమనిస్తున్నారు. ఆ షాపు తర్వాత ఓ షర్బతులమ్మే దుకాణం వుంది. అక్కడ వెళ్లి ఓ షర్బత్తు తాగేడు. అంటే, ఇతనికి అప్పుడప్పు డు సామాన్లుకొనే అలవాటు కూడా వుందన్న మాట అనుకున్నారు.

ఆ తర్వాత వరదరాజులు ఓ డిపార్ట్ మెంటల్ స్టోరులో కెళ్ళేడు. దాసు, నాయుడు కూడా ఆ షాపులో ప్రవేశించేరు. వరదరాజులు చాలా చాలా సామాన్ల ఖరీదుల్ని అడిగి తెల్సు కున్నాడు. అక్కడున్న ఓ సేల్స్‌మేన్‌కి చిర్రెత్తుకొ చ్చి- ''ఇంతకీ మీకేం కావాలండి? మీరు నిజంగా సామాన్లు కొంటానికొచ్చేరా? లేక మా ప్రాణాలు తోడెయ్యడానికి కొచ్చేరా?'' అనేశాడు వరదరాజులుని.రవంత కోపం వచ్చి, గభీమని అక్కడున్న పెన్‌బాక్సు తీసి ఓపెన్ చేశాడు. అందులో నాలుగురకాల బాల్‌పెన్నున్నాయి- ''ఇదెంతా?'' అని అడిగేడు ''నలభై రూపా యలు'' అన్నాడు సేల్స్‌మేన్ ''ఇరవైకి స్తావా?'' అని బేరమాడేడు. ''ఇక్కడ బేరా లుండవు సార్'' అంటూ ఆ పెన్‌బాక్సుని ఠక్కుమని లాక్కొని అద్దాల కేసులో పెట్టేశాడు సేల్స్‌మేన్. వరదరాజులు అతన్ని చిరాగ్గా చూసి బయటకు నడిచేడు.

ఇదంతా గమనిస్తున్న సుబ్బయ్యనాయుడికో అయిడియా వచ్చింది. చిలకలదాసుకి రహ స్యంగా ఏదో చెప్పి,తన్ని తీసుకుని గబగబా బైటకి నడిచేడు. పోతున్న వరదరాజులు దగ్గరకి గబగబా పోయి ఇద్దరూ నమస్క రించేరు.

''ఎవరు మీరు...? ను మీకు తెలుసా?'' అని వరదరాజులు ఆశ్చర్యంగా అడిగేడు. ఎందుకంటే అతనికి ఇంటి నౌఖరు తప్ప ఈ ఊళ్లో మరో శాల్తీ ... ఇంతవరకూ నమ స్కారం చేయలేదు.

''నా పేరు ఎలకలక్ష్మి చిలకల దాసండి. వీడు నా బావమరిదండి. వీడి పేరు వుబ్బునిబిల్లి సుబ్బయ్యనాయుడండి'' అంటూ తన గురించి సో అండ్, సో అండ్ సో పరిచయం చేసుకున్నాడు.

''అంటే మీరు మా అల్లుడు ఆఫీసులో సూపరెంటెంటు అన్నమాట'' అంటూ కడుపుబ్బ నవ్వించే జోక్ విన్నట్టుగా పగలబడి నవ్వాడు.

''తమరాషాపులో ఏవో సామాన్లు కొంటానికి వెళ్లినట్టున్నారు...'' అంటూ నాయుడు చిన్నగా నసుగుతూ అడిగేడు.

అబ్బే... కాలక్షేపం కోసం ప్రతీ షాపుకెళ్లి ప్రతీ వస్తువు రేటూ అడుగుతుంటా. చె ప్పడం వరదరాజులుకిష్టం లేకపోయింది. ''ఔ నండి. ఓ పెన్‌సెట్ కొందామని వెళ్లేను. నలభై రూపాయలు చెప్పేడు. ఇరవైకిస్తావా అన్నా. ఇవ్వనన్నాడు. వచ్చేసేను. ఏమైనా ఈ షాపు ధరలు చాలా ఎక్కువే సుమండీ'' అంటూ మళ్లీ పగలబడి నవ్వేడు.

సుబ్బయ్యనాయుడు, చిలకలదాసుకి వరద రాజులు చూడకుండా ఏదో సంజ్ఞ చేసేడు.

''ఈ వూర్లో ధరలు ఎక్కువైనమాట నిజమే గాని... మీకీ షాపులో సామాన్లు కావాలని చిలక లదాను బావకి ఒక్కమాట చెప్పుంటే ఎంత బాగుండేదండి. ఆ షాపు ప్రొప్రయిటరు వెంక టస్వామి మా బావకి తిక్కెష్ట ఫ్రెండండి'' అన్నాడు సుబ్బయ్యనాయుడు.

''ఆ షాపు ప్రొప్రయిటరు పేరు వెంకట స్వామా?''

''ఔనండి''

''అతను బెంగాలీవాడిలా వున్నాడే''

''చిన్నప్పుడు బెంగాలీవాడేనండి. అందుకే





మేం వాణ్ణి వెంకటస్వామి, వెంకటస్వామి అన కుండా బెంకటస్వామి బెంకటస్వామి అని పిల్చేవాళ్లం. తర్వాత వాడు తెలుగమ్మాయిని చేస్కుని ఇక్కడే సెటిలైపోయాడు'' అన్నాడు దాను.

''చిన్నప్పుడు మా బావా, ఆ వెంకటస్వామి ఒక కంచంలో తిని, ఒక మంచంమీద పడుకు న్నారంటే నమ్మండి''

''అంటే చిన్నప్పుడు మీరిద్దరూ అంత పేద రికంలో బ్రతికేరా?'' వరదరాజులన్నమాటకి ఇద్దరూ నివ్వెరపోయారు. వాళ్ల రియాక్షన్ గమ నించి వరదరాజులు మళ్లీ భళ్లున నవ్వుతూ- ''తెల్లమొహాలు వేసేరేవిటండీ,నేను జోక్ వేశా నంతే'' అన్నాడు. 'నీ జోకు నీ మొహంలాగే వుందిరా' అని లోలోపలే అనుకుంటూ పైకి మాత్రం పెద్దగా నవ్వేసి- ''మీకా పెన్‌సెట్ కావాలంటే చెప్పండి, మావాడు ఫ్రీగానే తెచ్చి స్తాడు'' అన్నాడు నాయుడు.

''అబ్బెబ్బె... ఫ్రీగా ఎందుకులెండి. మీ బావగారికి ఆ ప్రొప్రయిటరు బెస్టు ఫ్రెండు అంటున్నారు కాబట్టి దాన్ని ఇరవైరూపాయల కిస్తాడేమో అడగమనండి'' అంటూ జేబులో నించి ఇరవైరూపాయలు అందించేడు. నాయుడు చేస్తున్న సంజ్ఞని అర్థం చేసు కుంటూ చిలకలదాను ఆ నోటు పట్టుకుని షాపులోకి వెళ్లేడు. వరదరాజులు కొంపదీసి ఆ షాపులో కెళ్తానంటాడేమోనని భయపడి, అత న్ని అక్కడే నిలబెట్టడానికి సుబ్బయ్యనాయు డు తన మాటకచేరి ఆరంభించేడు. చిలకల దాను షాపులోకెళ్లి జేబులోనుంచి ఓ ఇరవైతీసి, దాన్ని వరదరాజుకిచ్చిన ఇరవైతో కలిపి, నల భైరూపాయలు చెల్లించి, బిల్లు మాత్రం ఇరవై కే తీస్కుని, పెన్‌సెట్‌తోసహా బయటికొచ్చేడు.

వరదరాజులుకి పెన్‌సెట్, బిల్లు అందిస్తూ చిలకలదాను అడ్డంగా కోసేసేడు- ''మా వెంక టస్వామిగారు, నా దగ్గర డబ్బిచ్చి సామాన్లు కొంటావట్రా అంటూ ఒకటే గొడవ. కావాలంటే ఓ డజను పెన్‌సెట్లు ఇంటికి పట్టుకెళ్లుగాని నాకు మాత్రం డబ్బు ఇవ్వొద్దని మొండిపట్టు పట్టేడు. అయినా సరే, మీ ప్రిన్సిపల్సు గు రించి చెప్పి ఒప్పించేను''

వరదరాజులు చాలా సంతోషించేడు ''ఫ్రెండ్షిప్పంటే అలా వుండాలి. మీరు నాకు బాగా నచ్చేరండి. మనం అప్పుడప్పుడు ఇదే షాపులో కలుద్దాం'' అంటూ షేక్‌హేండిచ్చి వెళ్లిపోయేడు. ''చూసేవా బావా... చిన్న డ్రామా ఆడి, ఓ ఇరవైరూపాయలు ఖర్చు చేసేసరికి అంత పెద్దమనిషి ఎలా ధన్‌మంటూ మన గ్రిప్‌లో పడిపోయేడో.కొండను తవ్వి ఎలుకను పట్టడం కాదు బావా... సూది పట్టుకుని సింహా న్ని చంపెయ్యాలి, అదీ నా పాలసీ'' అంటూ గర్వంగా మీసం దువ్వేడు సుబ్బయ్యనాయు డు.

''నిజమే బావా... నీ అయిడియా బాగానే వుందిగాని, వన్లీపనిగా నా మంచితనం గు రించి వాళ్ల అల్లుడితో ఒక్కమాట చెప్పమని చిన్నమాటపడెయ్యాల్సింది''

''నీతో వచ్చిన గొడవ ఇదే బావా... పిల్ల పుట్టగానే స్కూలుకి పంపించెయ్యాలంటే ఎలా? ఇప్పుడాయన మనసులో పడిన అభి ప్రాయం బేంకులో వేసిన డబ్బు లాంటిది. కాలం గడిచేకొద్దీ వడ్డీతోసహా పెరుగుతుంది. నీ ప్రమోషన్ టైముకది ఉపయోగపడుతుంది'' అంటూ నాయుడు ధైర్యం చెప్పేడు.

* * *

ఇరవైరూపాయల్తో కొనుక్కున్న ఆనందాన్ని చిలకలదాను పూర్తిగా అనుభవించకముందే అతనికో ఇబ్బంది వచ్చిపడింది. ఆరోజు జీతా లు అందేరోజు. డిడక్షన్స్ (మినహాయింపులు) అన్నీ పోనూ రెండువేలు చేతికి అందింది. దాంతో ఆ నెలంతా ఎలా గడుపుకు రావడమా అని ఆలోచిస్తూ, కాగితం తీసుకుని బడ్జెట్ వేశాడు. ఖర్చు నాలుగువేలవరకూ తేలింది. అంటే మరో రెండువేలు వుంటే తప్ప ఈ నెల గడిచేటట్టు లేదు. ఇలా లెక్కలు వేస్తున్న సమయంలోనే ప్యూన్ ఎమ్మనే వచ్చి ''సార్... మన జి.యమ్.గారి మావగారు మిమ్మల్ని పిలుస్తున్నారు సార్'' అన్నాడు.

''ఎక్కడున్నారు?''

''జి.యమ్.గారి రూములోనేనండి''

''జి.యమ్.గారున్నారా?''

''లేరండి. బయటికెళ్లేరు''

రంగారావు తన సీటు దగ్గర కూర్చుని, ఈ సంభాషణవైపు చెవి పారేసేసరికి, దానుకి అత న్ని ఉడికించాలనిపించింది. అతనికి వినబడే

టట్టుగా అన్నాడు.

"మేమూ మేమూ ఒకటే కేష్టు, ఒకటే కేష్టూ అని చంకలు గుద్దుకుంటే కాదురా ఎమ్దన్. పెద్దవాళ్ల ఫేమిలీ మెంబర్సుతో కూడా ఫ్రెండ్షిప్పులు డెవలప్ చేస్కోవాలి, అదీ గొప్ప తనం. ఇప్పుడు జి.యమ్.గారి మావగారు నాకు కబురు చేశారంటే, అదీ మన గొప్ప తనం" అంటూ కాలర్ సవరించుకుంటూ గర్వంగా రంగారావువైపు చూసేడు.

రంగారావు కుతకుతలాడిపోయినట్టుగా చూసేడు. అదే తనకి కావల్సిన రియాక్షన్ అన్నట్టుగా చిలకలదాసు సంతోషపడుతూ జి.యమ్.గారి రూమ్‌లో కెళ్లేడు. అక్కడ వరద రాజులుతోపాటు అదే వయసుగల మరోకా యన వున్నాడు. "రండి రండి" అంటూ దాసుని ఆహ్వానించి తన స్నేహితుణ్ణి పరి చయం చేసేడు "మా ఫ్రెండు రామ్మూర్తి, ఈ ఊళ్లోనే ఓ పెద్ద బట్టలషాపు నడిపిస్తున్నాడు" అన్నాడు. దాసు వినయంగా నమస్కరించేడు. ఈ వూళ్లోనే బట్టలషాపుకే ప్రొప్రయిటర్ అంటు న్నాడు కాబట్టి, ఇప్పుడు కలిగే ఈ పరిచయం, రేపు ఎప్పుడైనా ఆ దుకాణంలో చవగ్గా బట్టలు కొనుక్కోడానికి ఉపయోగిస్తుందని మనసులోనే సంతోషించేడు.

"అన్నట్టు మీ ఫ్రెండు ఎలా వున్నారండి?" అని నవ్వుతూ అడిగేడు వరదరాజులు.

"ఏ ఫ్రెండండి?"

"అదేనండి... మీ ఫేన్సీ స్టోర్స్ ప్రొప్రయిటర్ మిస్టర్ వెంకటస్వామి, వురఫ్ బెంకటస్వామి" అంటూ ఏదో జోక్ పేల్చినట్టుగా పగలబడి నవ్వేడు వరదరాజులు. చిలకలదాసు ఆ మాట వినగానే చాలా హుషారుగా జవాబు చెప్పేడు "మా బెంకటస్వామిగాడికేమండి బ్రహ్మాండంగా వున్నాడు. నిన్న రాత్రి వాడింట్లోనే డిన్నరు. నేను ఫేమిలీతోసహా వెళ్లి డిన్నర్ తీస్కుంటేనే తప్ప వదల్లేదు. దొంగవె ధవ"

వరదరాజులు తన ఫ్రెండువైపు తిరిగి "నేను చెప్పలేదూ" అని మళ్లీ చిలకలదానుతో అన్నాడు.

"మా రామ్మూర్తి ఈ ఊళ్లో బట్టలషాపు పెట్టి రేపటికి పాతిక సంవత్సరాలు పూర్తవు తోందండి. ఈ జిల్లా మొత్తమ్మీద మా వాడికి నాలుగు బ్రెంచీలున్నాయి. అన్ని బ్రాంచీల్లోనూ కలిపి మొత్తం వందమంది ఉద్యోగస్తులు పనిచేస్తున్నారు. వాళ్లందరికీ ఈ సందర్భంగా చిన్న చిన్న గిఫ్ట్స్ ఇస్తే చాలా బాగుంటుందీ అని నేను సజెష్ట్ చేసేను. అమ్మో, బోలెడంత ఖర్చయిపోతుంది. వద్దు నాయినోయ్ అని కంగారుపడిపోయేడు. అప్పుడు నేను కొన్న పెన్‌సెట్‌ని చూపించి, ఇలాంటివి ఇవ్వవ య్యా... చీప్ అండ్ బెష్టు. పైగా పెన్స్ అనేవి అందరికీ ఉపయోగపడేవి కూడాను అన్నాను. ఏం ఇది మాత్రం ఏంచవక? ఒక్కో పెట్టే నలభైరూపాయలంటే, అమ్మో గూబ వగిలిపో తుంది అన్నాడు. అప్పుడు నేనేం చెప్పానంటే మరేం ఫర్వాలేదయ్యా ఈ పెన్‌సెట్ అసలు ఖరీదు నలభైరూపాయలయినా మా ఎలకల పూడి చిలకలదానుగారు దాన్ని ఇరవైరూపా యలకే ఇప్పిస్తారు. ఆయనకి ఓ ఫేన్సీషాపు ప్రొప్రయిటరు ప్రాణమిత్రుడూ అని చెప్పి, ఒప్పించి తీసుకొచ్చేను. అంచేత ఇప్పుడు మీరో వంద పెన్‌సెట్స్, ఒక్కొక్కటి ఇరవైరూపా యల చొప్పున మీ స్నేహితుడి దగ్గర తీస్కో వాలి"

అంతే... చిలకలదాను బుర్ర గిర్రున తిరిగి కుర్చీమీదనుంచి కిందకి పడబోయి తమా యించుకున్నాడు. మొన్న ఆడిన అబద్ధాన్ని ఇప్పుడు నిలబెట్టుకోవాలంటే వంద ఇరవైలు తన చేతినించి వదిలించుకోవాలి.

వంద ఇరవైలంటే రెండువేలు.

ఈ నెల తనకి అందిన జీతమే రెండువేలు.

అయిపోయింది. ఈ నెల కష్టార్జితమంతా తను చెప్పిన అబద్ధానికి జరిమానా కింద ఖర్చయిపోతోంది. ఇప్పుడేం చెయ్యడం? క్షణంలో ఓ అయిడియా తట్టింది.

"మీరు అడగడమూనూ, నేను కాదనడ మూనా? భలేవారే! వంద సెట్లు కాకపోతే వెయ్యి సెట్సు ఇప్పిస్తాను. కానీ మావాడి దగ్గర ఆ పెన్‌సెట్స్ అయిపోయాయట. మరో నెలరో జులదాకా రావట. నిన్న రాత్రి ఆ సంగతి చెప్పి కళ్లంట నీళ్లెట్టుకున్నాడు" అనేసి వాళ్ల రియా క్షన్ కోసం ఎదురుచూసేడు. కానీ వరదరాజు లు మళ్లీ పగలబడి నవ్వేడు "నిన్న రాత్రికి మీరు చెప్పిన పొజిషన్ వుండివుంటుంది. కానీ





ఇవాళ నేనూ, మా రామ్మూర్తి ఆ షాపులోకి వెళ్లేవచ్చేం. మేం ఉండగానే అయిదు వందల సెట్సు వచ్చేయి''

అతను చెప్పిన మాటకి చిలకలదాసుకి మరింత నీరసం వచ్చింది. ఈ దొంగవెధవ అన్ని ఆరాలూ తీసేవచ్చేడు. ఇంక తను ఏ అబద్ధం ఆడి తప్పించుకుంటాడు? వరదరాజులు రామ్మూర్తి చేత రెండువేలు ఇప్పించి రామ్మూర్తి ఇంటి ఎడ్రస్ చెప్పి, సాయింకాలం ఆ పెన్‌సెట్స్‌ని అక్కడికే పట్టుకొచ్చెయ్యమన్నాడు. అప్పుడు చిలకలదాసు తన ఆలోచనా ధోరణిని మార్చేడు ''పోతేపోయాయిరెండువేలు, తను వరదరాజుల కింత గొప్పసాయం చేసిన విషయాన్ని తప్పకుండా తన అల్లుడికి చెప్తాడు. అందువల్ల జి.యమ్.గారికి తప్పకుండా తనమీద అభిమానం కలుగుతుంది. ఆ అభిమానంతో తప్పకుండా ప్రమోషన్ ఇస్తాడు. ఏం మునుపటి జెన్రల్ మేనేజరుకి డాల్ఫిన్ హొటల్లో రెండువేల అయిదువందలు తగలబెట్టి పార్టీ ఇవ్వడంవల్ల తనకేం ఒరిగింది? ఆయన పెళ్లాంచేత చీవాట్లు తినడం తప్ప మరేం ప్రయోజనం దక్కలేదు. కానీ ఇప్పుడు ఖర్చయ్యే రెండువేలువల్ల తన ప్రమోషన్‌కి బంగారుబాట ఏర్పడుతుంది'' అని అనుకుంటూ నీరసం స్థానంలోఉత్సాహాన్ని నింపుతున్నాడు.

సాయంత్రం వంద పెన్‌బాక్సుని పేక్ చేయించుకుని రామ్మూర్తిగారింటి కెళ్లాడు. రామ్మూర్తి, వరదరాజులు చదరంగం ఆడుతున్నారు. చిలకలదాసు అందించిన పేకెట్ తీసుకుని రామ్మూర్తి లోపలికి వెళ్లగానే వరదరాజుల్తో మెల్లగా ''నేను మీకీ సాయంచేసిన విషయం మీరు మీ అల్లుడుగారికి చెప్తారనుకుంటాను'' ఈ మాటలో తప్పకుండా చెప్పండి అనే అభ్యర్థనని మిళితంచేస్తూ అన్నాడు. కానీ వరదరాజులు నాలిక బయటపెట్టి ముక్కుమీద చూపుడువేలు నిలువుగావేసి రెండు మూడు క్షణాలపాటు వుండిపోయి ఆ తర్వాత అన్నాడు.

''ఎంతమాట చిలకలదాసుగారూ! ఈ విషయం మా అల్లుడికి తెలిస్తే మా ఆఫీసు స్టాఫ్‌ని నీ సొంతపనులకి వాడుకుంటావా అని నామీద అగ్గయిపోడూ? హమ్మో, మీ మీద మాట రానిస్తానా! మీరేం దిగులు పడకండి. ఈ విషయం మీకూ, నాకూ,రామ్మూర్తికీ తప్ప మరో నాలుగో మనిషికి తెలియనివ్వను''

చిలకలదాసుకి అతను చెప్పిన ఒక్కొక్క మాటా ఒక్కో లెంపకాయ కొట్టినట్టయింది. నెలజీతం రెండువేలూ ఖర్చయిపోయినప్పుడు కలగని బాధ ఇప్పుడు కలిగింది. ఇంట్లోంచి రామ్మూర్తి వచ్చేడు. ''కాఫీ తాగుతారా? టీ తాగుతారా? ఏం తాగడానికయినా ఇప్పుడు అరుగంటలయిపోయింది. ఇప్పుడు కాఫీ టీలు తాగితే తర్వాత అన్నమూ సరిగా తినలేరు. రాత్రి నిద్ర సరిగారాదు. అయినా మీరు తాగుతానంటే తెప్పిస్తాను'' అన్నాడు. నీ మర్యాద నీ మొ...లా వుందని గొణుక్కుంటూనే అక్కడనించి ఇంటికి బయలుదేరేడు.

ఇంటికొచ్చాక మరో యుద్ధం ఆరంభమయింది. రెండువేలూ ఫలానా ఫలానా విధంగా ఖర్చయిపోయిందని చెప్పగానే వరలక్ష్మి అతనిమీద ఒంటికాలిమీద లేచింది. ''అల్లప్పుడు ఆ జెన్రల్ మేనేజరు మందుపార్టీ ఇవ్వడానికి రెండువేల అయిదువందలు ఖర్చుచేసేరు. అందుకోసం పెళ్లినాటి ఉంగరం తనఖాపెట్టి ఇప్పటిదాకా విడిపించనేలేదు. ఇప్పుడు నెల జీతం మొత్తం తగలబెట్టుకొచ్చేరు. అదీ ఎవరి కోసం? మీ జి.యమ్.కోసమూ కాదు. ఆయన గారి మామకోసమూ కాదు. ఆ మావగారి స్నేహితుడి కోసం. ఆయనేమైనా మనకి బంధువా? స్నేహితుడా? ఈ నెలంతా జీతం లేకుండా ఎలా ఇంటిని నెట్టుకొస్తారో నెట్టుకురండి. నాకేం సంబంధంలేదు'' ఇది ఇంటావిడ చేసిన సాధింపు అయితే, కాబోయే సినిమా హీరో విలన్‌మీద హీరో రెచ్చిపోయినట్టు రెచ్చిపోయేడు.

''నాకు మేకప్ టెస్ట్, స్క్రీన్ టెస్టులకి వంద రూపాయలు అడిగితే, ఎప్పుడూ లేవూ లేవంటూ ఒకటే పాట పాడతావు. సపోర్టింగ్ హీరో ఛాన్సు వచ్చింది, పదివేలు ఇమ్మంటే లేవన్నావు. అప్పుడు ఖర్చు చేసిన రెండువేల అయిదువందలు, ఇప్పుడు గంగలో పోసిన రెండువేలూ కలిపితే నాలుగువేల అయిదు వందలు. అది నా కిచ్చుంటే మిగతా అయిదు వేల అయిదువందలు నేనెక్కడో సంపాదించు

కునేవాణ్ణిగా''

అతనికి తల్లీ, చెల్లీ సపోర్టు ఇచ్చేసరికి మరీ రెచ్చిపోయేడు. ఆ మాటలు భరించలేక చిలకలదాసు గబగబా బట్టలు మార్చుకుని సుబ్బయ్యనాయుడి ఇంటికి బయలుదేరాడు. అప్పుడు నాయుడు ఖాళీగానే వున్నాడు. జరిగిందంతా విన్నాక అతను కూడా చిలకలదాసు మీద జాలి చూపించలేదు. "నీ బుర్రలో అసలు బుద్ధి అనే పదార్థం వుందా?'' అని అడిగేడు. "ఇది మరీ బాగుందిరా. ఆరోజు నువ్వా వరదరాజుల్తో, ఆ ఫేన్సీషాప్ ప్రొప్రయిటరు నా బెస్ట్‌ఫ్రెండని చెప్పి వుండకపోతే ఈ గొడవ ఇంతదాకా వచ్చుండేది కాదు. అంచేత ఈ తప్పంతా నీది'' అంటూ తప్పుని నాయుడి మీదికి తోసేశాడు. కానీ దాసు ఆ తప్పుని తనమీద పడనివ్వలేదు. "ఆ వరదరాజుల్ని మంచి చేసుకోవడానికి ఓ అబద్ధం చెప్పేను. ఇరవైరూపాయల ఖర్చు చేయించేను. కానీ తర్వాత నువ్వేం చేశావు? ఓ అబద్ధం చెప్పి తప్పించుకోవచ్చుగా''

"ఏం అబద్ధం చెప్పమంటావు?''

"వాడా వంద పెన్‌బాక్సులూ కావాలనగానే, నువ్వేం చెప్పాలి? నిన్న రాత్రి మా ఫ్రెండుకీ నాకూ పీకా పీకా తెగ్గోసుకున్నంత గొడవ జరిగిపోయింది సార్. నాకు ఈ ఊళ్లో మరో ఫేన్సీ షాపు ప్రొప్రయిటర్ ఎవర్తోనూ స్నేహంలేదు అని ఓ కోతకోసేసి వుంటే నీకు రెండువేలు ఖర్చు అయివుండేది కాదు. నీమీద ఆ వరదరాజులుకుండే మంచి అభిప్రాయమూ చెరిగుండేదికాదు''

దాసు చెప్పిన ఈ ఐయిడియా నిన్న తనకి తట్టనందుకు తన నెత్తిమీద తనే నాలుగు దెబ్బలు కొట్టుకున్నాడు. అబద్ధాలాడ్డం, ఆ అబద్ధాల్తో నెట్టుకురావడం కూడా ఓ కళే. ఆ విద్య సుబ్బయ్యనాయుడి కొచ్చినంత బాగా తనకి రాదని కూడా ఒప్పేసుకున్నాడు. తర్వాత నాయుడు మరో సలహా ఇచ్చేడు. ఈ వరదరాజులుకి నువ్వెంత సాయం చేసినా, దాన్ని మీ జి.యమ్. నోటీస్‌లోకి వెళ్లనివ్వనంటున్నాడు కాబట్టి ఇకమీదట అతనికి ఏ సాయంచేసినా, అది కుంటిగుర్రానికి మేత పెట్టినట్టు వృధా అవుతుంది. కాబట్టి, ఇప్పుడు మనం మరోరూటు పట్టుకోవాలి'' అంటూ నాయుడు ఆలోచనలో పడ్డాడు.



రెండు రోజులు గడవకముందే ఓరోజు చిలకలదాసు ఆఫీసుకి బయలుదేరుతుండగా ఆ వీధిలోనే అతనికి బాగా తెలిసిన ఓ వ్యక్తి కనిపించేడు. అతని పేరు వెంకటరమణ. రిక్షాలోనించి నాలుగైదు పెద్దసైజు పూలదండలు తీసుకొచ్చి రిక్షావాడిచేత ఇంట్లో పెట్టిస్తుండగా చిలకలదాసు తన విక్కీమోపెడ్‌ని ఆపి పలకరించేడు "ఏవిటి వెంకటరమణగారూ... ఈ హడావిడి? మీ ఇంట్లో ఏదైనా శుభకార్యం వుందా, అన్ని దండలు తీసుకొచ్చేరు?'' అని అడిగేడు.

"అబ్బే... మా ఇంట్లో ఏ శుభకార్యమూ లేదండి. మా మేనేజరు భాస్కర్‌ప్రసాద్‌గార్కి ట్రాన్స్‌ఫర్ అయిపోయిందండి. ఇవాళ ఆయనకి ఫేర్‌వెల్ పార్టీలు ఇస్తున్నాం. మా బేంక్ కల్చరల్ అసోసియేషన్ సెక్రెటరీనినేనే కదా! ఆ ప్రోగ్రామునిర్వహించే బాధ్యతంతా నామీదే పడింది''

వెంకటరమణ చెప్పింది చిలకలదాసుకి ఆసక్తి కలిగించింది.

భాస్కరప్రసాద్ అంటే, కొంపదీసి మా జి.యమ్.గారి బావమరిది కాదుగదా అనుకుంటూ ఆ పేరు గురించి మరోసారి అడిగేడు. వెంకటరమణ పనిచేస్తున్నది బేంక్ ఆఫ్ బరోడాలో. దానికి భాస్కర్‌ప్రసాద్ మేనేజరు. సుబ్బయ్యనాయుడు కూడా ఒకప్పుడు ప్రసాద్ గురించి చెప్తూ ఇదే బేంకులో పనిచేస్తున్నట్టు చెప్పేడు. కానీ ఏ బ్రెంచీయో తనకి తెలియదన్నాడు. ఇప్పుడా విషయమూ తెల్సిపోయింది.

ఇప్పుడాయన ట్రాన్స్‌ఫర్ అయి వెళ్తున్నాడు. కాబట్టి ఈ సందర్భాన్ని ఏదోధంగా ఉపయోగించుకోవాలి అనుకున్నాడు 'బయటివాళ్లు మీ ఫంక్షనుకి రావచ్చా?'' అనడిగేడు.

''బాబ్బాబు. మీరు రావడమే కాదు. ఎంత మందిని వీలుంటే అంత మందిని తీసుకు రండి. ఎంచేతంటే ఇవాళ శనివారం. టీ.వీ.లో హిందీ సినిమా వస్తుందిగదా. అంచేత వాళ్లు కొంతమంది మిస్‌కొట్టొచ్చు. పైగా మేం సాంబమూర్తి కళామందిరం బుక్ చేశాం. అది ఎంత పెద్దదో తెల్సుగదా. దయచేసి తప్పకుండా రండి'' అంటూ వెంకటరమణ మరీ మరీ రిక్వెష్టు చేసేడు. రిక్కీమీద వెళ్తూ ఈ సందర్భాన్ని ఎలా వినియోగించుకుంటే బాగుంటుందా? అని ఆలోచించబోయి అంతలోనే ఠక్కుమని తన ఆలోచనల్ని ఆపేసేడు. తను సొంతంగా ఆలోచించినప్పుడల్లా మాడు పగిలిపోయేలా దెబ్బతింటున్నాడు. అంచేత ఈసారి సుబ్బయ్యనాయుడితో ఆలోచించక తప్పదనుకుని నాయుడి ఇంటికి వెళ్లేడు.

ఆరోజు సుబ్బయ్యనాయుడు ఓ ఇద్దరు పెళ్లాల ముద్దుల మొగుడి కేసులో సలహా ఇస్తున్నాడు. చిలకలదాసుని చూసి, పలకరించి, కాస్సేపు వుండమని చెప్పి ఆ తగువులో నిమగ్నమైపోయేడు. శ్రీరాములు అనబడేవ్యక్తి, అతని ఇద్దరు భార్యలు, మరో పదిమంది జనం అక్కడ నిలబడ్డారు. ఇద్దరు భార్యలూ అవకాశం దొరికితే ఒకర్నొకరు కత్తుల్తో నరికేసుకునే పోజుపెట్టి నిలబడ్డారు. అసలా కేసు ఏవిటంటే శ్రీరాములు అనబడే ఆ బక్కశాల్తీ తన ఇద్దరు పెళ్లాల్ని ఒకే వీధిలో పెట్టేడు. అతను ఆఫీసుకి వెళ్లిపోగానే ఇద్దరూ పెళ్లాలు యుద్ధానికిదిగి రోడ్డెక్కి మరీ పోట్లాడుకోవడం ఆరంభించేరు. సవతుల పోరు ప్రతిరోజూ ఆ వీధివాళ్లకి మొదట్లో వింతగానూ, ఆసక్తిగానూ కనిపించింది. కానీ శ్రీరాములు నెలకి ఒకవారం నైట్‌డ్యూటీ వెళ్తుంటాడు. అప్పుడు ఇద్దరు పెళ్లాలూ రాత్రిపూట వీధికెక్కి తిట్టుకోవడం, కొట్టుకోవడం చేస్తుంటే, వీధిలో చాలామంది చిరాకుపడ్డారు. కోప్పడ్డారు. ఓ పెద్దమనిషి అయితే ఓ రోజు పోలీస్‌స్టేషన్‌కి ఫోన్‌చేసి ఇక్కడ భయంకరమైన ఫైటింగ్‌లు జరిగిపోతున్నాయి, వెంటనే వచ్చి మా వీధిలో శాంతిభద్రతలు కాపాడండంటూ కంప్లయింట్ ఇచ్చేడు. వెంటనే పోలీస్‌వేన్ వచ్చింది. పదిమంది కానిస్టేబుల్సు, ఓ యస్సై దిగేడు. భయంకరమైన ఫైటింగులు జరుగుతున్నాయంటే అదేదో గూండాలు చేస్తున్నవని అనుకుని వాళ్లు తుపాకులు తీసుకుని మరీ వచ్చేరు. తీరా అక్కడికొచ్చాక, అది ఇద్దరు ఆడవాళ్ల తగువని తెలిసింది. ఆ ఆడవాళ్లు కూడా పరాయి మనుషులు కాకుండా ఒక్క భర్తగారి ఇద్దరు భార్యలని తెలిసి యస్సై చిరాకుపడ్డాడు.

''ఇంతకీ మీ గొడవేంటమ్మా?'' అని యస్సై అడిగేడు.

''ఇది నా కుక్కని దాచేసి, నాలుగురోజులు ఇంట్లో కట్టేసి, తిండీ, నీళ్లూ ఇవ్వకుండా కడుపుమాడ్చి, నానాబాధలూ పెట్టిందండి'' అని మొదటి భార్య మొరపెట్టుకుంది.

''ఇది నా కోడిపెట్టని పట్టేసి, కోసి కూరండుకు తినేసిందండి'' రెండో భార్య ఏడుస్తే చెప్పింది.

'నువ్వు మొదట నా కుక్కను కట్టేస్తేనే నేను నీ కోడిని లాక్కున్నానే'' అంటూ మొదటి భా౦ తను చేసిందానికి జస్టిఫికేషన్ ఇచ్చుకుం. ఇలా ఆ పెళ్లాలిద్దరూ ఒకరిమీద ఒకరిన్న కక్షల్ని డైరెక్టుగా తీర్చుకోకుండా, వాళ్ల ెంపుడుజంతువుల మీద తీర్చుకుంటున్నారు. పోలీసులు వచ్చినా, వాళ్ల చేతుల్లో లాఠీలు, తుపాకులూ వున్నా భయపడకుండా ఆ ఇద్దఽ మహిళలు ఇంకా పోట్లాడుకుంటూనే వున్నారు. ''మేం రౌడీలమీద, గూండాలమీద అయితే ఏక్షన్ తీసుకుంటాం. వాళ్లు కూడా మేం కొట్టే దెబ్బలకో, వేయించే శిక్షలకో ఎంతో కొంత భయపడతారు. కానీ ఇది ఇద్దరు పెళ్లాల కేసు. ఇలాంటి వాటిని వాళ్ల భర్తలే అదుపులో పెట్టాలిగాని పోలీసులు కాదు'' అంటూ పోలీసులు వెళ్లిపోయారు.

శ్రీరాములు ఆ భార్యల గొడవ తీర్చలేక, ఆ వీధి తాలూకు శాంతియుత జీవనాన్ని దృష్టిలో పెట్టుకుని తన కేసుని ఉబ్బెనిబిల్లి సుబ్బయ్యనాయుడి దగ్గరికి తీసుకొచ్చాడు. అంతా విన్నాక సుబ్బయ్యనాయుడు తనకి తోచిన సలహా చెప్పేడు ''అసలు ఇద్దరు పెళ్లా

లుండడం'వ్పు. కానీ ఈ మాట నేను చెప్తే చాలామం ఇద్దరు పెళ్లాల భర్తలు బాధపడ తారు క్కాబ్టే నేను అది తప్పని చెప్పను. కానీ ఇద్దరి శ్లాల్ని ఒకేవీధిలో పెట్టడం తప్పు"

"నా! టైము కలిసొస్తాదని అలా పెట్టా నండి'అన్నాడు శ్రీరాములు.

"నౌ ముయ్యావయ్యా... ఇద్దర్నీ ఒకే వీధిల్ పెట్టడంవల్ల నీకేం టైము కలిసొ చ్చిం? ఇద్దరి గొడవల్ని తీర్చేసరికే నీ టైము, నీ శ అయిపోతోంది. అంచేత ఒక పెళ్లానికీ,

మరో పెళ్లానికీ మధ్య కనీసం మూడు కిలోమీటర్ల దూరం వుండాలి. వారంలోని ఏడురోజుల్లో ఇటు మూడురోజులూ, అటు మూడు రోజులూ సర్దేసి, ఏడోరోజు అంటే ఆదివారంనాడు రెస్టు తీసుకో' అంటూ శ్రీరాములుకి చెప్పి, ఇద్దరి భార్యల్ని విడివిడిగా పిల్చి- ''మీరిద్దరూ గొడవపడి వీధికెక్కడంవల్ల మీ పరువే పోతుంది. పైగా మరో విషయం. మొదటిభార్యవల్ల ఏదో అసంతృప్తి వుండబట్టేకదా, రెండో భార్యని వుంచుకోవాల్సి వచ్చింది. ఇప్పుడు మీరిద్దరూ గొడవపడితే రేపు మీ ఆయన మూడోదాన్ని తీసుకొచ్చే ఛాన్సుంది'' అంటూ ఓ పావుగంటసేపు హితోపదేశం చేసి పంపించేసేడు.

ఆ తర్వాత ఛిలకలదానుతో- ''సారీ బావా...



లేట్ అయిపోయింది. ప్రజాసేవకి అంకితం అయిపోయిన మనిషినికదా. ఈ మాత్రం తిప్పలు తప్పవు'' అన్నాడు. దాను ఆ మాటల్ని పట్టించుకోకుండా, తనకి తెలిసిన భాస్కరప్రసాద్ ట్రాన్స్‌ఫర్ విషయం చెప్పి ఈ సందర్భాన్ని మనకి పనికొచ్చేవిధంగా ఉపయోగించుకోగలమా? అని ప్రశ్నించేడు. నాయుడు అటూ ఇటూ తిరుగుతూ ఆలోచించి అన్నాడు ''ఉపయోగించుకోవచ్చు. ఎలాగంటే భాస్కరప్రసాద్ అంటే సాక్షాత్తు మీ జి.యమ్.గారి చెల్లెలు భర్త. అంచేత మొగుడితోపాటు ఆవిడ ఇవాళ్టి ఫంక్షనుకొస్తుంది. చెల్లెలిమీద అభిమానంతో మీ జి.యమ్మూ ఆ ఫంక్షనుకొస్తాడు. అప్పుడు మనం వేదికమీద ఆ భాస్కరప్రసాద్‌కి ఓ శాలువా కప్పి, దండవేసి, కలర్‌ఫొటోలు తీయించి, వీలుంటే వీడియో తీయించి ఆ భాస్కర్‌ప్రసాద్‌కి ప్రెజెంట్ చేసేమనుకో, ఆ దంపతులూ హేపీగా ఫీలవుతారు. మీ జియ్యమ్ గూడా, మా చిలకలదాసు నాకే కాదు, నా బంధువులందరికీ సన్మానాలు చేసే సంస్కారీ అని నిన్ను గుర్తిస్తాడు''

ఈ అయిడియా చిలకలదానుకి బాగా నచ్చింది. వెంటనే ఇద్దరూ ఆ ఏర్పాట్లలో పడ్డారు. సాయంకాలం సాంబమూర్తి కళా మందిరంకి వీడియోగ్రాఫర్ని ఫొటోగ్రాఫర్ని తీసుకువెళ్లారు. చిలకలదాసు, భాస్కరప్రసాద్‌కి తనకుతానుగా పరిచయం చేస్కోబోయేడు గాని, నాయుడు ఆపుచేసేడు. మీ జి.యమ్.గారొచ్చేక పరిచయం చేసుకుంటే బావుంటుంది'' అన్నాడు. అదీ నిజమే అనుకున్నాడు దాను. ఫంక్షన్ స్టార్ట్ అయిపోయినా జి.యమ్.గారు రాలేదు. బహుశా ఏదో అర్జంటుపని తగిలివుంటుంది అని వాళ్లకి నచ్చజెప్పుకుని జరుగుతున్న కార్యక్రమాన్నంతా వీడియో కెమేరాతో పిక్చరైజ్ చేశారు. కలర్‌ఫొటోలు తీయించేరు. ఆర్గనైజర్సు కేవలం ఫొటోలు తీయించడానికే ఏర్పాటుచేసేరుగాని, వీడియో ఏర్పాటు చెయ్యలేదు. భాస్కర్‌ప్రసాద్‌కి చిలకలదాసు శాలువా కప్పుతూ ''నేను ఫలానా ఫలానా'' అని పరిచయం చేసుకున్నాడు. ఆయన ''అఁహ అలాగా'' అని మాత్రం వూరుకున్నాడు. ''కలర్‌ఫొటోలు, వీడియో కూడా నేనే తీయిస్తున్నాను'' అన్నప్పుడు ఆయన అస్సలు మాట్లాడలేదు.

మర్నాడు వీడియోకేస్సెట్, కలర్‌ఫొటోలు పట్టుకుని సరాసరి జి.యమ్.గారింటికి వెళ్లేడు. ''ఇంటికొచ్చేరు దేనికి?'' అంటూ జి.యమ్. అతన్ని చూస్తూనే చిరాగ్గా ప్రశ్నించేడు. ఆ సమయంలో వరదరాజులు కూడా అక్కడే వుండడంతో చిలకలదానుకి ధైర్యం వచ్చింది.

''నిన్న తమరా ఫంక్షన్‌కి దయచేస్తారనుకున్నాను'' అన్నాడు దాను వినయంగా.

''ఏ ఫంక్షనుకి?''

''అదేసార్... మీ బావమరిదిగారు శ్రీయుత భాస్కర్‌ప్రసాద్‌గారి ట్రాన్స్‌ఫర్ సందర్భంగా ఏర్పాటైన...''

''వాడు నా బావమరిదని మీకెవరు చెప్పారు?'' అంటూ కూర్చున్నచోటనుంచి లేచి వెళ్లిపోయేడు. అప్పుడు అతని ముఖం నిప్పుల్లో కాలుతున్న ఇనపకమ్మిలా ఎర్రగా మెరుస్తోంది. సంచిలోనుంచి వీడియోకేసెట్, ఫొటోలుతీసే హడావుడిలోపడి చిలకలదాసు జి.యమ్.గారి రియాక్షన్ గమనించలేదు.

''ఒకరు చెప్పేదేమిటి సార్. మీ బంధువులెవరో తెల్సుకుని, సమయం వచ్చినప్పుడు వారిని యథాశక్తి సన్మానించడం నా కర్తవ్యం. నిన్న జరిగిన కార్యక్రమమంతా వీడియో తీయించేను. కలర్‌ఫొటోలు తీయించి, ముఖ్యమైనవాటిని కేబినెట్‌సైజుకి డెవలప్ చేయించేను. వీటిల్లో మీ సహోదరి కూడా వుంది'' అంటూ ఫొటోల్ని అందించాడు.

జి.యమ్. ఆ ఫొటోల్ని చూడనైనా చూడకుండా నేలకి కొట్టేడు. కేస్సెట్‌ని విసిరేసి వెళ్లిపోయేడు. వెళ్లేముందు చిలకలదానుని తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ చెడామడా తిట్టెయ్యాలనుకున్నాడు. కానీ దానుక్కూడా కోపం వచ్చి తన రెండో భార్య సంగతి ఎక్కడ నోరు జారేస్తాడో అని భయపడి తమాయించుకున్నాడు. అతను ఎందుకలా ప్రవర్తించేడో దానుకి అర్థం కాలేదు. అంత డబ్బు ఖర్చుచేసి, ఇంత శ్రమపడి, ఆ పనిచేసినందుకు తన ప్రయత్నాన్ని ఆయన ఎంతో మెచ్చుకుంటాడని ఆశపడ్డాడుగాని, తన కృషి ఆయనకెందుకు కోపం తెప్పించిందో ఎంత ఆలోచించినా బోధపడలేదు. వరదరాజులు మాత్రం ఆ ఫొటోల్ని ఒక్కొక్కటి శ్రద్ధగా చూసి మళ్లీ వాటిని కవర్లో పెట్టి




అందించి "మీరు చాలా సిన్సియర్‌గానే ఈ పనిచేశారు. కానీ, ఈ సిన్సియార్టీ ఓ మంచిపనికి చేసుంటే బావుండేది" అన్నాడు.

"అంటే... నేను చేసినపని చెడ్డదంటారా?"

"అనక తప్పడంలేదండి. ఎందుకంటే మా అల్లుడి చెల్లెలు అంటే ఆ భాస్కర్‌ప్రసాద్ భార్య మా వాడికి ఇష్టం లేకుండా అతన్ని ప్రేమించి, అతన్తో వెళ్లిపోయి పెళ్లిచేసుకుంది. మనం ఏదో ఎదిగిపోయేం ఎదిగిపోయేం అని ఎంతనుకుంటున్నా ఆ అమ్మాయి ఆ భాస్కర్‌తో లేచిపోయిందనే అందరూ కామెంట్ చేశారు. దాంతో మావాడు తన చెల్లెలి మీద పూర్తిగా మనసు విరుచుకున్నాడు. ఆవిడ గురించి ఎవరు ప్రస్తావించినా, వాళ్లమీద విరుచుకుపడతాడు. కానీ ఈ విషయంలో మీరింత శ్రమపడ్డారు. మా వాడికి కోపం తెప్పించేరు"

చిలకలదానుకి నోటంట మాట రాలేదు. దురదృష్టవంతులు పుణ్యకార్యం తలపెట్టినా, అది పాపకార్యం కిందే జమవుతుందన్న సామెత తనపట్ల నూటికి నూరొంతులూ నిజమై తీరుతోంది. తను చేసే ప్రతీపనీ ఇలా బెడిసికొట్టడమే కాకుండా అలా జరిగిన ప్రతిసారి బోలెడంత చేతిచమురు వదిలిపోతోంది. ఇప్పుడేం చెయ్యడం? ఈసారి జరిగిందానికి తన సొంత తెలివి కారణం కాదు. సుబ్బయ్యనాయుడే ఈ అయిడియా ఇచ్చేడు కాబట్టి వాడినే ఈ డబ్బు రిఫండ్ ఇమ్మనాలి అని నిశ్చయించుకుని బయలుదేరాడు.

"నేనెందుకు రిఫండ్ ఇవ్వాలి?" అంటూ ఎదురు ప్రశ్నించేడు నాయుడు.

"మాజి.యమ్.కో చెల్లెలు, ఆవిడకో మొగుడూ వున్నాడని చెప్పింది నువ్వు. వాళ్లని మెప్పించడం ద్వారా నాపని సులభమవుతుందని సలహా చెప్పింది నువ్వు" అన్నాడు చిలకలదాను సీరియస్‌గా.

"ఆ భాస్కర్‌ప్రసాద్ ట్రాన్స్‌ఫరైపోతున్నాడన్న వార్త మోసుకొచ్చింది నువ్వు. ఆ సందర్భాన్ని ఎలాగైనా మనం వినియోగించుకోవాలని సలహా అడిగింది నువ్వు"

"అయితే తప్పంతా నాదే అంటావా?"

"కాదా మరి, మీ జి.యమ్. చెల్లెలికి భాస్కర్ ప్రసాద్ మొగుడన్న సంగతి నేను చెప్పేను. కానీ, అది పద్ధతి ప్రకారం జరిగిన పెళ్లా, లేక లేవదీసుకొచ్చిన బాపతా అని నువ్వు ఎంక్వయిరీ చెయ్యకుండా ప్రొసీడ్అయిపోయేవు. దెబ్బతినేసేవ్"

ఇలా ఇద్దరూ ఒకరిమీద ఒకరు తప్పు తోస్కుంటూ ఓ అరగంటసేపు వాదులాడుకున్నాక, చిలకలదాను గోడకి తలని బాదుకుంటూ "ఔనురా... తప్పులన్నీ నావే నావే నావే... ఇప్పుడీ ఫొటోల్ని, కేసెట్‌ని ఏంచేస్కోవాలి?" అన్నాడు. నాయుడు రెండుక్షణాలు ఆలోచించేడు "బావా... పేకాటలో నీకు అక్కర్లేదని పడేసిన ముక్క నాకు పనికొచ్చి నా ఆట గెలిపించొచ్చు. అలాగే మీ జి.యమ్. ఛీ అంటూ విసిరేసిన ఈ రెండు వస్తువుల్ని ఆ భాస్కర్‌ప్రసాద్‌కి ప్రెజెంట్ చేస్తే? నిన్న ఫంక్షన్లో వాళ్లెవరూ వీడియో ఏర్పాటు చెయ్యలేదు. అంచేత నువ్వు తీయించిన కేసెట్‌ని ఆ భాస్కర్‌ప్రసాద్ ఆనందంగా అందుకుంటాడు. నీ మీదో ప్రత్యేకమైన అభిమానం చూపిస్తాడు"

"వాడి అభిమానం నాకెందుకు?"

"అలాగనకు. నీ కొడుకు సినిమా హీరోనైపోతానంటూ ఇప్పుడు కాస్త చిందులేసినా, తర్వాత వాడికి బుద్ధొచ్చాక, వాడికేదైనా ఉద్యోగం ఇప్పించాలిగదా. ఈ భాస్కర్‌ప్రసాద్ నీప్పుడు సంతోషపెట్టేస్తే రేపు నీ కొడుక్కి ఉద్యోగం ఇప్పించడానికి ఎంతో కొంత సాయపడొచ్చు. ఒకవేళ ఉపయోగపడలేదనుకో. చెత్తబుట్టలో పారెయ్యాల్సిన వస్తువుల్ని వాడికి ప్రెజెంట్ చేసేసేం అనుకుంటాం"

చిలకలదాను మరేమీ మాట్లాడకుండా, ఫొటోలు, కేస్సెట్ తీసుకుని భాస్కర్‌ప్రసాద్ ఇంటికి బయలుదేరాడు. అతను వెళ్లేసరికి అతని భార్య మాత్రం వుంది. ఫొటోల్ని పట్టి పట్టి జాగ్రత్తగా చూసింది. కేసెట్‌ని వి.సి.ఆర్.లో పెట్టి చూస్తుండగా బయట నుంచి భాస్కర్‌ప్రసాద్ వచ్చేడు. భార్య ద్వారా విషయం తెలుసుకుని, చిలకలదానుమీద కస్సుమంటూ లేచేడు "ఏం మీ జి.యమ్.గాడికి అంత పొగరెక్కిందా? నామీద కక్షతో నన్నిక్కడనించి ట్రాన్స్‌ఫర్ చేయించింది చాలక ఈ ఫొటోలు చూసినప్పుడల్లా వాడు చేసిన ఛండాలప్పుని గుర్తుకురావాలనా ఈ ఫొటోలు తీయించి నాకు పంపించాడు?"

అంటూ ప్రశ్నించేడు.

"సారీ సార్... ఇవన్నీ నా సొంత డబ్బుతో నేను తీయించేను"

ఆ మాటతో అతను మరీ రెచ్చిపోయేడు.

"మీరు కోసే కోతలన్నీ నమ్మెయ్యడానికి నేన్నేమైనా ముక్కులో కాడా, చెవిలో పువ్వూ పెట్టుకున్నాననుకుంటున్నారా? నేనెవరో మీకు తెలీదు. మీరెవరో నాకు తెలీదు. అలాంటప్పుడు ఇంత డబ్బు ఖర్చుపెట్టి ఇవన్నీ ఎందుకు చేయిస్తారు? పోనీ, మీరు మా బేంక్ ఎంప్లాయీ అయితే నా ఫేవర్‌కోసం ఇవన్నీ చేశారనుకోవచ్చు. కానీ మీకూ నాకూ ఉద్యోగరీత్యా కూడా ఎటువంటి సంబంధం లేదే. ఇది కేవలం నన్ను ఇరిటేట్ చెయ్యడానికే వాడు ఈ ఫొటోలు తీయించేడు" అంటూ ఆ ఫొటోల్ని పరపరమంటూ చింపేసేడు. కేస్సెట్‌లోనుంచి ఫిలింలాగేసి, నేలమీద వేసి కసకసమంటూ కాళ్లతో తొక్కేశాడు. "వాడు పంపించిన కానుకల్ని ఏంచేశానో మీ వాడికి చెప్పండి" అన్నాడు.

చిలకలదాసు నిస్సహాయంగా భాస్కర్‌ప్రసాద్ భార్యని చూసేడు. ఆమె కాస్త దిగులుగానే కనిపించింది. "ఆయనిలా చేస్తారని వూహించే ఆయన రాకముందు కేసెట్‌ని చూసేశాను" అంది.

అంతే ఆవిడ చెంప ఛెళ్లుమంది. "అస్సలీ కేసెట్‌కి, ఫొటోలకి అగ్గిపెట్టాల్సింది నువ్వు" అన్నాడు. అనూహ్యమైన ఈ పరిణామంవల్ల చిలకలదాసు రవంత వణుకుతూనే బయటికి వెళ్లిపోయేడు.

సుబ్బయ్యనాయుణ్ణి కలుసుకోవడానికి నాలుగైదుస్థలాలు తిరిగి తిరిగీ మరీ వెదికిపట్టుకున్నాడు.

"నువ్విచ్చిన అయిడియావల్ల అమాయకురాలైన ఆడదానికి చెంపదెబ్బ తినిపించినవాణ్ణయ్యాను. అసలా ఫొటోల్ని వాడికివ్వమని చెప్పకుండా వుండుంటే వాటిని కాలవలో పారేసేవాణ్ణి" అన్నాడు దాసు కాస్త బాధపడుతూనే.

"బుద్ధిలేకుండా మాట్లాడకు. ఆ ఫొటోలు, కేసెట్టూ ఇస్తే వాడైనా సంతోషిస్తాడనుకున్నానుగాని, వాణ్ణి ట్రాన్స్‌ఫర్ చేయించింది మీ జి.యమ్.గాడే నన్నసంగతి నాకేం తెలుసు?"

"నాకూ తెలీదు?"

"తెల్సుకోకపోవడం నీ తప్పు"

చిలకలదాసుకి చిర్రెత్తుకొచ్చి, కోపం పట్టలేక అక్కడనించి వెళ్లిపోయేడు.

★ ★ ★

చిలకలదాసుకి రోజులు బద్ధకంగా నడుస్తున్నట్టుగా అనిపించింది.

మనిషి ఆనందంగా, తుళ్లుతూ కేరింతలు కొడుతున్నప్పుడు కాలం గబగబా దొర్లుకుంటూ వెళ్లే బండిలా కనిపిస్తుంది. ఎటువంటి సంతోషకరమైన సంఘటనలూ జరుగనప్పుడు కాలం భూమికి అంటుకుపోయిన మట్టిముద్దలా కనిపిస్తుంది. ఆఫీసులో వున్నప్పుడు, ఇంట్లో వున్నప్పుడు చిలకలదాసు ఆత్మవిమర్శ చేసుకుంటూ ఆలోచించేడు.

"ఇంతవరకూ జీవితంలో సాధించిందేవిటి?"

"ఏమీలేదు"

"ఇక మీదట సాధించగలిగినదేవిటి?"

"ఏమీ లేదు"

"అంతేనా...?"

"అంతే"

ఈ సమాధానమే అతన్ని కూర్చున్నచోట కూర్చోనివ్వలేదు. నిల్చున్నచోట నిలవనీయలేదు. అలంకార్ లాడ్జిలో ఎవరో జ్యోతిష్కుడు భూత, భవిష్యత్‌ల గురించి అద్భుతంగా చెప్తున్నాడని విన్నాడు. ఫీజు యాభైరూపాయలే అని తెలిసాక మనసు వుండబట్టలేక అతని దగ్గర కెళ్లేడు.

అక్కడ చాలా పెద్ద క్యూ వుంది. గంటన్నర వెయిట్ చేసేక స్వామీజీవారి దర్శనం లభించింది. ముందుగానే ఫీజు తీసుకున్నాక ఓ చిన్న కాగితంమీద "మీకు ఇష్టమైన పువ్వు పేరు చెప్పండి" అని రాసేడు.

చిలకలదాసు గులాబీపువ్వు పేరు చెప్పేడు. అలాగే ఒకాయన ఓ పండుపేరు అడిగేడు. దాసు చెప్పేడు. ఇవన్నీ మామూలుగా చాలా మంది జ్యోతిష్కులు అడిగే ప్రశ్నలే. కానీ ఈ స్వామీజీ మరికొన్ని విచిత్రమైన ప్రశ్నలు అడిగేడు "నీ అభిమాన కథానాయకుడెవరు?" అని.

"మహాత్మగాంధీ"




"నేను అడుగుతున్నది నిజజీవితంలో అన్యాయాన్ని ఎదిరించి విజయం సాధించిన హీరోల గురించి కాదు. అలా సాధించినట్టు తెరమీద నటించే సినిమా హీరో పేరు చెప్పు"

"ఎందుకండి? ఇంతవరకు ఎవరూ అలాంటి ప్రశ్నలు అడగలేదు. అయినా నా భవిష్యత్తు ఎలా వుంటుందో తెల్సుకోవడానికీ, నాకిష్టమైన సినిమా హీరోకి సంబంధం ఏవిటో అర్థం కావడంలేదు స్వామీజీ"

స్వామీజీ రెండుక్షణాల పాటు కళ్లు మూసుకుని ఆలోచించి, చిన్నగా నవ్వి అన్నాడు "నీకు ఇష్టమైన పువ్వు పేరు, కాయ పేరు ఎందుకడిగానో తెలుసా? నీ అభిరుచి తెలుసుకోడానికి, అందువల్ల నీ మనస్తత్వాన్ని అంచనా వేయడానికి అడిగేను. మానవులమీద సినిమాల ప్రభావం, రాజకీయాల ప్రభావం లేనప్పుడు, ఒకమనిషి మనస్తత్వాన్ని అంచనా వేయడానికి పువ్వుల పేర్లు, కాయల పేర్లు, ఇష్టదైవం పేర్లు వగైరాలు మాత్రమే అడిగేవారు. కానీ ఇప్పుడు ప్రతి మనిషిమీదా సినిమాల ప్రభావం, రాజకీయాల ప్రభావం కూడా పడుతోంది. అంచేత, ఆ ప్రశ్నల్ని కూడా కలిపే అడుగుతున్నాను. చెప్పు... నీ కిష్టమైన హీరో ఎవరు?"

"ఫలానా ఫలానా"

"నీ కిష్టమైన రాజకీయ పార్టీ పేరు"

"ఫలానా ఫలానా"

"ప్రస్తుతం వున్న ప్రభుత్వం మీద నీ అభిప్రాయం?"

"ఫలానా ఫలానా"

స్వామీజీ ఓ పలకమీద ఏవో లెక్కలువేసి, ఓ పదినిమిషాల తర్వాత అన్నాడు.

"నీకు మహర్దశ ఆరంభమైంది. రేపట్నించీ నువ్వు ఏది పట్టినా బంగారమే"

"అయితే నాకు ప్రమోషన్ వస్తుందా?"

"వస్తుంది"

"ఎప్పుడు"

"త్వరలోనే"

"నిజంగానా?"

"నా మాట అబద్ధమైతే నువ్విచ్చిన ఫీజు నీకు వాపస్ ఇచ్చేస్తాను"

ఆ ఒక్క వాక్యంతో చిలకలదాసుకి గాల్లో ఎగిరినట్టు, నీటిమీద నడుస్తున్నట్టు, బీరువా నిండా వందరూపాయల నోట్ల కట్టలున్నట్టు కళ్లముందు కనిపించింది. శరీరానికి బలం కలిగించడానికి చాలా పోషకపదార్థాలు అవసరమవుతాయి. కానీ మనసుకి బలం కలిగించి, ఆలోచనల్ని స్పీడుగా పరుగెత్తించడానికి ఒక చల్లనిమాట చాలు. జ్యోతిష్కుడు కలిగించిన ఆశ కూడా చిలకలదాసుకి అదే ఉత్తేజాన్ని ఇచ్చింది.

అలాంటి రోజుల్లోనే ఒకరోజు జి.యమ్.గారు అందర్నీ తన రూములోకి పిల్చాడు.

"ఆమధ్య నేను హైదరాబాద్ వెళ్లి టి.వి.లో ఓ ఉపన్యాసం ఇచ్చేను. ఉద్యోగులు సమర్థవంతంగా పనిచేయడానికి కొన్ని అద్భుతమైన చిట్కాలు అనే విషయంమీద మాట్లాడేను. ఇవాళ టి.వి.లో ఏడూనలభైఅయిదునుంచి ఎనిమిదివరకూ ప్రసారం చేస్తున్నారు. అందరూ చూడండి, వినండి" అన్నాడు. అతను చేసింది అభ్యర్థన కాదు, సలహా కాదు. కేవలం ఆజ్ఞ మాత్రమేనని అందరికీ తెలుసు.

ఆరోజు చిలకలదాసు యింటికి హుషారుగా వచ్చేడు. ఏడుగంటలు దాటుతుండగా సుబ్బయ్యనాయుడు ఓ పెద్దసైజు సంచిని భుజానికి తగిలించుకొచ్చేడు. టీ.వీ.ముందు కూర్చుని శ్రద్ధగా చూస్తున్న దాసు పక్కకి ఓ కుర్చీ లాక్కుని కూర్చున్నాడు. "బావా యీరోజు మందుఖర్చు నాది. నీది కేవలం పుడ్డుఖర్చే" అన్నాడు. దాసు వెంటనే ఒప్పేసుకున్నాడు. ఎందుకంటే, ఎప్పుడు మందుకి కూర్చున్నా పకోడీ ఖర్చు నాది, మందు ఖర్చు నీదీ అంటూ తన రూపాయికి, ఎదుటివాడి డబ్భైరూపాయలకీ లింకుపెట్టెయ్యడం నాయుడికలవాటు. యివాళ వుత్త పుడ్డుఖర్చే అంటున్నాడు కాబట్టి అయిదారు రూపాయల్తో వదిలిపోతుందని సంతోషించేడు. వంటగదిలోకెళ్లి రెండు గ్లాసులు, ఓ సీసాతో నీళ్లు పట్టుకొచ్చేడు. గ్లాసుల్లో మందు వేయబోతుంటే "అప్పుడే వద్దురా... యివాళ టీ.వీ.లో మా జి.యమ్.గారి వుపన్యాస కార్యక్రమం వుంది. యింకాస్సేపట్లో వస్తుంది. అది అయిపోయేక తీస్కుందాం" అన్నాడు దాసు.

''సినిమాహాల్లో అయితే సినిమా చూస్తూ సిగరెట్లు కాల్చకూడదని రూలు పెట్టేరు. యింక అక్కడ మందుకొట్టే ప్రసక్తే లేదనుకో. కానీ, టీ.వీ. చూడ్డానికి అలాంటి రూల్సేం లేవు. ఒకవేళ నువ్విక్కడ మందు కొడుతున్నా టీ.వి.లో కనిపించే మీ బాసుకి మనం కనిపించం. ఆ సదుపాయం వుందిగదా'' అంటూనే రెండు గ్లాసుల్లో మందువేసి ఛీర్స్ చెప్పేడు. టీ.వీ.లో వార్తలు మొదలయ్యేయి. నాయుడు సంచీలోనించి అయిదారు పేకెట్లు తీసేడు. రెండు చికెన్‌బిర్యాని, ఓ చిల్లీ చికెన్, రెండు ఫిష్‌ఫ్రై, ఓ చికెన్ జాయింట్... మొత్తం నూటపాతిక బిల్లు అయింది'' అంటూ బిల్లు దాసుకి అందించేడు.

''వుద్దు ఖర్చు ఒక్కటే నాదంటే ఏ పదిరూపాయిలలోపో వదిలిపోతుందనుకున్నాను.కానీ యిలా నూటపాతిక బిల్లంటే మాత్రం నేను ఒప్పుకోను'' అంటూ ఆ బిల్లుని తిరిగి నాయుడి ముఖంమీదకే విసిరేడు దాసు.

''నువ్వేం యివ్వక్కర్లేదు బావా... యిందాక అయిదుగంటలకే వచ్చి అక్కడగ్గర్నించి అప్పుకింద నూటపాతిక అడిగి పట్టుకెళ్లేను. పీటికోసం అంటే మా అక్కయ్యివ్వదుగా. అంచేత చిన్న కటింగ్ కొట్టేను. తర్వాత నువ్వు లెక్కచెప్పేస్కో'' అంటూ వెకిలిగా నవ్వేడు.

ఆ నవ్వుని భరించలేనట్టుగా ఠప్‌మంటూ కరెంటుపోయింది! ప్రోగ్రాము వచ్చేముందు కరెంటు పోయినందుకు కంగారుపడ్డాడు దాసు.

''ఏమేవ్... ఆ టార్చిలైటు యిలా పట్రా'' అంటూ దాసు కేకవేసేడు. ''ఏం అందులో వున్న బేటరీలతో టీ.వీ.ని పనిచేయిద్దామనుకుంటున్నావా?'' నాయుడు వేసిన జోక్‌కి దాసు నవ్వకుండా మరోసారి భార్యని పిలిచేడు. ''అబ్బా వస్తున్నానండీ... ఆ టార్చిలైటుకోసమే వెదుకుతున్నాను'' అంటూ వంటగదిలోనించి సమాధానంతప్ప రెండు నిమిషాలదాకా వరలక్ష్మి రాలేదు. దాసుకి చాలా ఆతృతగా వుంది. మళ్లీ పిలిచేడు. ''యిదిగో టార్చిలైటు'' అంటూ అతని చెయ్యి ఎక్కడుందో వెదికి, చేతికి అందించింది. ''వెలిగించలేదేం?'' లోపలున్న బేట్రీల్ని తిప్పిపెట్టేనండి, మామూలుగా వుంటే అవి పాడైపోతాయటగదా. యిప్పుడు దాని మూత వూడిరావడంలేదు''

దాసు బలం వుపయోగించి దాని మూత తీసి, బేట్రీలు సరిగా పెట్టి వెలిగించేడు. వెంటనే దాన్ని పట్టుకుని వరలక్ష్మి వీధిలోకి పరుగెత్తి క్షణంలో తిరిగొచ్చింది. ''అన్ని యిళ్లకీ కరెంటు వుందండి. మనింటికే పోయింది'' ఆ మాటతో దాసు మరింత కంగారుపడ్డాడు.'' ప్రోగ్రామ్‌కి టైము అయిపోతోందిరా'' అంటూ చిరాకుపడ్డాడు. ''బహుశా ఫ్యూజ్ పోయి వుంటుంది. నాదగ్గరెప్పుడూ ఓ ఫ్యూజ్ వైరు రెడీగానే వుంటుంది. అక్కా... ఓ స్టూలు పట్రా అన్నాడు. పట్టుకొచ్చి మెయిన్ స్విచ్‌వున్న చోట వేసింది. నాయుడు దానిమీద నిలబడి టార్చిలైటు వెలుగులో తన సంచిలోనించి వైరుతీస్తుండగా ''అబ్బా, తొందరగా కానివ్వరా'' అంటూ నాయుడిచేతిని కదిపేడు దాసు. నాయుడిచేతిలోని టార్చిలైటు కిందపడింది. అద్దం, లోపలున్న బల్బు భళ్లుమంటూ పగిలిపోయేయి. ఎవరి రియాక్షన్ ఎలా వుందో తెల్సుకోడానికి ఆ యింటినిండా చీకటి! ''తొందరగా వెళ్లి ఓ కొవ్వొత్తి పట్రా'' అన్నాడు దాసు చిరాగ్గా.

''ఇంట్లో కొవ్వొత్తులు లేవు. అయినా మీరు అటూ యిటూ చిందులేయకండి. అద్దం పెంకులు గుచ్చుకుంటాయి. మీరసలే షుగర్ పేషెంటు. దెబ్బ తగిలిందంటే మీకు ఒకంత్తట మానదు''

''నువ్వు సలహాలు తర్వాత యిద్దువుగాని, ముందెళ్లి ఓ అగ్గిపెట్టె అయినా పట్రా''

భర్త గద్దించేసరికి వరలక్ష్మి చీకట్లో మెల్లగా తడుముకుంటూ వంటగదిలోకి వెళ్లింది.

వరలక్ష్మికి అగ్గిపెట్టె ఎక్కడుందో చీకట్లో తెలియడంలేదు. రోజూ తను పెట్టే చోటులో అదిలేదు. దాసుకి క్షణం ఒక యుగంలా వుంది, ''లాభంలేదు... అది అగ్గిపెట్టె తెచ్చి, నువ్వు ఫ్యూజ్ వేసేలోగా ఆ ప్రోగ్రామ్ కాస్తా అయిపోతుంది. నేనా ఎదురింటి సుబ్రహ్మణ్యంగారింటికెళ్లి టీ.వీ. చూసొచ్చేస్తాను'' అంటూ బయలుదేరేడు.

''ఆగండి'' చీకట్లోనించే భార్య అదిలింపు వినిపించింది.

"అగ్గిపెట్టె దొరికిందా?"

"దొరికిందిగాని, అందులో పుల్లలు లేవు. అయినాసరే మీరా ఎదురింటికెళ్లి టీ.వీ. చూడ్డానికి నేనొప్పుకోను" ఆవిడ మాటలు క్రమంగా దగ్గరయ్యేయి, అంటే ఆవిడ దగ్గర్లోనే వుందని గ్రహించేడు.

"ఆ యింటికెందుకెళ్లకూడదు?"

"ఆ సుబ్రహ్మణ్యం పెళ్లాం ఓ పెద్ద పొగరుబోతు. అక్కడికి ఆవిడకే కలర్ టీ.వీ., వీ.సీ.ఆర్‌లున్నట్టుగా మహా పెడసరంగా మాట్లాడింది. బ్లేక్ అండ్ వైట్ టీ.వీ.లు ఎలా చూస్తున్నారండీ బాబూ అంటూ నెల్లూరు యాసలో ఒకటే ఆశ్చర్యం ఒలకబోసింది. నేనూ కలర్ టీ.వీ. కొనేదాకా ఆ యింట్లో కడుగుపెట్ట కూడదని శపథంచేసేను. అంచేత మీరు వెళ్లకండి"

చిలకలదాసుకి ఒళ్లుమండిపోయింది. "బాగుందే బాగుంది. శపథాలు చెయ్యడానికైతే నీకు తీరికుందిగాని, నాలుగు అగ్గిపెట్టెలు తెచ్చి యింట్లో పెట్టడానికిమాత్రం తీరికలేదే! నీకు బొత్తిగా మగాడి భయంలేకుండాపోయిందే" అన్నాడు.

"ఆఁ... మాపట్ల మీకో బాధ్యత ఏడ్చుంటే, మీపట్ల నాకూ కాస్త భయంఏడ్చేది"

"ఇప్పుడు ఏబాధ్యత లేకుండా ఏడ్చేనట?"

స్టూలుమీద నిల్చున్న నాయుడు దభ్‌మంటూ కిందకి గెంతి దాసుమీద పడబోయి నిలదొక్కుకున్నాడు.

"బావా... యిప్పుడీ చీకట్లో నీకు కావాల్సింది కరెంటా? లేక, మా అక్కతో గొడవపడ్డమా? అక్కా, మన పవన్‌కుమార్ని పంపించి అర్జంటుగా ఓ అగ్గిపెట్టె తెప్పించు" అన్నాడు నాయుడు.

"వాడు ఏదో డ్రామా రిహార్సల్సుకెళ్లేడు. ఒక్కక్షణం ఆయన చిందులెయ్యకుండా ఆగితే, నేనే బయటకెళ్లి అగ్గిపెట్టె పట్టుకొస్తాను" అంటూ వరలక్ష్మి తడుముకుంటూ తడుముకుంటూ బయటకెళ్లింది.

ఆవిడ బయటకెళ్లగానే నాయుణ్ణి రిక్వెస్టు చేస్తున్నట్టుగా అన్నాడు. "ఒరేయ్ నాయుడూ! మీ అక్క అగ్గిపెట్టె పట్టుకొచ్చేసరికి నేషనల్ నెట్‌వర్కు ప్రోగ్రాము కూడా పూర్తైపోతుందిరా. యీలోగా, నేను ఈ వీధిచివర అప్పారావుగారింటికెళ్లి ఈ ఒక్క ప్రోగ్రామూ చూసివచ్చేస్తాను"

"వద్దుబావా... నా మాట విను. ఆ అప్పారావు భార్యతో మా అక్కేం గొడవ పెట్టుకుందో నాకు తెలీదు. నిన్నక్కడకి పంపిస్తే నన్ను తిట్టొచ్చు. పైగా మా అక్క కిళ్లీకొట్టుకే వెళ్లిందిగాని, అగ్గిపెట్టెల ఫేక్టరీకి కాదుగదా" ఆ మాటలు అంటూనే టీపాయ్‌మీద పెట్టిన రెండు మందుగ్లాసుల్ని అందుకుని, ఒకటి చిలకలదాసుకి అందించేడు.

"యిప్పుడు దీనికేం తొందరొచ్చిందిరా?" అన్నాడేగాని, ఓ గుక్క మింగలేకుండా వుండలేకపోయేడు.

"దీన్ని తొందర అనరు బావా. లింకుని మైన్‌టైన్ చెయ్యడం అంటారు. గుక్క తర్వాత గుక్క, పెగ్గు తర్వాత పెగ్గు లోపలకి వెళ్లకపోతే దాని ప్రతాపం అది చూపించలేదు. మొదటి పెగ్గుకి రెండో పెగ్గుకి ఎక్కువ గేప్ యిస్తే, మొదట వెళ్లిన పెగ్గు అనాథ పెగ్ అయిపోతుంది. అంతెందుకు, మన డాక్టర్లు గూడా కొన్ని జబ్బులకి ఓ పదో పన్నెండో ఇంజక్షన్లు కోర్సురాసి డైలీ ఒకటి చొప్పున చేయించుకోమంటారు. వాటిని క్రమంతప్పకుండా పుచ్చుకుంటేనే అవి పనిచేస్తాయి. మధ్యలో ఎక్కువ గేప్ యిచ్చేస్తే అవి సరిగా పనిచెయ్యవు" నాయుడు చీకట్లోనే నిలబడి తాగుతూ చింకిలెక్చరు యిస్తుండగా వరలక్ష్మి అగ్గిపెట్టె పట్టుకొచ్చింది. అయిదు నిమిషాల తర్వాత కరెంటు వచ్చింది.

అప్పుడు టీ.వీ.లో చిత్రహార్ హిందీ పాటలు వస్తున్నాయి. అంతే! చిలకలదాసు దభ్‌మంటూ కుర్చీలో కూలబడిపోయేడు. "అయిపోయింది. మొత్తం నా ప్రోగ్రామంతా తగలడిపోయింది" అంటూ వాపోయేడు. వరలక్ష్మిని లోపలకెళ్లమని చెప్పి నాయుడు అతని చేతికి ఓ చికెన్ జాయింట్ యిచ్చి, మరోచేత్తో ధైర్యాన్ని నూరి, అతని గుండెల్లో పోయడానికి ప్రయత్నించేడు.

"ఇప్పుడేం కొంపలు మునిగిపోయేయని వరదబాధితుల్లా విలవిల్లాడిపోతున్నావు. మీ



జి.యమ్.గారి ప్రోగ్రాము శ్రద్ధగా వినాలనుకున్నావు. కానీ వినలేకపోయేవు. అంతేగా. యిప్పుడు నేను చెప్పే మాటలు వింటే వరద బాధితులకి వరల్డు బేంకు సహాయం అందించినంత సంతోషం కలుగుతుంది. ఆయన ఏ సబ్జెక్టుమీద మాట్లాడతానన్నారో చెప్పు. ఆ విషయంమీద ఏయే డైలాగులువదిలి, ఆయన్ని ఎలా గాలిలో తేలించాలో నేను చెప్తాను'' అంటూ నాయుడు గొంతు సవరించుకుని చెప్పబోయేడు.

''నువ్వేం చెప్పక్కర్లేదు'' చిలకలదాసు అలిగినట్టుగా అన్నాడు. యిప్పుడు అనుకోకుండా వచ్చిన అవాంతరాన్ని అతను సీరియస్‌గా తీసుకున్నాడు.

''అంటే నేను చెప్పే సలహాలు నీకు అక్కర్లేదా?''

''అక్కర్లేదు''

''అక్కర్లేదన్నా, నువ్వీ కాకాయిజమ్ అనే యుద్ధంలో నువ్వు అర్జునుడివి మాత్రమే. కానీ నిన్ను గెలిపించే కృష్ణుణ్ణి నేను బావా''

''అంటే, నువ్వు లేకపోతే నేను బొత్తిగా వెధవనయిపోతానంటావా? అదేంకాదు. నాకుండే శక్తి నాకూ వుంది'' చిలకల దాసు బింకంగా ముఖంపెట్టి అన్నాడు.

''నీ శక్తి నీకూ ఉంది. బావా కాదన్ను. వెనుకటికి అర్జునుడూ యిలాంటి డైలాగే వాడేడు. కానీ కృష్ణుడులేందే తను లేడన్న సంగతి అర్జునుడు యుద్ధరంగంలోనే తెల్సుకున్నాడు. దానికో పిట్టకథ వుంది. కురుక్షేత్ర యుద్ధం జరుగుతున్నప్పుడు బలం అంతా వుపయోగించి అర్జునుడు కర్ణుడి రథాన్ని కొడితే అది అరవైగజాలదూరం వెళ్లిపోయిందట. కర్ణుడు మళ్లీ ముందుకొచ్చి అర్జునుడి రథాన్ని బాణంతో కొట్టేడట. ఆ దెబ్బకది రెండంటే రెండే అడుగుల దూరం వెళ్లిందట. అయినానరే కృష్ణుడు శెభాష్ కర్ణా శభాష్ అంటూ కర్ణుణ్ణి పొగిడేడట.

దాంతో అర్జునుడికి ఎక్కడలేని కోపమూవచ్చి ''నీకేమైనా బుద్ధీ, జ్ఞానమూ వుందా లేదా? నేను కర్ణుడి రథాన్ని కొడితే అది అరవైగజాల దూరం వెళ్లింది. వాడు నా రథాన్ని కొడితే అది రెండు అడుగుల దూరమే వెళ్లింది. అలాంటప్పుడు నన్ను పొగడ్డం మానేసి కర్ణుణ్ణి పొగుడుతావేం?'' అన్నాడు.

దానికి శ్రీకృష్ణుడు చిన్నగా నవ్వుతూ ''నీ రథంమీద యీ సృష్టిఅంతటికీ అధినాథుడనైన నేను కూర్చున్నాను. మన జెండామీద మహాబలవంతుడైన ఆంజనేయస్వామి వున్నాడు. మరి, మేమిద్దరం వుండగానే కర్ణుడు నీ రథాన్ని రెండు అడుగులు వెనక్కి కొట్టగలిగేడంటే, యింక మేం లేకపోతే యీపాటికి నీ ఎడ్రస్ ఎక్కడుండేదిరా బామ్మర్దీ'' అన్నాడట.

దాంతో అర్జునుడికి కనువిప్పయింది. మనదంతా కేరాఫ్ కృష్ణమూర్తి బ్రతుకేతప్ప, ఇండిపెండెంట్ కెపాసిటీతో కర్ణుణ్ణి గెలవలేం అని తెల్సుకున్నాడట. నేను లేకుండా నువ్వూ అంతే బావా! అంచేత రేపేం చెయ్యాలో చెప్తాను విను'' అంటూ మెల్లగా మందు చప్పరించేడు.

అతను చెప్పిన అర్జునుడు, కర్ణుడు కథతో చిలకలదాసుకి గాలితీసేసినట్టయింది. నాయుడు చిలకలదాసులో వచ్చిన మార్పుని గమనించి, చిన్నగా నవ్వుతూ చెప్పేడు

''మీ జి.యమ్.గారికి టీ.వీ. ప్రోగ్రాము చూసింది చూసినట్టే చెప్పక్కర్లేదు. కోర్టులో సాక్ష్యంచెప్పే సాక్షులు చూసిందాన్ని చూడలేదనీ చెప్తారు, చూడనిదాన్ని చూసేమనీ చెప్తారు. అదిగూడా భగవద్గీతమీద ప్రమాణంచేసి మరీ చెప్తారు. మరి, మీ జి.యమ్.గారు నీచేత భగవద్గీత మీద ప్రమాణంచేయించి, తన టీ.వీ.ప్రోగ్రాము గురించి చెప్పమనరుగా. ఈరోజుల్లో పుస్తకాలు చదవకుండా చాలామంది స్టూడెంట్సు పరీక్షలు రాసేస్తున్నారు. సినిమాలు చూడకుండానే చాలామంది జర్నలిస్టులు రివ్యూలు రాసేస్తున్నారు. అలాంటప్పుడు నువ్వు ప్రోగ్రాము చూడకుండా, దానిగురించి గేస్‌కొట్టడం తప్పేంకాదు. అంచేత ఆలస్యం చేయకుండా యీ మందు మింగెయ్యడం నీ తక్షణకర్తవ్యం. ఆ తర్వాత వేడి చల్లారిపోకుండా బిర్యానీలు తినడం మనిద్దరి తదుపరి కర్తవ్యం'' అంటూ సుబ్బయ్యనాయుడు చిరాకు, అలకలతో ప్లైట్ అయిపోయిన దాసుని మందోన్ముఖుణ్ణిచేసి, రేపు గేస్‌కొట్టడానికి ట్రైనింగ్‌యిచ్చే వుద్దేశంతో తన డైలాగులనే గేస్‌సిలిండరు విప్పేడు.

★ ★ ★




మర్నాడు చిలకలదాను ఆఫీసుకి వెళ్తూ నిన్న రాత్రి సుబ్బయ్యనాయుడు చెప్పిన మాటల్ని మనసులో నెమరువేసుకున్నాడు. అంతలోనే అతనికో విషయం గుర్తుకొచ్చింది. జి.యమ్.గారు మిగతా విషయాల్లో ఎలావున్నా ఆయనకి దండలు వేయించుకోవడం మహా ప్రీతి! దండ చూపించి పిలిస్తే దండకారణ్యానికైనా నడుచుకుంటూ వెళ్లిపోయే దండధరుల్లో జి.యమ్.గారు అతి ముఖ్యమైనవారని ఆయన ఆఫీసుకొచ్చిన మొదటిరోజే తెల్సిపోయింది. యిప్పుడు తను కొట్టబోయే గేస్‌తోపాటు, మెడలో ఓ దండగూడా వడేస్తే డబుల్‌ఎఫెక్టు కలుగుతుందనిపించి, పూలకొట్టుదగ్గర ఆగి, ఓ దండకొన్నాడు. బయటకి కనబడకుండా దాన్నో పేపర్లో నీటుగా చుట్టించేడు. ఆఫీసుకెళ్లగానే, ఎవరివైపూ చూడకుండా తిన్నగా జి.యమ్.గారి రూమ్‌లోకి వెళ్లిపోయి, "క్షమించాలి" అంటూ దండని అతని మెడలోవేసి, చప్పుడుకాకుండా చప్పట్లు కొట్టేడు. ఆ టేబిల్‌మీద మరో దండ ఏదీ లేకపోవడంవలన, దండవేసిన ఖ్యాతి తన ఒక్కడికే దక్కిందని చాలా సంతోషపడ్డాడు.

జి.యమ్.గారు తన అలవాటుప్రకారం మెడలో వేసిన దండని తీయలేదు. "ఏమిటండీ యిది?" అంటూ ముఖంలో ఎటువంటి భావాన్నీ వ్యక్తం కానివ్వకుండా యధాలావంగా అడిగేడు.

"నిన్న మీరిచ్చిన వుపన్యాసానికి వుప్పొంగిపోయి, నా ఆనందానికి చిహ్నంగా యీ పూలమాలని సమర్పించుకుంటున్నాను" అంటూ జి.యమ్. కూర్చోమనకుండానే కుర్చీలో కూర్చున్నాడు.

"నా ప్రసంగం మీరు విన్నారా?"

"విన్నాను, మిమ్మల్ని టీ.వీ.లో కన్నాను. మీరు కోప్పడినాసరే నేనో వచ్చినిజాన్ని చెప్పక తప్పదుసార్"

"ఏమిటది?"

"మీరు మామూలప్పటికంటే, టీ.వీ.లోనే బాగున్నారు సార్. ఫొటోజెనిక్‌ఫేస్ అంటారే, మీదిగూడా ఆ బైపు ఫేసేనండి. మీ గొంతుకూడా కంచుగంటలా ఎంత ఖంగుమందని! మీ వాయిస్‌ని కళ్లుమూసుకు వింటుంటే, సినిమాయాక్టరు జగ్గయ్య మాట్లాడుతున్నాడా అనే ఫీలింగ్ కలిగిందండి"

"యింతకీ నా స్పీచ్ మిమ్మల్ని ఆకట్టుకుందా ?"

"ఆకట్టుకోవడం ఏమిటి సార్. నా మనసుని అల్లల్లాడించేస్తేను. మీరు చెప్పిన చిట్కాలనే గనక ప్రతీ వుద్యోగస్థుడూ పాటిస్తే ఒక్క పదేళ్లలో, ఏతిన్ టెన్.ఇయర్స్‌లో మనదేశం అమెరికాకి అప్పిచ్చే లెవెల్‌కి ఎదిగిపోతుంది."

గదిలో యిలా సంభాషణ కొనసాగుతోంది. బయట హాల్లోవున్న రంగారావుకి ఆత్రం పెరిగిపోతోంది. ఈమధ్య జి.యమ్.గారు చిలకలదానుని తరచుగా పిలవడంలేదు. పిల్చినా, యింత ఎక్కువసేపు మాట్లాడలేదు. కానీ యిప్పుడింతసేపు మాట్లాడుతున్నారంటే, ఏవిషయమై వుంటుంది? సమాధానం దొరక్క జి.యమ్.గారి రూమ్‌దగ్గరకెళ్లి తలుపుకి చెవి ఆనించి, లోపల జరిగే మాటల్ని వినసాగేడు. అతన్నిచూసి మరో నలుగురు అక్కడికెళ్లి వాళ్ల చెవుల్ని ఆ తలుపుకి అంటించేసేరు.

ఓ రెండునిమిషాల తర్వాత జి.యమ్.గారి గొంతు బిగ్గరగా వినిపించింది. ఏం మాట్లాడుతున్నాడో అర్థంకావడంలేదుగాని, అతను చాలా కోపంగా మాట్లాడుతున్నాడని మాత్రం బోధపడింది. మరో పదినిమిషాల తర్వాత ఎర్రబడిన ముఖంతో చిలకలదాను తలుపు తోసుకుని బయటకొచ్చేడు. తలుపు మూయబోతుండగా లోపల్నించి పూలదండ విసురుగావచ్చి హాల్లో పడింది. తలుపుదగ్గరున్న వాళ్లని కోపంగా చూసి, కింద పడిన దండని తీస్కుని తన సీటుదగ్గరకెళ్లి కూర్చున్నాడు. రంగారావు, మిగతా వాళ్లూ గబగబా అక్కడికెళ్లి "ఏంజరిగింది సార్" అంటూ ఆసక్తిగా అడిగేరు.

సమాధానం చెప్పకూడదనుకున్నాడుగాని, అతనిలో వచ్చిన వుక్రోషం అతని మెదడు చేసిన ఆదేశాన్ని వుల్లంఘించింది. "ఎవరో కిట్టని వెధవలు నామీద చెప్పే అవాకులూ, చెవాకులూ ఆయన వింటున్నట్టున్నారు. నేను మంచిమాట చెప్పినా అదో బూతుమాటలా ఆయనకి వినిపిస్తోంది" అన్నాడు.

"సర్లెండి... ఆఫీసుల్లో అవన్నీ మామూలేగానీ, యిప్పుడేమైందట? అసలీ దండ ఎలాగొచ్చింది?" ఒక గుమస్తా అడిగేడు.





"నిన్న టీ.వీ.లో ఆయన చేసిన ప్రసంగం చాలా బావుందని చెప్పి, ఆనందంపట్టలేక దండవేసి సత్కరించేను. ఆ ప్రోగ్రాము గురించి చాలా ప్రశ్నలు అడిగేరు, నేనూ చక్కగా జవాబులు చెప్పేను. అంతలోనే సడన్‌గా మీ సీట్లో ఎంత పెండింగ్‌వర్కు వుందీ, మీరు సీట్లో నిద్రపోతున్నారా? అంటూ సర్రుమంటూ రెచ్చిపోయేరు"

అందరూ ఒకరిముఖాలొకరు వింతగా చూస్కుని, వెంటనే పగలబడి నవ్వేసేరు.

"ఎందుకండీ నవ్వుతున్నారు? ఆయనేదో అర్థంపర్థంలేకుండా కోపం తెచ్చుకుంటే, మీరూ నవ్వాలా?" వుక్రోషంగా అడిగేడు చిలకలదాసు.

రంగారావు యింకా నవ్వుతూనే వ్యంగ్యంగా అన్నాడు "నవ్వకేంచెయ్యమంటారు మహాశయా... నిన్నరాత్రి ఆయన వుపన్యాస కార్యక్రమం టీ.వీ.లో రాలేదు. ఏదో అనివార్య కారణాలవల్ల వేరే కార్యక్రమం ప్రసారం చేస్తున్నామంటూ, మరేదో ప్రోగ్రాము చూపించేరు, మీరేమో ఆయన వుపన్యాసం అదిరిపోయిందంటూ మెడలో దండవేసి మరీ అభినందించేరు. మరాయనకి కోపంవచ్చి తిట్టేరంటే తిట్టరూ?"

చిలకలదాసు ముఖం ఓడిపోయిన వీరుడిలాగ, గ్రహణంపట్టిన సూర్యుడిలాగా నిస్తేజంగా తయారయింది. నాలిక తెగిపోయినవాడిలా మాట్లాడలేకపోయేడు.

"మళ్లీ మరోసారి దెబ్బతినేసేను" ఈ ఒక్క మాట అతని మనసులో గణగణమంటూ గంటలా మ్రోగసాగింది.



చిలకల దాసు ఈసారి జరిగిందానికి సుబ్బయ్యానాయుణ్ణి తప్పుపట్టలేదు. అతన్నేకాదు, మరెవర్నీ తప్పుపట్టలేదు. ఆరోజు కరెంట్ ఆగిపోవడం తన దురదృష్టం. వెంటనే ఫ్యూజు వేసి, కరెంటు తెప్పించుకునుంటే, టీ.వీ.లో ఆ ప్రోగ్రాము వచ్చిందో లేదో తెల్సుకునివుండేవాడు. కానీ అదేరోజు, యింట్లో అగ్గిపెట్టె అయిపోవడం ఏమిటి? అందుకు అగ్గిపెట్టెని తప్పుపట్టీ లాభంలేదు. దాని టైము అయిపోయింది కాబట్టి అదీ తనకి సహాయపడలేకపోయింది. ఇవన్నీ అలావుంచి, ఆరోజు టీ.వీ.లో ప్రోగ్రాము వచ్చిందో లేదో తను ఎవరినైనా ఎందుకడగలేదు? ప్రోగ్రాము కేన్సిల్ అవుతుందనే అయిడియా తనకి రాకపోబట్టి! అసలా టీ.వీ.వాళ్లు ఆ ప్రోగ్రాముని ఎందుకు కేన్సిల్ చేసినట్టు? పాపం వాళ్ల యిబ్బందులేవో వాళ్లకొచ్చి వుంటాయి! ఈవిధంగా చిలకలదాసు ప్రశ్నా తనే వేస్కుని, సమాధానమూ తనే చెప్పుకునే చిత్రమైన స్థితిలో గడుపుతున్నప్పుడే మరో సంఘటన జరిగింది.

మునుపెన్నడూ లేనివిధంగా చిలకలదాసు ఆఫీసులో శ్రద్ధగా పనిచేస్తున్నాడు. కరెక్టు టైముకి ఆఫీసుకెళ్లిపోయి, అయిదు కొట్టేవరకూ ఠంచన్‌గా పనిచేస్తున్నాడు. "ఇందువల్ల నీకొచ్చే అదనపు సౌకర్యం ఏమీ వుండదు బావా, ఆ రంగారావుచూడు, వుదయాన్నే ఆఫీసుకొస్తాడు. సంతకం పెడతాడు. వెంటనే రీడింగ్ రూమ్‌కెళ్లిపోయి పేకాడతాడు. మళ్లీ లంచ్‌టైముకి ఆఫీసుకొచ్చి భోంచేసి, అక్కడే ఓ అరగంట కునుకుతీసి మళ్లీ పేకాటకెళ్లిపోతాడు. ఆఫీసుటైము అయిపోతోందనగా వస్తాడు. సాయింకాలం ఆరున్నరా ఏడుదాకా ఫైల్సు అటూ యిటూ తిరగేస్తాడు. మీ జి.యమ్.గారు కూడా ఆరున్నరదాకా ఆఫీసులోనే వుంటాడు కాబట్టి, అతను వెళ్లేసమయానికి రంగారావు ఒక్కడే ఆఫీసుమొత్తంమీద లేట్‌అవర్స్ పనిచేస్తున్నట్టు కనబడుతున్నాడుగాని, పగలంతా సిన్సియర్‌గా పనిచేసేవాళ్లు ఆయన దృష్టికి రావడంలేదు. జి.యమ్.గారు వేసే మార్కులన్నీ రంగారావుకే పడిపోతున్నాయి" అంటూ సుబ్బయ్యానాయుడు హితబోధచేస్తే చిలకలదాసు యీమధ్య చాలాసార్లు నిర్వికారంగా నవ్వేసి "సత్యమేవజయతే, శ్రమయేవజయతే" అన్నాడు. సుబ్బయ్యానాయుడు పకపకమని

నవ్వి ''నువ్వు కొట్టిన కొటేషన్ను నాకూ తెలుసు! మొదటి కొటేషను కోర్టుల్లోని గోడలకి, రెండో కొటేషను ఆఫీసు గోడలకి వెళ్లాడ్డానికే పనికొస్తు న్నాయిగాని, వాస్తవంగా ఆ రెండూ యిప్పట్లో ఏ విజయాన్నీ సాధించడంలేదు. ఇప్పుడు దబాయింపు, మొండితనమే రాజ్యమేలుతు న్నాయి. దీనికో పిట్టకథ చెప్తాను విను.

''వెనకటికి నీలాంటి దాసు, నాలాంటి నాయుడూ అడవిలో ప్రయాణం చేస్తున్నారట. దారికడ్డంగా ఓ అమ్మవారి విగ్రహం కనిపిస్తే నేను ఖాతరు చెయ్యకుండా దాన్ని తన్ను కుంటూ ముందుకు వెళ్లిపోయేను. కానీ నీలో చిన్న దైవభక్తి, పాపచింతనా వున్నాయికాబట్టి, ఆ విగ్రహాన్ని లేపి, నిలబెట్టి, రుమాలుతో దానికి అంటుకున్న ధూళిఅంతా తుడిచి, ఓ దండంపెట్టి ముందుకువెళ్లబోతే, ఆ అమ్మవా రు ఢంగ్‌మంటూ ప్రత్యక్షమై, ఒరేయ్ ఎలకల పూడి చిలకలదాసూ యిలా రారా వెధవా... అని పిలిచి, ఏరా నీకెంత పొగరు? నాకు దండంపెట్టి జారుకుంటున్నావేగానీ కొబ్బరి కాయ కొట్టలేదేంరా? నువ్వు జీవితమంతా తల నెప్పితో బాధపడూ అంటూ శపించింది. నువ్వు కంగారుపడిపోయి, యిదేమిటి తల్లీ యీ అన్యాయం? ఆ పుబ్బనిబిల్లి సుబ్బయ్యనాయు డుగాడు నిన్ను ఖాతరుచేయకుండా నీ విగ్రహా న్ని తన్నుకుంటూవెళ్లిపోతే, వాణ్ణేమీలనకుండా, నిన్ను నిలబెట్టి, శుభ్రంచేసి, దండంపెట్టి వెళ్తున్న నన్ను శపించడం న్యాయమా అన్నావు. దానికా మహాతల్లి ఏమందో తెలుసా? ఆ నాయుడుగాడుత్త మొండివెధవ, పెంకిరా స్కెల్! వాడిమీద నేను కోప్పడినా వాడు ఖాత రుచెయ్యడు. వాడికి శాపం యిచ్చినా ఫలించ దు. నువ్వంటే వుత్త మెతకవెధవ్వి, మేం శాపాలిచ్చినా, కోపాలు ప్రదర్శించినా నీలాంటివాళ్లమీదేరా నాయినా అంటట. ఈ ఇన్సిడెంటు ఎప్పుడు జరిగిందంటే మనకి స్వతంత్రం రాడానికో వారంకిందట జరిగింది. ఆ తర్వాత స్వతంత్రం వచ్చింది. అప్పట్నించీ, నాలాంటి మొండి సుబ్బయ్యలే హేపీగా బ్రతు కున్నారు. నీలాంటి మెతకదాసులు పైవాళ్ల చేత మొట్టికాయలు తింటున్నారు. మీరంగా రావుగాడిదీ నాజాతే! అయినా నేను బోధించిన కాకాయిజాన్ని స్టార్ట్‌చెయ్యడమైతే చేసేవుగాని, దాన్ని మధ్యలో వదిలేసేవేమిటి? తప్పుకదూ'' అంటూ మందలించేడు.

చిలకలదాసు యుద్ధంమధ్యలో కత్తి పారేసు కున్న సైనికుడిలా నిస్సహాయంగా ముఖం పెట్టి, ''వద్దు బావా... ఆఫీసు వైకుంఠపాళీలో ప్రమోషన్ అనే పరమపదం చేరడానికి నువ్వు చెప్పిన కాకాయిజమ్ నాకు నిచ్చెనలా వుపయో గపడి పైకి ఎక్కిస్తుందనుకున్నానుగానీ పాము లాగ నోరు విప్పి నన్ను చప్పరించేస్తుందనుకోలే దు. నాకు ప్రమోషన్ వచ్చినా రాకపోయినా ఫర్వాలేదు, కానీ ఈ అవమానాలూ, ఈ బాధ లూ నేను భరించలేను'' అన్నాడు.

అతనికి నూతనోత్సాహాన్ని కలిగించడానికి సుబ్బయ్యనాయుడు తన సంచిలోనించి భర్తృహరి సుభాషితాల పుస్తకాన్ని తీసి అందించాడు. ''నీలాంటివాళ్లు నీళ్లుగారిపో తూంటారనే భర్తృహరి మహాశయుడు ఆనాడే పద్యం రాసేశాడు. ఫలానా పని చెయ్యడం నా మొహం నావల్లేం అవుతుందని కొంతమంది ముందుగానే భయపడి మానేస్తారు. వాళ్లు ఏవరేజ్ మనుషులు. మరికొంతమంది మన ఆంధ్రులు లేవదీసే వుద్యమంలాగా చర్రు మంటూ పనులు స్టార్ట్‌చేస్తారు. కానీ అందులో కాస్త ట్రబుల్సూ, కష్టాలూ ఎదురయ్యేసరికి ధన్‌మంటూ విత్‌డ్రా అయిపోతారు. వీళ్లు ఎబౌ ఏవరేజ్ మనుషులు. ఇంక లాస్ట్ అండ్ ఫైనల్‌గా సుప్రీమ్ క్వాలిటీ సూపర్‌హిట్ మను షులుంటారు. వాళ్లు సాధారణంగా ఆలోచించి ఆలోచించి ఓ పనిని స్టార్ట్‌చేస్తారు. చేసేక ఆ పనిలో విజయం సాధించేవరకూ దాన్ని జీడి బంకలా వదలరు. నువ్వు కూడా ఆ టైపు జీడిబంకలానే వుంటావనుకున్నానుగానీ మధ్యలో ఇలా డ్రాప్ అయిపోతావనుకోలేదు'' ఇలా ఇద్దరిమధ్యా వాదోపవాదాలు జరుగుతు న్న సమయంలోనే ఓరోజు ఆఫీసులో ఓ సంఘ టన జరిగింది.

అనకాపల్లి బ్రాంచికి మేనేజర్ని సెలక్ట్‌చేసి ఆ వూరికి బదిలీచేసే ప్రయత్నంలో జి.య మ్.గారున్నారని ఆఫీస్ ప్యూన్ ఎమ్మన్ చిలకల దాసుతో చెప్పాడు. ఆరోజు దాసు ఆఫీసులో మరింత శ్రద్ధగా పనిచేశాడుగాని జి.యమ్.గారి నోటీస్‌లోకి ఆ సిన్సియారిటీ వెళ్లలేదు. సాయంత్రం నాలుగున్నరదాటేక రంగారావు





రీడింగ్‌రూమ్‌లో పేకాట ఆడి ఆఫీసుకొచ్చాడు. టైం ప్రకారం చిలకలదాను అయిదు గంటలకి ఆఫీసునుంచి వెళ్లిపోయాడు. జి.యమ్.గారు ఆరోజు ఏడుంపావువరకు ఆఫీసులో వుండి, అప్పుడు ఇంటికి బయలుదేరేరు. ప్యూన్ ఎమ్మన్ దొరగారి బ్రీఫ్‌కేను పట్టుకొని అతని వెంట బయలుదేరాడు. రంగారావు సీరియస్‌గా పనిచేస్తుండడం గమనించి జి.యమ్. ఆశ్చర్యపోయాడు. తన ఆనందం వ్యక్తంచేసేడు "మీరు ఇంతవరకూ వర్క్ చేస్తున్నారా?" అని అడగకుండా వుండలేకపోయేడు. "చెయ్యకేం చేస్తాంసార్?, మా ఇంటిల్లిపాదికీ అన్నం పెడుతున్న వుద్యోగంకదా సార్? వర్క్ ఈజ్ వర్షిప్ అని బోర్డులు కట్టుకోగానే నరా! దాన్ని కాస్తయినా జస్టిపై చెయ్యాలికదండి. ఏమాటకామాటే చెప్పుకోవాలి, మీరీ ఆఫీసుకొచ్చాక మిమ్మల్ని, మీ హార్డ్ వర్క్‌ని చూసే నేనూ మీ అడుగుజాడల్లో నడవడానికి ప్రయత్నిస్తున్నాను" అన్నాడు రంగారావు వీలున్నంత వినయం ప్రదర్శిస్తూ.

ఎమ్మన్ కుతకుతలాడిపోయాడు. పగలంతా పేకాట ఆడి ఇప్పుడే ఆఫీసుకొచ్చేడండీ అని చెప్పెయ్యబోయి అంతలోనే తన స్థాయిని గమనించి తమాయించుకున్నాడు. జి.యమ్.గారు మాత్రం పొంగిపోయి రండి నా కార్లో డ్రాప్‌చేస్తానంటూ రంగారావుని కూడా తీసుకెళ్లి కారు ఎక్కాడు. అతను డ్రైవింగ్ సీట్లో కూర్చుంటే రంగారావు అతని పక్కన కూర్చున్నాడు. ఎమ్మన్ బేక్ సీట్లో కూర్చున్నాడు. దారిలో రంగారావు కావాలనే కులాల ప్రస్తావన తెచ్చాడు. "రేపురాబోయే జనరల్ ఎలక్షన్లో ఫలానా ఏరియాలో ఫలానా కులస్తులు ఎక్కువగా వున్నారనే ఫలానా ఆయనకి సీటు ఇచ్చారు. అఫ్‌కోర్స్, సాటి కులస్తుడుకదాని ఓట్లు వెయ్యకపోరు. ఆయన బంపర్ మెజార్టీతో గెలవకమానడు. ఆమాత్రం కులాభిమానం చూపించుకోకపోతే వాళ్ల సంస్కారం ఎలా బయటపడుతుందిసార్" అంటూ జి.యమ్.గారికి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా కులాభిమానం చూపించకపోతే వాడు మనిషేకాడు అన్నట్టుగా మాట్లాడేడు. అతని వుద్దేశ్యం ఎమ్మన్‌కి నులభంగానే అర్థమైపోయింది. రేపో, ఎల్లుండో ఇవ్వబోయే ప్రమోషన్, మీ కులస్థుని నాకివ్వడం న్యాయం అనే అర్థం ధ్వనించేలా మాట్లాడి, ప్రమోషన్‌కోసం తను వెయ్యబోయే అస్త్రాన్ని అప్పుడే సంధించేడు.

ఈ విషయాలన్నీ ఎమ్మన్ చిలకలదానుకి చెప్పేడు. ఆ విషయం సుబ్బయ్య నాయుడికీ తెల్సింది. దానుదగ్గరకొచ్చేడు. ఇంకో రెండు రోజుల్లో ప్రమోషన్ ఆర్డర్సు వేసేస్తారుకాబట్టి మన ప్రత్యర్థి ఈ ప్రమోషన్‌కి పొలిటికల్ కలర్ ఇచ్చేరు కాబట్టి, మనవూ ఈ క్షణంనించి పొలిటికల్ రూట్లోనే నడుద్దాం. పొలిటికల్ లీడరు తన మనుగడకి రెండు ఆయుధాల్ని సమకూర్చుకుంటాడు. ఒకటి ఆత్మస్తుతి, రెండు పరనింద! ఈ రెండూ వున్నవాడు నీచుడికింద జమవుతాడని జ్ఞానులు చెప్తారు. కానీ, రాజకీయవాదులు మాత్రం ఈ విషయంలో మినహాయింపు తీసుకున్నారు. మన డబ్బా మనం వాయించుకోకపోతే మన చుట్టూ ఎవడూ చేరడు. అలాగే ఎదుటివాణ్ణి తిట్టకపోతే, మన వేల్యూ పెరగదు. ఆ రంగారావుగాడు సిన్సియర్‌గా పనిచేస్తున్నట్టుగా రాంగ్ బిల్డప్పుయివ్వడం, కులం పేరుతో ఆఫీసరు చంకెక్కెయ్యాలనిచూడ్డం లాంటి క్షుద్ర విద్యలు ప్రదర్శిస్తున్నాడు కాబట్టి మనవూ క్షుద్రవిద్యలే ప్రదర్శిద్దాం. వాడి మీద వున్నవి కొన్ని లేనివి కొన్ని చెప్పేసి, మీ జి.యమ్.గారి బుర్ర పాడు చేసేస్తే ఇంకారంగారావుగాణ్ణి ఫుట్‌బాల్‌లా కాలితోతన్ని వాలీబాల్‌లా నిన్ను చేత్తో పట్టుకుంటాడు"

సుబ్బయ్యనాయుడు ఇంతలా చెప్పినా చిలకలదాను, ఆ పనిచెయ్యడానికి అంగీకరించలేదు. 'అలా చెయ్యడం చాలా అన్యాయంరా' అంటూ మూలిగేడు.

"ఆఁహా! నీపాటి న్యాయం శ్రీకృష్ణుడికి, పాండవులకీ తెలీక అన్ని అన్యాయాలు చేసేరా?" అంటూ ఆవేశంగా మాట్లాడేడు నాయుడు.

"మహాభారతంలో అన్యాయాలు చేసింది కౌరవులుగాని పాండవులుకాదురా. సరిగ్గా చదువు"

"సరిగ్గా చదివేను కాబట్టే చెప్తున్నాను. భారతంలో కౌరవులూ అన్యాయాలు చేసేరు. పాండవులూ అన్యాయాలు చేసేరు. కాకపోతే

చతుర ...

కౌరవులు ముందు చేసేరు. పాండవులు కాస్త లేటుగా చేసేరు. దుర్యోధనుడితో భీముడు యుద్ధం చేస్తూ, ఫౌల్‌గేమ్ ఆడి తొడల మీద కొట్టి చంపేసాడు. ఇంటర్నేషనల్ గదాయుద్ధం రూల్స్ ప్రకారం అలా చెయ్యడం తప్పని బలరాముడు గొడవ పెట్టేడు. ఏం తర్టీన్ ఇయర్స్‌బేక్ ఈ దుర్యోధనుడు, పాండవుల పుమ్మడి భార్య అయిన ద్రౌపదిని నిండుసభలో చీరవిప్పించాలనుకోవడం, అవమానించటం అన్యాయం కాదా అని శ్రీకృష్ణుడు చెప్పేడు. కర్ణుడి చేతిలో ఆయుధం లేనప్పుడు అర్జునుడు అతన్ని చంపడమూ అధర్మమే. కానీ దానికి శ్రీకృష్ణుడేం జస్టిఫికేషన్ ఇచ్చేడు? మొన్న అయిదో తారీఖునాడు అభిమన్యుణ్ణి మాత్రం మీరు అన్యాయంగా చంపలేదా అన్నాడు. ఇలాంటివి చెప్పాలంటే లక్షాతొంబై పున్నాయి. యుద్ధ మన్నాక గెలుపు ముఖ్యం. గెలుపు కావాలనుకున్నప్పుడు ధర్మయుద్ధమే చెయ్యక్కర్లేదు" ఈ విధంగా సుబ్బయ్య నాయుడు చేసిన పువదేశానికి చిలకలదాను లొంగిపోయి, రంగారావు మీద చాడీలు ఎలా చెప్పాలని, నాయుడి దగ్గరే ఆ రోజంతా ట్రైనింగయి, జి.యమ్.గారింటికి బయలుదేరేడు.

పుదయాన్నే ఇంటి దగ్గర, సాయంకాలం క్లబ్‌లో బిలియర్డ్స్ ఆడుతున్నప్పుడు, షాపింగ్ కెళ్తున్నప్పుడు ఇలా ఎక్కడ అవకాశం దొరికితే అక్కడ కల్సుకుని పున్నవీ లేనివీ చెప్పేసేడు. అతను చెప్పిన వాటిల్లో ముఖ్యమైనవి ఇవీ! మీకు రెండో భార్య పున్నట్టు ఎవరు చెప్పేరనుకుంటున్నారు? వాడే చెప్పేడు. ఆ ఇంటి ఎడ్రస్ చెప్పి, అక్కడికి స్వయంగా తీసుకొచ్చి, మీరు మీ భార్య కాళ్ళుపడుతుండడాన్ని కిటికీ లోనించి చూసి, నన్ను ఆ ఇంట్లోకి తోసి, గభీమని బైటకిపారిపోయింది ఎవరనుకున్నారు? వాడే! మీ చెల్లెలు మీ ఇష్టానికి వ్యతిరేకంగా మరొకడితో లేచిపోయిందని చెప్పిందెవడు? వాడే! ఆ భాస్కరప్రసాద్ సెండాఫ్ పార్టీకి నా చేత ఫొటోలు, వీడియో, తీయించి వాటిని మీకు ప్రెజెంట్ చెయ్యమని చెప్పిందెవడు? వాడే! మీరు ఆఫీసులో క్విజ్ ప్రోగ్రామ్ కండక్ట్ చేసినప్పుడు మీ దగ్గర మెహర్బానీ కోసం ఓడిపోయిందెవడు? వాడే! మీరు గెల్చుకున్న పందెం డబ్బుని మర్నాడు మీరు మాకు ఇచ్చేసినా, మీరు మా స్టేఫ్ దగ్గర్నించి పందెం రూపంలో లంచాలు తీసుకుంటారని దుష్ప్రచారం చేసిందెవడు? వాడే! మీ ఇంటికి నన్ను వళ్ళబుట్టలు ఇచ్చిరమ్మని పంపిందెవడు? వాడే! సాయింకాలందాకా రీడింగ్ రూమ్‌లో పేకాట ఆడి, సాయింకాలం పావు తక్కువ అయిదు కొచ్చి, మీరు వెళ్లిందాకా ఆఫీసువర్కుచేస్తున్నట్టు నటించిందెవరు? వాడే! మీ టి.వి. ప్రోగ్రాముందని చెప్పినరోజు, ఏనాడూ లేంది వాడు నన్ను సినిమాకి తీసుకుపోయి మర్నాడు మీ దగ్గర అబద్ధం ఆడమని చెప్పిందెవడు? వాడే! అయ్యా! ఇవన్నీ ఎందుకు చేసేడంటే మీ దృష్టిలో నన్ను చెడుగా చిత్రీకరించడానికే చేసేడు. ఇవన్నీ నేనెందుకిన్నాళ్ళూ కడుపులో దాచుకున్నాను? మీరూ మీరూ ఒకటే కేష్టని. మీరూ మీరూ దగ్గర బంధువులని వాడు ప్రచారం చెయ్యబట్టి, నావల్ల మీకూ మీకూ విరోధం ఎందుకని నేను ఇన్నాళ్ళూ కక్కలేక, మింగలేకా నా నోరు నేనే నొక్కుకున్నాను.

ఇంక నేనెంత అమాయిక చక్రవర్తినో, నేనెంత నమ్మిన బంటునో ఆఫీసులోని ప్యూన్‌ని అడగండి, ఇంట్లో మీ మావయ్యగార్ని అడగండి. మేడమ్‌గార్ని అడగండి. నాకు మీ రెండో భార్య సంగతి తెల్సినా, ఆ విషయం ఎవరికైనా చెప్పేనా? లేదు. నేను వళ్ళబుట్టలతో మీయింటికొచ్చినప్పుడు మేడమ్‌గారు తిట్టినా నేను నోరెత్తేనా? లేదు. ఆఫీసులో మీరు ఎన్నిసార్లు మందలించినా మీకు ఎదురు చెప్పేనా? లేదు. మీ మావయ్యగార్ని, వారి స్నేహితుడు రామ్మూర్తిగార్ని అడపాదడపా చిన్న చిన్న సాయాలు చేసినా వాటినింతవరకూ మీకు చెప్పేనా? లేదు. ఆ రంగారావుగాడు మిమ్మల్ని అడ్డమైన తిట్లూ తిడుతుంటాడు. అయినా తమదాకా, ఆ విషయం తీసుకొచ్చేనా? లేదు"

చిలకలదాసుచెప్పింది సమస్తం జి.యమ్.గారి చర్మాన్ని చీల్చుకుని రక్తంలోకి, రక్తంలోనించి మెదడులోకి ఎక్కిపోయింది. అప్పటికప్పుడు ప్యూన్ ఎష్ణున్ని, తన భార్యని, మామని పిల్చి 'ఈ చిలకలదాసు ఫలానా ఫలానా విధంగా తను మంచి వాణ్ణని అంటున్నాడు, అదంతా నిజమేనా?' అని అడిగేడు.

 

నిజమే నిజమే అని అన్నారు ముగ్గురూ. వెంటనే చిలకలదానుని జి.యమ్.గారు గాఢంగా కౌగలించుకున్నారు. తప్పైపోయింది క్షమించమన్నారు. మీరు చెప్పిందాకా ఆ రంగారావు తాడు అని, మీరు పాము అనిభావించేను. కానీ ఇప్పుడే నాకు కనువిప్పయింది. ఆ రంగారావు పని రేపు చెప్తాను. ఆ స్కాండ్రల్ సంగతి రేపు తేలుస్తాను'' అంటూ పళ్లు పటపటాకొరికేడు.

చిలకలదాను జీవితంలో ఏనాడూ అనుభవించనంత ఆనందాన్ని ఇప్పుడనుభవించేడు. దుర్మార్గంవల్ల ఇన్ని ప్రయోజనాలు, ఇంత సులభంగా నెరవేరుతాయి కాబట్టే, ఈ లోకంలో చాలామంది దుర్మార్గులు బ్రతగ్గలుగుతున్నారనుకున్నాడు. సుబ్బయ్య నాయుడు ఎక్కడవున్నాడో వెదికిపట్టుకుని మరీ అతనికి పార్టీ ఇచ్చేడు. ''ఇప్పుడెందుకులే బావా, రేపు ప్రమోషన్ ఆర్డర్సు వచ్చేక ఇద్దువుగానిలే'' అన్నాడు నాయుడు.

''అదేం కుదరదు. రేపు దీపావళి అయితే ఇవాళ నరక చతుర్థశి. రేపు సంక్రాంతి అయితే ఇవాళ భోగి పండగ. నిజంగా నీ బోధనల్లో ఇంత మహాత్మ్యం వున్నదనుకోలేదు'' అంటూ నాయుడికి పార్టీ ఇచ్చేడు. ఇద్దరూ ఆ రాత్రంతా మందులో మునిగితేలేరు. మర్నాడు ఆఫీసుకి దర్జాగా, హుందాగా బయలుదేరివెళ్లేడు. ఆఫీసరు ఇప్పుడు తన జేబులో వున్నాడన్న ఆనందంతో అతను పాత చిలకలదానులాగే రెండు గంటలు లేట్‌గా వెళ్లేడు. అతను ఆఫీసులో అడుగుపెట్టేసరికి రంగారావు మెడలో ఓ దండవుంది. మిగతా స్టాఫ్ అతనికి షేక్‌హేండ్స్ ఇచ్చి అభినందిస్తున్నారు.

''ఏవిటండీ ఈ హడావిడి? ఇవాళ రంగారావుగారి పుట్టినరోజా?'' అని నవ్వుతూ అంటూ తన సీట్లో కూర్చున్నాడు.

''పుట్టినరోజుకాదు సార్, అనకాపల్లి బ్రేంచికి మేనేజర్‌గా ప్రమోట్ అయ్యేరు, ఇప్పుడే ఓ అరగంట క్రితం జి.యమ్.గారు ఆర్డరు చేతికి చ్చేసేరు కూడా'' ఎవరో గుమస్తా అన్నాడు.

చిలకలదాను మీదనించి పిడుగుపడినట్టు, కింద నించి బాంబే పేలినట్టు అదిరిపడ్డాడు. ఇదికలా? నిజమా?

నిజమే అంటూ రంగారావు అతని దగ్గరకొచ్చి ప్రమోషన్ ఆర్డరు చూపించేడు.

ఇదే నిజమైతే, నిన్న జి.యమ్.గారు చెప్పిందేవిటి? ఇప్పుడు చేసిందేవిటి?

తల గిర్రున తిరిగినట్టనిపించింది. తమాయించుకుని ముఖానికి పట్టిన చెమటల్ని రుమాలుతో తుడుచుకుంటూ గబగబా జి.యమ్.గదిలోకి వెళ్లేడు.

చిలకలదానుకి నిలువెల్లా ఆవేశం రావడంవల్ల అతని నోటినించి మాటలూ అదే స్థాయిలో వచ్చేయి. జి.యమ్.గారు అతను చెప్పిందంతా శాంతంగా విన్నారు. అంతకంటే శాంతంగానే జవాబు చెప్పేరు.

''మీరు నిన్న వివరించిందాకా ఆ రంగారావు అంత దుష్టుడని నాకు తెలియదు. అందుకే అతనికి శిక్ష విధించేను''

''ఇది శిక్షా? మీకేమైనా మతిపోయి మాట్లాడుతున్నారా?''

''లేదు. నిన్న వరకూ నిజంగానే నా మతిపోయి ప్రవర్తించేను. అందుకే ఇంత స్వామిభక్తులు, నమ్మినబంటులూ అయిన మిమ్మల్ని గుర్తించలేకపోయేను. నా మీద మీకున్న అభిమానాన్ని గ్రహించలేకపోయేను. అలాగే ఆ రంగారావు నా పట్ల ఎంత దుర్మార్గంగా ప్రవర్తించేదో కూడా తెల్సుకోలేకపోయేను. దుష్టులను దూరంగా వుంచాలని పెద్దవాళ్ళు చెప్తారు. అందుకే, ఆ దుష్టుడికి ప్రమోషన్ ఇచ్చి అనకాపల్లికి తన్ని తోసేస్తున్నాను. ఇప్పుడువాడు నా విషయంలోగాని, నా రెండో ఫేమిలీ విషయాల్లోగాని వేలుపెట్టమనండి చూద్దాం. వాడు అనకాపల్లిలో నా గురించి ఏమీ వాగడు. వాగినా నాకు వినిపించదు''

అతను ఇస్తున్న సంజాయిషీకి చిలకలదాను పిడికెళ్లు బిగుసుకున్నాయి. ఏ క్షణాన అతన్ని చావగొట్టేస్తానో అని దానుకే సందేహం వచ్చి, కావాలనే రెండు చేతుల్ని పేంటు జేబుల్లో పెట్టేసుకున్నాడు. అప్పుడు ధైర్యంగా అడిగేడు.

''రంగారావు దుష్టుడు కాబట్టి అతనికి ప్రమోషన్ ఇచ్చి దూరంగా పంపేస్తున్నారు. దానికి మీరు శిక్ష అని పేరు పెట్టేరు. మరి నేను మంచివాణ్ణని, మీ విధేయుణ్నని మీరే ఒప్పుకున్నారు. మరి నాకు మీరిచ్చే వరం ఏవిటి?''


జి.యమ్. నవ్వేడు 'చూడండి చిలకలదానుగారూ! మీకు రామాయణం బాగా తెలుననుకుంటాను. ఆ రామాయణం మొత్తం మీద ఎటువంటి లోపమూలేని ఒకే ఒక్క కేరక్టర్ ఎవరో తెలుసా? హనుమంతుడు. రాముడికి ఎక్కువ సాయం చేసింది కూడా హనుమంతుడే! అలాంటి హనుమంతుడికి రాముడు ఏమని వరం ఇచ్చేడు? చిరంజీవిగా వుండమన్నాడు. తను అవతారం చాలించేదాకా తన అందర్లోనే వుండమన్నాడు. రామపట్టాభిషేకం ఫొటో మీరు చూసేవుంటారు. తన తమ్ముళ్ళు ముగ్గురితో సమానమైన గౌరవాన్ని శ్రీరాముడు హనుమంతుడికి ప్రసాదించేడు''

ఆ మాటలేవీ చిలకలదాను చెవులకి ఎక్కడంలేదు. వీడు శ్రీరాముడు కాకపోయినా నన్ను హనుమంతుడిగా మార్చి, వీడు ఇక్కడనించి పోయేదాకా, తన కాళ్లకింద నూపర్నెంటుగా తొక్కిపెట్టాలని చూస్తున్నాడన్నమాట! వున్న ఒక్క మేనేజరు పోష్టూ ఆ రంగారావుగాడికి పోయింది. నన్ను జీవితాంతం ఇక్కడే, ఇలాగే వుంచాలన్న వీడి కుతంత్రమూ తెల్సిపోయింది కాబట్టి ఇంక వీడికి భయపడ్డమూ అనవసరమే! విధేయుడిగా వుండడమూ అనవసరమే! ఏమైతేనేం, రంగారావుగాడి మీద చెడు చెప్పడంవల్ల నేనే నష్టపోయేను. ఇదంతా ఆ సుబ్బయ్యనాయుడి సలహా వల్ల వచ్చింది! వాడి సంగతివాళ తేల్చేస్తాను'' అనుకుంటూ గబగబా బైటికి నడిచేడు.

ఆఫీసు హాల్లో రంగారావు గబగబా వచ్చి దాను రెండు చేతులూ పట్టుకుని ''నాకంటే మీరు పెద్దవారు. దేవుడిదయవల్ల నాకు ప్రమోషన్ వచ్చింది దయచేసి నన్ను దీవించండి'' అన్నాడు సిన్సియర్‌గా. ''మీకు ప్రమోషన్ ఇప్పించింది ఆ దేవుడు కాదురా ఫూల్, నా బుద్ధి తక్కువ తనం వల్లే నీకు ప్రమోషన్ వచ్చింది'' అని అందామనుకుంటూనే అనలేక ఆగిపోయేడు. ''ఐ విష్ యూ ఆల్ ది బెస్ట్'' అంటూ షేక్‌హేండ్ ఇచ్చేడు.

★ ★ ★

చిలకలదాను ఇంటికొచ్చేసరికి ఇంటి దగ్గర ఓ! పాతిక మంది దాకా జనం వున్నారు. వాళ్లముందు పవన్‌కుమార్ తను ప్రేక్టీస్ చేసిన బ్రేక్‌డేన్స్ చేసి చూపిస్తున్నాడు. వాళ్లంతా అతన్ని అభినందించడానికి వచ్చేరు. వరలక్ష్మి పుదయంనించి సాయింత్రందాకా చాలా ఇళ్లకెళ్లి మా ఆయన బ్రేంచి మేనేజరుగా ప్రమోట్ అవుతున్నారు. అంటూ వాళ్లని ఆహ్వానించింది. ఆ విషయం తెలిసి, దాను ఎంతో ప్రయత్నం మీద తనకొచ్చిన కోపాన్ని నిగ్రహించుకున్నాడు. ''సారీ, ఇంకా ఆర్డర్సు చేతికందలేదు'' అంటూ వారిని పంపించేసేడు. ఇవాళ భారీఎత్తున పార్టీ ఇస్తానన్నాడుకదాని సుబ్బయ్యనాయుడు తన అసిస్టెంటుతో సహా హుందాగా కనిపించేదుస్తులు వేసుకుని వచ్చేడు. అతను వచ్చీరాగానే పార్టీ గురించి అడిగేడు. అడిగీ అడగ్గానే అతన్ని ఫెడీమంటూ లెంపకాయకొట్టేడు.

సుబ్బయ్యనాయుడు నివ్వెరపోయేడు.

వరలక్ష్మిగూడా ఆశ్చర్యపోయింది. ''మీరేం ఆశ్చర్యార్థకాలు, ప్రశ్నార్థకాలు వ్యక్తం చేస్తూ పూరికే ఫీలింగులు ఇచ్చెయ్యకండి'' అంటూ చిలకలదాను జరిగినదంతా చెప్పేడు.

''అసలు నేను నా జీవితంలో ప్రమోషన్ పొందలేకపోయేనంటే, అందుక్కారణం నువ్వే నువ్వే'' అని అరుస్తూ నాయుడి మీద కలబడి, కరిచేసినంత పనిచేసేడు. నాయుడు దెబ్బ తగిలిన చెంపని ఓ చేత్తో నిమురుకుంటూ అన్నాడు.

''ఇది నా సలహాల తప్పుకాదు బావా. నీకు సుడీ లేదు, సమర్థతాలేదు. చేతకాని వాడి చేతికి వజ్రాయుధాన్నిస్తే దాంతో వంకాయలు కోసుకుంటాడు తప్ప విరోధుల్ని సంహరించలేడు. అసమర్థుడికి ఆవేశం ఎక్కువగానూ, ఆలోచన తక్కువగానూ వుంటుంది. ఆ రెండు లక్షణాలూ పుష్కలంగా వున్నాయి నీలో''

''నోర్మూయ్, నేనేం అంత తెలివి తక్కువవాణ్ణి కాదు. నాకూ తెలివితేటలున్నాయి'' పౌరుషంగా అన్నాడు దాను.

''కర్ణుడికీ ప్రతాపంవుంది. కానీ యుద్ధంలో గెలిచే సుడిలేదు. అతను చేసిందాన్ని దురదృష్టవంతుడి పోరాటం అంటారు. నువ్వు చేసిందాన్ని అసమర్థుడి పోరాటం అంటారు. మీ చేతుల్లో వజ్రాయుధమే కాదు, చివరకి విష్ణుచక్రం వున్నా అది చిన్న పిల్లలు ఆడుకునే ఆటవస్తువుగానే వుపయోగపడుతుంది తప్ప దాంతో మీరు యుద్ధాలు గెలవలేరు. ఎందుకంటే మీ ఇద్దరకీ సుడిలేదు. దాన్ని నేను గీయలేను''

ఆ తర్వాత ఆ సంభాషణ ముందుకు సాగలేదు. సాగాలంటే సుబ్బయ్యనాయుడు చెప్పిన స్టేట్మెంట్‌ని ఎవరైనా ఖండించాలి. అంత సాహసం మరెవరికీ లేకపోయింది.

విష్ణుమూర్తి తన సుదర్శన చక్రాన్ని విసిరినప్పుడు అదైనా కారణాంతరాలవల్ల మధ్యలో ఎక్కడైనా ఆగుతుందేమోగాని, కాలచక్రానికి మాత్రం అలాంటి అవరోధాలుండవు. అది




ఎప్పుడు తన ప్రయాణాన్ని ఆరంభించిందో గాని అప్పట్నించి ఇప్పటిదాకా అది ఎక్కడా ఆగకుండా నిరంతరం ముందుకు పయని స్తూనే వుంది. ఈ భూతలం మీద జరిగే యుద్ధాలు, వుప్పెనలు, వుపద్రవాలు, భూ కంపాలు ఇలాంటి సంక్షోభాలు దేనికీ అది చలించలేదు. క్షణంపాటు ఆగలేదు. మానవు లకొచ్చే సుఖ దుఃఖాలని, సంభవించే జనన మరణాలని అది పట్టించుకోదు. గడిచిపోయిన రోజుల్ని తన గుండెల్లో దాచేసుకుంటూ, భవి ష్యత్తుకి కావాల్సిన ఒక్కో రోజుని ప్రసవించు కుంటూ పోవడం దాని ధర్మం, దాని లక్ష్యం.

చిలకలదాసు జీవితంలో ఏర్పడిన నిరాశని కూడా పట్టించుకోకుండా ముందుకు సాగిపో తోంది. దాసు నిరాశతో నిట్టూర్పులు విడవడం తప్ప ఈ మధ్యకాలంలో మరో పనేదీ చేబట్టలే దు. వస్తుంది, వచ్చేస్తుందీ, వచ్చేసిందీ అను కునే ప్రమోషన్ కాస్తా చెయ్యిజారిపోయేసరికి దాసులో ఓ విధమైన విరక్తి కలిగింది. తనని కాదని రంగారావుకి ప్రమోషన్ ఇవ్వడం, అదీ ఆ రంగారావుని దుష్టుడని గుర్తించి కూడా జి.యమ్.గారు ప్రమోషన్ ఇచ్చెయ్యడం, ఈ ఇరవై ఒకటో శతాబ్దం మొత్తం మీద చెప్పుకోద గ్గ ఘోరమైన అన్యాయంగా భావించేడు. ఇంక ఈ కలియుగం అంతమైపోడానికి ఓ మూడు నెలలో, ఆరు నెలలో పడుతుంది తప్ప అంతకంటే ఎక్కువ టైము పట్టదని గూడా అనేసుకున్నాడు. కానీ అతనలా అనుకోవ డంలో ఓ చారిత్రకమైన సత్యాన్ని మర్చిపోయే డు. శ్రీరాముడంటే ఎవరు? సాక్షాత్తు శ్రీమహావి ష్ణువే! అలాంటి దేవుడు రాముడిగా భూమ్మీద అవతరిస్తే, అతని భార్యనే రావణాసురుడు అపహరించుకుపోయేడు. అప్పుడు చాలా మంది విజ్ఞులు ఏమనుకున్నారంటే, ఇంత ఘోరం జరిగింది కాబట్టి ఈ ప్రపంచం మీదకి ఏ ప్రళయమో వచ్చి మొత్తం లోకమంతా అంతమైపోతుందనుకున్నారు. కానీ వాళ్ళు అనుకున్నట్టుగా ఏమీ జరగలేదు. ఈ లోకం కొనసాగుతూనేవుంది. అది త్రేతాయుగం! ఆ తర్వాత యుగంలో ద్రౌపదిలాంటి కులసతిని నిండుసభలో వస్త్రహీనని చేయబోయేరు. ఓ పతివ్రతనే వల్లిగ్గా అవమానించజూసేక ఈ లోకం మీద పిడుగుల వర్షం కురిసి, సృష్టి సమస్తం సమాప్తమవుతుందనుకున్నారు. కానీ అలా ఏమీ జరగలేదు! అది ద్వాపరయుగం! దైవ సమానంగా చూడాల్సిన తల్లిదండ్రుల్ని ఔరంగజేబు రాజ్యకాంక్షతో కారాగారంలో బంధించి, బాధలు పెట్టినప్పుడుగూడా, ఈ దేశానికేదో పోయేకాలం వచ్చిందనుకున్నారు. కానీ రాలేదు. కాలం సజావుగానే సాగుతోంది. మొన్న మొన్న ఏడేళ్ళక్రితం, దేశానికి ప్రైమ్ మినిస్టరయిన ఇందిరాగాంధీని ఎవరో బహిః శ్శత్రువులు కాకుండా ఆమె అంగరక్షకులే పట్టపగలు అమానుషంగా హత్యచేసినప్పుడు, కంటిని కాపాడవలసినరెప్పలే, కంటిని కాటువే స్తే ఇంక కంటిని కాపాడేదెవరు, ఈదేశానికేదో మాయ రోగం వచ్చిందనుకున్నారు. కానీ, దేశా నికి ఏ రోగమూ రాలేదు. తుళ్ళుతూ ఆడుతూ హుషారుగానేవుంది. అలాంటిది, చిలకలదా సులాంటి ఒకానొక సగటు క్లాస్ త్రీ వుద్యోగస్థుడి కి ప్రమోషన్ రాకపోతే భూమండలం రెండుగా చీలిపోతుందా? చీలిపోతుందనే చిలకలదాసు అనుకున్నాడు. అది ఆయన పరిణతిచెందిన మూర్ఖత్వానికి నిదర్శనం.



ఆయన మూర్ఖత్వం, నిరాశ నిస్పృహలు వేటిస్థానంలో అవి క్షేమంగా వుండగా అతని ఇంట్లో మరికొన్ని విచిత్రాలు జరిగేయి. అతని కొడుకు పవన్‌కుమార్‌కుండే సినిమా హీరో కావాలనే కాంక్ష తల్లి ప్రోద్బలంతో పెరిగిందే గాని, తండ్రి మందలింపులతో మరణించలే దు. రంగురంగుల సినిమారంగం అతన్ని వెయ్యి శృంఖలాలతో కట్టి, తనవైపు లాగు తుంటే, దాన్ని నిరోధించేశక్తి ఎవరికీ లేకపో యింది. ఓ సినిమా కంపెనీవాళ్ళు పదివేలు తీసుకొచ్చి పెట్టుబడి పెడితే హీరో వేషం

ఇస్తామని ఆశ చూపేరు. రూపాయిచ్చి టిక్కెట్టుకొంటే పదిలక్షలు వస్తాయని ఆశపడి లాట్రీ టిక్కెట్టు కొనేవాడికి, అలా ఆశపడ్డం తప్పు, దురాశ దుఃఖానికి చేటూ అని ఎవరైనా చెప్తే వాణ్ణి చెప్పుతో కొడతాడేగాని తన ప్రయత్నాన్ని మానుకోడు. పవన్‌కుమార్ పరిస్థితి అదే అయింది. మునుపైతే అతని తండ్రి, సినిమా విషయం ఎత్తినప్పుడల్లా కాస్తయినా కోప్పడేవాడు. కానీ ప్రస్తుతం చిలకలదాసులో ఏర్పడిన నిరాశా, నిర్వేదాలవల్ల ఇంట్లో ఎవరెవరు ఏం చేస్తున్నారో అతనికి తెలియడంలేదు. వాళ్ల సంగతి వదిలెయ్యండి. ఈమధ్య అతనేం చేస్తున్నాడో అతనికే తెలియడంలేదు. వరలక్ష్మికైతే, తన కొడుకు సినిమా హీరో కావాలనే వుంది. ఆవిడ పవన్‌కుమార్ దృష్టిలో చాలా ఉత్తమురాలు. కానీ పదివేలు ఇచ్చి ప్రోత్సహించగల అశక్తురాలు. అసమర్థుల మంచితనంవల్ల ఎవరికీ ఎటువంటి ప్రయోజనమూ వుండదు. చీటీల తాలూకు డబ్బు అయితే ప్రతినెలా మొదటివారంలో ఓ పదిహేనువేలు ఆవిడ చేతిలో వుంటుంది. కానీ బేంకి కేషియర్ చేతులమీద ఎన్ని లక్షలు డిస్పోజ్ అయినా, ఆ డబ్బుమీద అతనికే హక్కూ వుండనట్టు, చీటీ ఎత్తే సొమ్ముమీద ఆవిడకేం హక్కుండదు. చీటీ పాటలో సభ్యులైన వాళ్లదగ్గర డబ్బు కలెక్ట్‌చేసి, ఆ నెల చీటీ పాడుకునేవాళ్లకి చ్చెయ్యడంవరకే ఆవిడ బాధ్యత. తన అక్క రత్నకుమారి ఒంటిమీద ఈమధ్య మునుపటికంటే ఎక్కువ నగలు మెరుస్తున్నాయి. వాటిని తాకట్టు పెట్టి, నా జీవితాశయానికి పెట్టుబడి పెట్టక్కా అంటూ అక్కని రిక్వెస్టు చేశాడు. ఆమె కాదనలేదుగాని తమ్ముడి కోరిక వినగానే పగలబడి నవ్వింది. తర్వాత తనకున్న శక్తినంతా ఉపయోగించి దుఃఖరసం కూడా ఒలకబోసి- "ఇవి గిల్టునగలు తమ్ముడూ మనం చిలకలదాసుగారి సంతానంరా. నా బ్రతుక్కిన్ని బంగారునగలు కూడానా?" అంది. అంతే... చెప్పింది తప్ప ఈమధ్య ఎటువంటి పబ్లిసిటీ లేకుండా, ఆ వార్డు కార్పొరేటర్ చిట్టితల్లి కొడుకు ప్రేమలోపడ్డానన్న విషయం మాత్రం చెప్పలేదు.

ఆ నెల మొదటివారంలో వరలక్ష్మి చీటీ పాట తతంగం పూర్తిచేసింది. చీటీ పాడుకున్న రాజ్యలక్ష్మిగారికి వారంరోజుల్లోగా చీటీ డబ్బు కలెక్ట్‌చేసి అందించాలి. కూతురు రత్నాన్ని చీటీ డబ్బు కలెక్షన్‌కి పంపించింది. డబ్బు వచ్చింది. ఆ రోజు శుక్రవారం కాబట్టి ఆరోజు ఇంట్లోనించి డబ్బుతీసి మరొకరికి ఇవ్వకూడదనే సెంటిమెంటు వరలక్ష్మికి వుంది కాబట్టి, ఆరోజుకి బీరువాలో దాచి మర్నాడు ఇద్దామనుకుంది. కానీ సినిమా హీరో కావాలనుకున్న పవన్‌కుమార్‌కి శుక్రవారం సెంటిమెంటు లేదు కాబట్టి, ఆ రాత్రి బీరువాలోనించి పదకొండువేలు తీసుకుని ఇంటినించి పారిపోయేడు. మర్నాడు వరలక్ష్మి లబోదిబోమంటూ గుండెలు బాదుకుని ఏడ్చింది. ఇప్పుడేం చెయ్యాలో దేవుడా అంటూ దొర్లింది, గెంతింది. ఎన్ని చేసినా కొడుకూ రాలేదు. డబ్బూ దక్కలేదు.

"వాడు ఎప్పుడో ఒకప్పుడిలా చేతిదెబ్బ కొట్టి పారిపోతాడని నాకు తెలుసు. వాణ్ణి వెదికి పట్టుకోవాలనుకోవడం నాకిష్టంలేదు. పోలీస్ కంప్లయింట్ ఇస్తే వాణ్ణి నాలుగు తన్ని లాక్కొస్తారు. వాడిని డబ్బు పట్టుకురమ్మన్న ఆ సినిమా కంపెనీ వాళ్లను నాలుగుతన్ని జైల్లో పెడతారు" అంటూ ఆవేశంగా ఓ సలహా ఇచ్చి, తన కొడుకు విషయంలో తన బాధ్యత అయిపోయిందన్నట్టుగా చేతులు దులిపేసుకున్నాడు చిలకలదాసు. వరలక్ష్మికి అతనిమీద కోపం వచ్చినా, దాన్ని ప్రదర్శించడానికది సమయం కాదని వూరుకుంది. సుబ్బయ్యనాయుడు వచ్చి, సమస్యనయితే పరిష్కరించలేదుగాని తక్షణకర్తవ్యం గురించి సలహా మాత్రం ఇచ్చేడు.

"వెంటనే బావచేత పి.ఎఫ్.లోన్ పెట్టించి, ఆ డబ్బుని ఆ రాజ్యలక్ష్మిగారికి గప్‌చిప్‌గా ఇచ్చెయ్యక్కా. లేకపోతే రేపట్నించి నీ దగ్గర ఎవరూ చీటీలు వెయ్యరు. వెయ్యకపోగా నీమీద చాలా బేడ్ ప్రోపగాండా చేస్తారు. ఇంక నీ కొడుకంటావా? పట్టుకెళ్లిన డబ్బుని ఆ కంపెనీవాళ్లు లాక్కుని, వాణ్ణి ఖాళీ అయిపోయిన విస్కీసీసాలా వీధిలోకి విసిరేస్తే దొర్లుకుంటూ మళ్లీ ఇక్కడికే వస్తాడు" అన్నాడు.

"అంతేనంటావా తమ్ముడూ" అంది వరలక్ష్మి ఏడుస్తూ.

"ఇలాంటి కేసుల సంగతి అంతే అక్కా...

అయినా ఇంట్లోనించి ఆడపిల్ల ఎవర్తోనైనా లేచిపోతే, లబోదిబోమని ఏడవాలి. అంతేగాని గొడుగేదెలా ఎదిగిన కొడుకు సినిమా ఫీల్డుకి పారిపోతే ఇంతలా ఏడవడం అనవసరం'' నాయుడు చేసిన ఓదార్పు వరలక్ష్మిమీద బాగానే పనిచేసింది. కానీ చిలకలదానుమీద పనిచేయడానికే కాస్త టైము పట్టింది. ''నేను ఫి.యఫ్.లోను పెట్టను. పెట్టినా ఆ డబ్బును నీ చీటీ డబ్బుకింద ఖర్చుచెయ్యను. నువ్వూ నీ కొడుకూ చేసిన తప్పుకి శిక్ష నేను అనుభవించాలా?'' అంటూ సీరియస్‌గా చెప్పేశాడు దాసు. అతనలా తప్పుకుంటే వరలక్ష్మేం మౌనంగా వూరుకోలేదు. ''ఏం మీరు ప్రమోషన్, ప్రమోషనంటూ దాదాపు ఏడువేల చిల్లర బూడిదలో పోసేసినా, నేను అక్కడ అప్పుచేసి, ఇక్కడ అప్పుచేసి నా ఇంటిని లాక్కొచ్చేను. అంతే తప్ప మా సంగతేవిటి, మమ్మల్నెలా పోషిస్తారూ అని మిమ్మల్నెప్పుడైనా నిలదీసేనా? ఇప్పుడు నాకు పదిహేనువేలు కావాలంటే, ఏమీ పట్టనట్టు మాట్లాడతారా?'' అంది. అయినా చిలకలదాను ఒప్పుకోలేదు. వరలక్ష్మి సుబ్బయ్యనాయుడు సమిష్టిగా తమ శక్తినుపయోగించి అతని మెడలు వంచేసి, ఒప్పించేరు. కూతురు పెళ్లికి తప్ప మరో కారణంమీద పి.యఫ్.లోన్ పెట్టకూడదనుకున్నాడుగాని, అతని నిర్ణయాన్ని పరిస్థితులు మార్చేశాయి.

ఆ సమస్య అలా తేలిందనుకుంటే, వరలక్ష్మికి మరో సమస్య ఎదురయింది. ఓరోజు సుబ్బయ్యనాయుడు తన గర్ల్‌ఫ్రెండుని తీసుకుని సినిమాకెళ్తే చీకట్లో వచ్చి, ముందురోలో ఓ జంట కూర్చుంది. అయిదు నిమిషాల తర్వాత ఆ అమ్మాయి గొంతునిబట్టి ఆమె తన మేనకోడలు రత్నకుమారి అని గుర్తుపట్టి ఆశ్చర్యపోయేడు. చీకట్లో ఆ అబ్బాయి ఎవరో మాత్రం అర్థం కాలేదు. ముఖాన్ని కాస్త ముందుకు పెట్టి కొన్ని నిమిషాలపాటు చూశాక అతను కార్పొరేటరు చిట్టితల్లి కొడుకని గ్రహించేడు. వీళ్లిద్దరికీ ఎలా కనెక్షన్ కుదిరిందో అతనికి బోధపడలేదు. కొన్ని వందలమంది వచ్చే సినిమాహాల్లోకి ఇంత ధైర్యంగా వచ్చేరంటే వాళ్ల పరిచయం బాగా ముదిరిపోయిందని మాత్రం అర్థం చేసుకున్నాడు. సినిమాహాల్లోనే నిలదీసి అడుగుదామని ఆవేశపడ్డాడు. కానీ ప్రస్తుతం తనున్న పరిస్థితి బాగులేదు. తను ఎవరో కిరాయి ఆడదాన్ని వెంటేసుకొచ్చి సినిమా చూస్తూ, తన మేనకోడలు ఎవర్తోనో వచ్చినందుకు కోప్పడితే చాలా దరిద్రంగా వుంటుందనుకుని తమాయించుకున్నాడు. అయినా తను ముప్పయిఅయిదేళ్లొచ్చిన ముదురుకేసు. అలాంటి తనే ఓ కిరాయి మనిషితో వచ్చినందుకు సిగ్గుపడుతూ సంశయిస్తుంటే పెళ్లికాని తన మేనకోడలు ఇంతకు తెగించడం అతనికి నిజంగా బాధ కలిగించింది. ఈ సంగతేదో సీరియస్‌గానే తేల్చుకోవాలి. రేపు తను సీరియస్‌గా మాట్లాడాలంటే ఇప్పుడా అమ్మాయికి కనబడకూడదు. ఇంట్రెవెల్ మరో అయిదు నిమిషాలకిస్తారనగా తను తీసుకొచ్చిన అమ్మాయితోసహా లేచి గబగబా హాల్లోనించి బయటకు వెళ్లిపోయేడు.

మర్నాడు ఉదయం చిలకలదాను ఆఫీసు కెళ్లిపోయిన అరగంట తర్వాత సుబ్బయ్యనాయుడు ఆ ఇంటికి వెళ్లేడు. ఈ విషయం దాసుకి తెలియడం నాయుడికిష్టం లేదు. ఎందుకంటే ప్రమోషన్ విషయంలో దెబ్బతిని, ఇంట్లోనించి కొడుకు పారిపోవడంతో మరో దెబ్బతిని మానసికంగా బాధపడుతున్న దాసుకి ఈ విషయం కూడా చెప్పి బాధపెట్టే బదులు, ఇదేదో ఓ కొలిక్కి వచ్చేక చెప్పడం మంచిదనుకున్నాడు. నాయుడు చెప్పింది విన్నాక ఆవిడకి సహజంగానే ఆవేశం కలిగింది. ఇదంతా మీ బావవల్లే వచ్చిందంటూ దానుమీద ధ్వజమెత్తబోయింది.

''ఇందులో బావేం చేశాడు?'' అడిగేడు నాయుడు.

''చీటీ డబ్బు వసూలు చేసుకురావయ్యా మహానుభావా అంటే, అందరూ అతన్ని చీటీల వరలక్ష్మి మొగుడని పిలుస్తున్నారట. ఆయనగారికి అలకొచ్చి వెళ్లడం మానేశాడు. దాంతో మన రత్నాన్ని పంపించాల్సొచ్చింది. అదేమో ఇంత నిర్వాకం చేసింది'' అంటూ కూతుర్ని వీపుమీద దభీదభీమంటూ నాలుగు దెబ్బలు వేసింది. నాయుడు ఆవిణ్ణి అడ్డుకుని రత్నాన్ని మరో గదిలోకి పంపించి వరలక్ష్మికి తరుణోపాయం ఉపదేశించేడు. ''రత్నం ఆ అబ్బాయీ ప్రేమించుకున్నారు. ఒక వార్డులో, ఒక వీధిలో వున్నప్పుడు ఆ మాత్రం ప్రేమించుకోవాలనిపించడం సహజమే. అబ్బాయి కూడా

మంచివాడే అని ఇప్పుడు అన్ని ఎంక్వయిరీ లుచేసి వస్తున్నాను. ఆ అబ్బాయి తల్లిదండ్రు ల్తో మాట్లాడి చూద్దాం. వాళ్లు ఈ పెళ్లికి ఒప్పు కుంటారనే నా నమ్మకం. ఆ ఇంట్లో చిట్టితల్లి గారి మాటే చలామణీ అవుతుంది. ఇంక ఆవిడ భర్త వున్నాడంటే, పెళ్లాంపాడే పాటలకి హార్మనీ వాయించేవాడేగాని అడ్డు చెప్పేవాడు కాదు. అంచేత మనం వెళ్లి పెళ్లి ప్రస్తావన ఎత్తకుండా, ఇలా ఇలా జరుగుతోంది కాబట్టి ఎలా ఎలా చేస్తే బావుంటుందీ అని అడిగిచూద్దాం''

తమ్ముడు చెప్పింది వరలక్ష్మికి నచ్చింది. చిట్టితల్లి కార్పొరేటరు కాకముందునించీ ఆ కుటుంబం సంగతీ, ఆ అబ్బాయి సంగతీ ఆవిడకు తెలును. ఆ సంబంధం కుదిరితే అది తనకి అదృష్టమే అవుతుంది. అలా అని ఆవిడ అనుకుందిగాని చిట్టితల్లి మాత్రం అనుకోలేదు. వాళ్లు చెప్పిన విషయం వినగానే చిట్టితల్లి ముఖం చిట్లించింది. ఇది రికార్డులో కెక్కవలసిన విషయం కాదన్నట్టుగా చూసి, గబగబా వెళ్లి తలుపులు, కిటికీలు వేసొచ్చింది.

"ఇలా జరుగుతున్నట్టు నాకు తెలీదు. ఎందుకంటే నేను గౌరవనీయమైన కార్పొరేటరు హోదాలో వున్నాను కాబట్టి నాకు ఇలాంటి విషయాలు తెలుసుకునే తీరికుండదు. మీ వీధిలో లైట్లు వెలక్కపోతే చెప్పండి వెలిగిస్తాను. కుళాయిల్లోనించి నీళ్లు రాకపోతే చెప్పండి. రోజుకో లారీతో నీళ్లు పంపిస్తాను. ఇంకా ఏం కావాలన్నా చెప్పండి. ఏర్పాటు చేస్తాను. ఎందుకంటే నేనీ వార్డుకి కార్పొరేటర్ని కాబట్టి. అసలు కార్పొరేటరంటే ఏవిటో తెలుసా? దాదాపు ఓ సామంతరాజన్నమాట. నా వార్డులో ఉన్నవారంతా నా ఏలుబడిలో వున్న ప్రజానీకంలాంటి వారు. మీలాంటి వాళ్లకి ఇబ్బందులొస్తే అంటే, శానిటేషన్‌కి సంబంధించిన ఇబ్బందులొస్తే తొలగించడం నా బాధ్యతగాని మీ అమ్మాయిని మా ఇంటి కోడల్ని చేసుకోవడంలాంటి ఇబ్బందికరమైన మాటలు చెప్పి నన్ను బాధ పెట్టకండి. ఎందుకంటే నేను కార్పొరేటర్ని'' ఇలా ఆ చిట్టితల్లి నాలుగు వాక్యాలకోమారు నేను కార్పొరేటర్ని, కార్పొరేటర్ని అని చెప్పు కుంటూ అహం ప్రదర్శించడం వరలక్ష్మికీ నచ్చలేదు. సుబ్బయ్యనాయుడికీ నచ్చలేదు. నాయుడు ఆమెను ఒప్పించడానికి తన యధాశక్తి ప్రయత్నించాడు.

"చూడండి చిట్టితల్లిగారూ ఇప్పుడు మీరు కార్పొరేటరు కావచ్చు. రేపు మీరీ నగరానికి మేయర్ అవొచ్చు. కానీ ఈ పదవులు శాశ్వతం కాదుగదా. మీ అబ్బాయి, మా మేనకోడలూ ఒకర్నొకరు ప్రేమించుకుంటున్నారు. మీ పదవి సంగతి పక్కనబెడితే మేం మీతో సంబంధం కలుపుకోవడానికి ఏవిధంగానూ తీసిపోం''

చిట్టితల్లి గఁయ్‌మంటూ లేచింది "పదవి సంగతి పక్కనబెట్టమనడంలో మీ ఉద్దేశమేమిటి?'' అంటూ యమసీరియస్‌గా అడిగింది.

"పదవులు ఇవ్వాళ వుంటాయి. రేపు పోతాయిగదా''

"నా విషయంలో అది నిజంకాదు. ఈ వార్డుకి ఇప్పుడూ నేనే కార్పొరేటర్ని. రేపు వచ్చే ఎలక్షన్‌లోనూ నేనే కార్పొరేటర్ని''

ఇలా సాగింది వాదన. వరలక్ష్మి మాటల్లో ఆడపిల్ల తల్లి ఆవేదన ధ్వనించగా, చిట్టితల్లి మాటల్లో నేను కార్పొరేటర్ని, మీరు ఆఫ్టరాల్ నా వార్డులోని ప్రజలు, ఎప్పుడైనా నా అవసరం మీకుంటుందిగాని, మీ అవసరం నాకేవిటి వుంటుంది అనేగర్వం, అవహేళన ధ్వనించాయి. కాస్సేపటి తర్వాత పెళ్లి విషయం పక్కకిపోయి నువ్వెంతా? అనుకుంటే నువ్వెంతా? అనుకునే లెవెల్లో ఇద్దరు ఆడవాళ్ల మధ్యా మాటలు చెలరేగాయి. చివరికి పెళ్లి విషయం ఎటూ తేలకుండానే గొడవలు, ఘర్షణల మధ్య వరలక్ష్మి నాయుణ్ణి తీసుకుని వెళ్లిపోయింది. చిట్టితల్లి కొడుకు జరుగుతున్న గొడవని ఏదో టి.వి. ప్రోగ్రాం చూసినట్టుగా చూస్తూ నిలబడ్డాడు. "నువ్వా వరలక్ష్మి కూతురితో తిరిగినా, మాట్లాడినా నేనూరుకోను. నువ్వో మేయర్ కూతుర్ని ప్రేమించు ఒప్పుకుంటాను. ఓ ఎమ్మెల్యే కూతుర్ని ప్రేమించు ఒప్పుకుంటాను. ఓ మినిష్టరు కూతుర్ని లేవదీస్కురా. మీ ఇద్దరికీ నేను దగ్గరుండి పెళ్లి జరిపిస్తాను. అంతేగాని, ఆ వరలక్ష్మి కూతురితో తిరిగేవో, నేనేం చేస్తానో నాకు తెలియదు'' అంటూ కొడుకుని హెచ్చరించింది.

వరలక్ష్మి ఇంటికి రాగానే కూతుర్ని హెచ్చ




రించడంతోపాటు, నాలుగు దెబ్బలూ వేసింది. ఆ తర్వాత క్షణంనించి ఆవిడా, సుబ్బయ్యానాయుడు ఇందాక చిట్టితల్లి ప్రదర్శించిన అహం గురించి, పొగరు గురించీ తీవ్రంగా ఆలోచించేరు.

* * *

కార్పొరేషన్ ఎన్నికలు జరగబోతున్నాయ్.

జి.యమ్.గారింట్లో అతని మామ వరదరాజులు ఓ పదిమంది పెద్దల్ని తన ఇంట్లో హాజరు పరిచి, ఓ ముఖ్యమైన విషయాన్ని చర్చించేడు.

పదిహేడవనెంబరు వార్డు మహిళలకి మాత్రమే కేటాయించబడిన వార్డు. ఆ వార్డు కార్పొరేటరుగా మొన్నటివరకు పనిచేసిన కనకమ్మ, ఎలియాస్ చిట్టితల్లిమీద ఆ వార్డులో ఎటువంటి మంచి అభిప్రాయమూ లేదు. ఈసారి ఆవిడ నిలబడదు. నిలబడినా తప్పకుండా ఓడిపోతుంది. ఇంక నాకుండే ఆసక్తి అనండి, అభిలాష అనండి. నేను ఒక్కసారైనా మంత్రిపదవిలో కెళ్లాలనుకున్నాను. కానీ, నా దురదృష్టంకొద్దీ ఎమ్మెల్యేని కూడా కాలేకపోయాను. ఇక నా సంగతి వదిలెయ్యండి. నా జీవితం ఎలాగూ రాజకీయాలతో ముడిపడలేదు కాబట్టి, కనీసం నా కూతురైనా కార్పొరేటర్ వ్వాలని నా ఆశ, నా అభిప్రాయం. మా అమ్మాయి కూడా సోషల్‌సర్వీస్ కోసం కృషిచేసే మనిషే. రాజకీయాల్లో ప్రవేశించి, ఎంతో కొంత ప్రజాసేవ చెయ్యాలనే ఆసక్తితో వుంది. మా అల్లుడు కూడా మా అభిప్రాయాన్ని, ఆశయాల్నీ ప్రోత్సహించేవాడేగాని వద్దనేవాడు కాదు. అంచేత ఈసారి పదిహేడోనెంబరు వార్డుకి పోటీ చేయిద్దామనే మీ అందరి సలహా కోసం ఈ సమావేశం ఏర్పాటు చేసేను'' అన్నాడు వరదరాజులు.

పెద్దమనుషులు వాళ్లకి అందించిన స్నాక్సు తింటూ, కూల్‌డ్రింక్సు తాగుతూ తమ తమ అభిప్రాయాల్ని తెలియజేసేరు. పదిమందీ పదిరకాల అభిప్రాయాలు చెప్పలేదు. ఒకే అభిప్రాయాన్ని పదిగొంతుల్తో వినిపించేరు "మీ అమ్మాయిగారికి విద్య, సంస్కారం, ప్రజాసేవాతత్పరత వున్నాయి. అన్నింటికీ మించి ఎలక్షన్లో అవసరమైనమేరకు ఖర్చు చేయగల ఆర్థికస్తోమతుంది. అలాంటప్పుడు మీకు తిరుగేంవుంది. మీరు మీ అమ్మాయిని నిలబెట్టండి. మేం తలా ఓ చెయ్యివేసి మద్దతు ఇస్తాం'' వారి మాటలతో సరస్వతీదేవీ సంతోషించింది. ఆవిడ సంతోషించడం చూసి జి.యమ్.గారూ సంతోషించేరు. ఆ సంతోషాన్ని కాస్త అదుపు చేస్తూ ఓ పెద్దమనిషి ఓ మాటన్నాడు.

"సరస్వతీదేవిగారు కార్పొరేటరుగా ఎన్నికైతే ఆ వార్డు ప్రజలు అదృష్టవంతులయ్యే మాట నిజమే. కానీ ఆ వార్డులో గెలవడం మనం అనుకున్నంత సులభం కాదు. ఎందుకంటే ప్రస్తుతం సిట్టింగ్ కార్పొరేటర్ చిట్టితల్లి చాలా గడుసుమనిషి. ఇంటింటికి వెళ్లి వాళ్ల కాళ్లూ గెడ్డాలు పట్టేసుకుని వదినా, అక్కా, చెల్లీ... అంటూ వరసలు పెట్టి మాట్లాడుతూ చొరవగా వాళ్లల్లో కలిసిపోతుంది. మనం ఆ పని చెయ్యలేం. మీది చూస్తే ఆ వార్డు కాదు. మిమ్మల్ని తెలిసినవాళ్లెవరూ ఆ వార్డులో లేరు. మేం మద్దతు ఇస్తాం అన్నాంగాని, మాలో ఒక్కరూ ఆ వార్డుకి చెందినవాళ్లం కాము. అలాంటప్పుడు మేం ఏవిధంగా మద్దతు ఇస్తాం? మిమ్మల్ని నిరాశపరచడానికి మాట చెప్పడంలేదు. ఆ వార్డులో అందరికీ పరిచయం వున్న పెద్దమనిషెవర్నయినా పట్టుకుని ఈపని ఆయనకప్పగిస్తే అప్పుడాయనకి మేం మద్దతు ఇస్తాం. అలాంటి మనిషి ఎవరైనా వున్నారేమో ఆలోచించండి''

ఈమాట అందరికీ సబబుగా తోచింది. అలాంటి వ్యక్తి ఎవరా? అని ఆలోచించేరు కానీ అలాంటివ్యక్తి ఎవరూ వాళ్లకి తట్టలేదు. వున్నట్టుండి వరదరాజులన్నాడు "సాయిబాబా వీధి ఆ వార్డులోకే వస్తుందా?''

"ఔనండి''

"మరైతే ఇంకేం? మా అల్లుడిగారి ఆఫీసులో పనిచేస్తున్న ఎలకలపూడి చిలకుదాసుగారిది ఆ వీధేనండి. ఓ సారెప్పుడో మాటల్లో చెప్పినట్టు గుర్తు'' అన్నాడు ఏదో ఘనవిజయం సాధించినట్టు పగలబడినవ్వుతూ.

"చిలకలదాసు మా ఆఫీసులో సూపర్నెంటు మాత్రమే కాదండి. నాకు ఒబిడీయంట్ సర్వెంటు కూడాను. నేను నిప్పుల్లో దూకెయ్యమంటే దూకేస్తాడు'' అన్నాడు

జి.యమ్. తన ఆధిక్యతని ప్రతి అక్షరంలోనూ ధ్వనింపజేస్తూ.

"మరైతే ఇంకేం... వెంటనే పిలిపించి మాట్లాడండి. మేం సాయంకాలం వస్తాం" అంటూ పెద్దమనుషులు నిష్క్రమించారు. జి.యమ్. మహాదానందంగా వుంటూ భార్య వైపు చూస్తూ "జయం మనదే" అన్నట్టుగా విజిల్ వేసేడు. ఆమె చిన్నగా నవ్వి ఫోన్ అందుకుని డయల్‌చేసి భర్త చేతికిచ్చి "దానుగార్ని వెంటనే రమ్మనండి" అంది. అతను మాట్లాడేలోగా వరదరాజులు గభీమని ఫోన్ అందుకుని ఠక్కున పెట్టేశాడు. ఏం అన్నట్టుగా చూశాడు అల్లుడు. "నువ్వు దానుకి ఫోన్ చేస్తావు అతను వస్తాడు. నీ మాట కాదనలేక మనకి హెల్ప్ చేస్తానని తల వూపుతాడు. అయితే నిజంగా మన తరవున పనిచేస్తాడా అని నాకో సందేహం" అన్నాడు వరదరాజులు.

"ఎందుకు చెయ్యడు?"

"ఎందుకు చెయ్యాలి? అతను ఇంకొన్నాళ్లలో ఉద్యోగంనించి రిటైర్ అయిపోతాడు. ఆర్యేలోగా బ్రేంచి మేనేజరు ప్రమోషన్ వస్తుందని ఆశపడ్డాడు. కానీ నువ్వా ప్రమోషన్ని రంగారావుకిచ్చేవుగాని దానుకివ్వలేదు. అందుకు ఎంత బాధపడ్డాడో నాకు తెలుసు. మను సరస్వతిని ఎలక్షన్‌కి నిలబెట్టేమంటే అది బంపర్ మెజారిటీతో గెలవాలి తప్ప, మనం నిలబడమనగానే నిలబడ్డం, ప్రజలు రేపు ఓట్లు వెయ్యకుండా కూర్చో కూర్చో అంటే కూర్చుండిపోవడం జరిగితే అది మనకెంత అవమానం?"

"ఊ... నా భార్య ఓడిపోతే నాకు మరీ అవమానం" అంటూ జి.యమ్. మెల్లగా గొణిగాడు.

ఇప్పుడు చిలకలదానుకి ఏదో ఒకటి బెనిఫిట్ చూపిస్తే తప్ప అతను సిన్సియర్‌గా పనిచేయడు. అతని సిన్సియారిటీమీదే గెలుపు ఆధారపడివుంది. కరక్ట్! కానీ ఇప్పుడతనికి ఏ బెనిఫిట్ కలిగించడం? ఈ ఆలోచనతోనే కాస్సేపు గడిపేక జి.యమ్.కి ఏదో ఆయిడియా తట్టింది "శ్రీకాకుళంలో కొత్తగా మా ఆఫీసు బ్రాంచి ఒకటి ఓపెన్ చెయ్యాలనుకుంటున్నాం. ఆ బ్రేంచికి మేనేజరుగా చిలకలదానుని ఎప్పాయింట్ చేస్తాను. ఈ పోస్టుని ఎరవేసి అతనిచేత పనిచేయించుకుందాం" ఈ ఆలోచన అందరికీ నచ్చింది. అప్పటికప్పుడు దానుకి ఫోన్ చేయడం, అతను రయ్‌మంటూ రావడం, అతనికి విషయమంతా వివరించడం జరిగిపోయింది. అంతా విన్నాక గూడా అతని ముఖం జీరోవాల్టు బల్బులాగా నిస్తేజంగానే కనిపించింది. జి.యమ్. అతనికి కొత్త బ్రేంచి గురించి, అందులో అతన్ని మేనేజరుగా వెయ్యడం గురించి చాలా సంతోషంగా చెప్పేడు. అయితే ఆ సంతోషం చెప్పినవాడికే తప్ప, విన్నవాడికి కలగలేదు "ఇప్పుడు కబుర్లు చెప్తున్నారుగాని ఆ టైము వచ్చినప్పుడు మీరు ఇవ్వరన్నట్టు"గా చూసేడు. ఆ చూపులకర్థం గ్రహించి వరదరాజులు గబగబా వెళ్లి గోడకి తగిలించిన వెంకటేశ్వరస్వామి ఫోటో తీసుకొచ్చి అల్లుడి చేతికిచ్చి ప్రమాణం చేయించేడు. తర్వాత దానుచేత మరో ప్రమాణం చేయించేడు.

ఆ ప్రమాణాల సారాంశం ఏవిటంటే, చిలకలదాను తన శక్తింతా ఉపయోగించి, సరస్వతీదేవికి ఓట్లు వేయించాలి. ఆవిడ గెల్చిందన్న ప్రకటన వెలువడిన మరుక్షణం జి.యమ్.గారు అతని చేతిలో ప్రమోషన్ ఆర్డర్సు వుంచాలి.

ప్రమోషన్ కోసం చేసిన యుద్ధంలో ఓడిపోయి, నేలకి ఒరిగిపోతున్నాననే సమయంలో తన చేతికి బ్రహ్మాస్త్రం దొరికినంత ఆనందపడిపోయేడు చిలకలదాను. ఇన్నాళ్లు తనమీద అభిమానంతో జి.యమ్. ప్రమోషను ఇస్తారని ఎదురుచూసి నిరాశపడ్డాడు. ఇప్పుడు అలాంటి అభిమానాల్తో పనిలేదు. వాళ్ల అవసరంకొద్దీ వాళ్లు ఆఫర్ చేస్తున్నారు. ఇప్పుడు చచ్చినట్టు ఇస్తారు అని దాను లోలోపలే అనుకుంటూ ధైర్యపడ్డాడు. వాళ్లక్కూడా ధైర్యం చెప్పేడు "మీరు నిశ్చింతంగా వుండండి. ఆ చిట్టితల్లి ఈసారి కూడా పోటీచేసినా ఆవిడకి డిపాజిట్లు దక్కకుండా చేసేస్తాను. ఆవిడమీద మా వార్డు ప్రజలకి ద్వేషం కలగడం ఒక్కటే కారణం కాదు. ఈ ఎలక్షన్లో నేను రాత్రింబవళ్లు పనిచేస్తాను. మా ఆవిడ నాకంటే ఎక్కువగా కృషిచేస్తుంది. ఆవిడ మా వార్డు అంతటికీ




చీటీల వరలక్ష్మిగా బాగా పాపులర్ అయింది. అంతేకాదు మా వీధిలోగాని, పక్కవీధిలోగాని ఎవరికి పురుడొచ్చినా, ఏ పుణ్యకార్యమొచ్చినా మా ఆవిడ వెళ్లి సాయంచేస్తుంది. అంచేత ఆవిడ మాటకి ఎవరూ ఎదురు చెప్పరు. ఇంకా మా బావమరిది ఉబ్బునిబిల్లి నాయుడున్నాడంటే, తూటాలు లేకుండా తుపాకులు పేల్చగల యోధుడు. విత్తనాలు నాటకుండా మొక్కలు మొలిపించగల యుక్తిపరుడు. వాడూ నేను చెప్పినట్టే పనిచేస్తాడు. అంచేత మేం ముగ్గురం రంగంలోకి దిగేమంటే ఇంక గెలుపు ఎవరిదీ అనే పనేలేదు. మహాభారతంలోని అర్జునుడు మహావీరుడు. పైగా ఆయనకి శ్రీకృష్ణుడి సారథ్యం వుంది. కానీ ఇక్కడ మన మేడమ్‌గారు అర్జునుడి స్థానంలో వుంటే ఆ రథంమీద నాలాంటి కృష్ణుడు, మా ఆవిడలాంటి హనుమంతుడు, మా బామ్మరిదిలాంటి సుగ్రీవుడు ముగ్గురం కలిసి జాయింటుగా ఆ రథం మీదుంటాం'' అతని మాటలకి అందరూ నోళ్లు పెద్దగా చేసుకుని మరీ నవ్వేరు. రేపు ఎలక్షన్ మాట ఎలావున్నా ఇప్పుడు చిలకలదాను చెప్పింది మాత్రం వాళ్లందర్ని గాల్లో తేలించి, గెంతు వేయించింది ''మరైతే మేం రేపు నామినేషన్ వేసేస్తాం'' అన్నాడు జి.యమ్ ఎప్పుడూ లేంది చిలకలదానుని బయట గేటువరకూ దిగబెడుతూ. ''ఓయస్... వేసెయ్యండి'' అంటూ విక్కీమీద ఇంటికి బయలుదేరాడు. దారిపొడుగునా రేపట్నించి ఎలక్షన్‌పనులు ఎలా చెయ్యడమా అని ఆలోచిస్తూనే వున్నాడు.

★ ★ ★

కరెంటు షాక్ కొట్టకుండానే మనిషి కెవ్వుమంటూ అరచి గిలగిల్లాడిపోవడం అప్పుడప్పుడు జరుగుతుంది. అంటే వాళ్ల అనుభవానికొచ్చిన సంఘటనలు విద్యుచ్ఛక్తికంటే పవర్‌ఫుల్‌గా పనిచేసినప్పుడు అలాంటి దిగ్భ్రాంతి కలుగుతుంది. చిలకలదానుకి ఆరోజు అలాంటి సంఘటనే ఎదురై అలాంటి షాకే తిన్నాడు.

ఇంటినిండా జనం వున్నారు. అందరిమధ్యా వరలక్ష్మి కూర్చునివుంది. సుబ్బయ్యనాయుడు అందరికి కూల్‌డ్రింకులు సప్లైచేస్తూ బిజీగా వున్నాడు. దానుని చూడగానే నాయుడు ఆనందంగా ఏదో శుభవార్త చెప్పాలనుకుని, అంతలోనే విరమించుకుని, మళ్లీ డ్రింకులు పంచడంలో నిమగ్నమైపోయేడు.

వరలక్ష్మి భర్తని చూసిందిగాని ఎటువంటి రియాక్షనూ యివ్వలేదు. అక్కడున్న ఓ వ్యక్తి గభీమని లేచి ''కంగ్రాచ్యులేషన్స్ సార్'' అంటూ వచ్చి చిలకలదానుకి అసలు విషయం వివరించేడు.

వరలక్ష్మి ఎలక్షన్లో నిలబడుతోంది!

దానుకి విస్మయం కలిగింది. నిజమేనా? అన్నట్టుగా ఓసారి చూసేడు ''నీ మొఖానికి కార్పొరేషన్ ఎలక్షన్లో నిలబడ్డం ఒకటా? యిదేమైనా నెలవారీ చీటీలు వెయ్యడం అనుకున్నావా? అన్నట్టు మరోసారి చూసేడు. ఎన్నిసార్లు ఎలా చూసినా వరలక్ష్మిలో ఏ మార్పూ కనిపించలేదు. మరో ఆడమనిషి ఏ ఒక్కరితోనో కాకుండా, అందరితోనూ అన్నట్టుగా అంది ''ఆ చిట్టితల్లికి ఓట్లు వేసి గెలిపించేక ఆవిడే దో ప్రైమ్‌మినిస్టర్ ఆఫ్ ఇండియాలాగ పేద్ద ఫోజుపెట్టి మాట్లాడుతోంది. మమ్మల్నసలు మనుమల్లాగే ఖాతరుచెయ్యడంలేదు. అందుకే యీసారి వరలక్ష్మిగార్ని నిలబెట్టి ఆవిడగారి గోరోజనాన్ని వదలగొట్టాలి'' మిగతావాళ్లు ఆవిడ చెప్పిందాన్ని సమర్థిస్తూ మాట్లాడేరు. చిలకలదానుకి అంతా అయోమయంగా వుంది. ఓ పావుగంటక్రితం తను జి.యమ్.గార్కి చేసిన ప్రమాణం ఏమిటి? యిప్పుడు జరుగుతున్న సన్నివేశం ఏమిటి? ఒకాయన మౌనంగా వుండిపోయిన చిలకలదానుని భుజంమీద చెయ్యివేసి కుదుపుతూ ''ఏమిటి దానుగారూ, మీ శ్రీమతిగారు కార్పొరేటరు అవుతారనేసరికి ఆనందంతో నోటమాట రావడంలేదా, అలా మౌనంగా వుండిపోయేరు?'' అన్నాడు.

దాను ఆలోచనల్నించి తేరుకుని, అందరికీ సీరియస్‌గా చెప్పేడు ''అయామ్ సారీ! మా ఆవిడ ఎలక్షన్లో నిలబడుతుందనుకుని మీరంతా అభిమానంగా మాయింటికొచ్చేరు. కానీ, మా ఆవిడ ఈ ఎలక్షన్లో పోటీ చెయ్యడంలేదు''

వరలక్ష్మి కళ్లద్దాలు సవరించుకుంటూ లేచి నిలబడింది. ''నేను పోటీచేస్తున్నాను. వీళ్లందరి కోరికమీద ఎలక్షన్లో పోటీచేస్తున్నాను.





వీళ్ల మద్దతుతోనే గెలుస్తాను'' అంటూ చాలా ఖచ్చితంగా చెప్పింది. ''నేను ఈ యింటి యజమాన్ని. నువ్వు పోటీచెయ్యడం నాకిష్టంలేదు'' అతనూ అంత ఖచ్చితంగానే చెప్పేడు.

''ఎందుకిష్టంలేదు? నేనేమీ తప్పువని చెయ్యడంలేదే?''

''నాకిష్టంలేకుండా నువ్వు పోటీచెయ్యడం తప్పువనికిందే లెక్కవుతుంది''

''అదే, మీకెందుకిష్టంలేదూ అని అడుగుతున్నాను''

''ఆ విషయం పదిమందిలో చెప్పేదికాదు''

''నేను ఎలక్షన్లో నిలబడుతున్నది పదిమందికీ సేవచేయడానికైనప్పుడు మీ అభ్యంతరాన్ని పదిమందిలోనూ చెప్పడానికేం?''

ఇలా వాదన పెరిగింది. చిలకలదాసు తన బాస్‌కిచ్చిన మాట గురించి, అందువల్ల వచ్చే ప్రయోజనం గురించీ చెప్పేడు. దాంతో ఆ వాదనకాస్త ఘర్షణగా మారింది. వరలక్ష్మి, సుబ్బయ్యనాయుడు చాలా ఆవేశంగా మాట్లాడారు. మిగతాజనం వాళ్లకి వంతపాడేరు. ''తనకి మాలిన ధర్మం మొదలుచెడ్డబేరమని సామెత చెప్పినట్టు నీ భార్యని కాదని, ఎవడో ఆఫీసరుగాడి పెళ్ళానికి నువ్వు సపోర్టిస్తావా? వాళ్లని గెలిపించడానికి నువ్వు కష్టపడ్డంకాకుండా, మా అందరిచేతా గొడ్డుచాకిరీ చేయిస్తానని మాట యిస్తావా? ఆయనగారు నీకు బాస్‌కాని, నీ కుటంబంలో వాళ్లందరికీ బాస్‌కాదు. నీకు ప్రమోషన్ యిస్తానని ఆశపెడితే, నువ్వు ఒళ్లూ పైకానకుండా పనిచేసి, వాళ్లావిణ్ణి గెలిపిస్తావని తెలిసే అలా అన్నాడుతప్ప, నీకు నిజంగా ప్రమోషన్ యివ్వాలని కాదు. రంగారావుగాడుత్త దగుల్బాజీ అని తెల్సితెల్సి, వాడికి ప్రమోషన్ యిచ్చి నిన్ను తొక్కిపెట్టేసేడు ఏమిటీ యీ అన్యాయం అని అడిగితే, నీలాంటి మంచివాళ్లు జీవితాంతం నా అండర్లోనే వుండాలి. రంగారావులాంటి పొగరుమోతుల్ని దూరంగా వుంచాలనే అలా చేసేసేనంటూ వెధవ రీజనింగు చెప్పేడు. రేపు నువ్వాడి పెళ్లాన్ని కార్పొరేటరుగా గెలిపిస్తే, అప్పుడు వాడు మరీ సంతోషిస్తాడు. అయినా, అప్పుడు కూడా నీకు ప్రమోషనివ్వడు. ఎందుకో తెలుసా? నీ సామర్థ్యంతో రాజకీయాలే తెలియని ఓ ఆడదాన్ని కార్పొరేటర్ని చేసేయగలిగేవు కాబట్టి యిదే తెలివితేటలుపయోగించి, మా మావ వరదరాజుల్ని కూడా ఎసెంబ్లీ ఎలక్షన్లో గెలిపించి ఎమ్మెల్యేని చేసెయ్, అప్పుడు నీకు ప్రమోషనిస్తానంటాడు. అప్పుడేంచెయ్యగలవు? ప్రమోషను వచ్చినా రాకపోయినా యింకొన్నాళ్లలో నువ్వు వుద్యోగం నించి రిటైరయిపోతావు. అప్పుడు నీకూ నీ బాసుకీ ఎటువంటి సంబంధమూ వుండదు. అలాంటప్పుడు నీకు కృతజ్ఞత చూపించుకోడానికి వాళ్లేమీ నీకు తద్దినాలకెత్తరు. అంచేత, నువ్వు నన్ను గెలిపించడానికి కృషిచెయ్! ఒకవేళ నీకది యిష్టంలేకపోతే పక్కకి తప్పుకో. నా తంటాలు ఏవో నేను పడతాను. ఒకవేళ ఓడిపోతే నా ఏడుపేదో నేనేడుస్తాను. అంతేగాని, ఎవడో ఆఫీసరుగాడి మెప్పుకోసం నన్ను విత్‌డ్రా అవమనకు''

ఇదీ ఆయన భార్యగారి ఆర్గ్యుమెంటు. దానికి మిగతావాళ్ల మద్దతు కూడా ఉంది. అయినా చిలకలదాసు పూర్కోలేదు, తన బాస్‌కిచ్చినమాట అబద్ధమైపోతోందే అనే బాధ ఒకవైపు, సాక్షాత్తు తన అర్ధాంగే తన మాట వినడంలేదే అనే బాధ మరొకవైపు అతని వ్యక్తిత్వాన్ని కొరడాతో కొట్టసాగేయి!

''నేను మా బాస్‌కిచ్చిన మాట పొల్లుపోతుంది. అందువల్ల నాకు బేడ్‌నేమ్ వస్తుంది'' దాసు గంభీరంగా అన్నాడు.

''వీళ్లు నిలబడమన్నప్పుడు నిలబడతానని మాటిచ్చేను. ఇప్పుడు కాదంటే నా మాట పొల్లుపోతుంది, నాకూ బేడ్‌నేమ్ వస్తుంది'' వరలక్ష్మి కూడా అంతే గంభీరంగా చెప్పింది.

''నేను ఆయనకి అంతలా మాటిచ్చేక, వాళ్లావిడకి పోటీగా ఎవరో ఎవరో కాకుండా నా భార్యే పోటీ చేస్తోందంటే, నేనేదో మోసంచేసేనని అనుకుంటారు''

''నేను పోటీ చేస్తున్నది మీ బాస్‌గారి భార్య మీద కాదు. మాజీ కార్పొరేటరు చిట్టితల్లిమీద. ఒకానొక విషయంలో అది నామీద ఎంత పొగరు ప్రదర్శించిందో మీకు తెలియదు. దాని పొగరు అణచడానికే నేనింత పట్టుదలగా నిలబడుతున్నాను''

''ఏమిటా ఒకానొక విషయం?''

"అది పబ్లిక్ మేటరు కాదు. ఆవిడ కుటుంబానికి, మన కుటుంబానికీ నంబంధించింది"

"అలాంటప్పుడు నాకు చెప్పడానికేం?"

"మీరు నాకు మద్దతు యిచ్చుంటే, అది మన యింటి వ్యవహారం అయినా యిప్పుడే, యింతమందిలోనూ చెప్పేదాన్ని. కానీ, మీరు యిప్పుడు నాకు అపోజిషన్ పార్టీ. ఎలక్షన్లో గెలిచేక చెప్తాను"

"అయితే నువ్వు పోటీనుంచి తప్పుకోవా?"

"తప్పుకోను".

ఆ వాదన యిక్కడితో తాత్కాలికంగా ఆగింది. ఈ వాదన అందరికీ విచిత్రంగానే కనబడింది. భార్యాభర్తలిద్దరూ చెరోపార్టీ తరఫున పోటీచేయడం చాలాసార్లు చాలాచోట్ల జరిగింది. కానీ, భార్య పోటీచేస్తుండగా, ఆవిడ భర్త ఆవిడ ప్రత్యర్థిఅయిన మరో ఆడదాన్ని బలపర్చడంమాత్రం యిక్కడే మొదటిసారిగా జరుగుతున్నట్టుంది.

చిలకలదానుకిప్పుడేం చెయ్యాలో అర్థంకాలేదు. రేపు జి.యమ్.గార్కి ఏం జవాబు చెప్పాలో అంతకంటే అర్థంకాలేదు. ఇది కార్పొరేషన్ ఎలక్షన్‌కాదు, తన కుటుంబనమస్యగా మారిపోయింది. ఇది వరలక్ష్మికి, జి.యమ్.గారి పెళ్లానికీ మధ్య జరిగే యుద్ధంకాదు. తనకి, తన భార్యకీ జరుగుతున్న యుద్ధం. తన గదిలోకి పోయి కాస్సేపు తలుపులు మూనుకుని ఏడుద్దామన్నాఆ యింటికి జనం వస్తున్నారు, పోతున్నారు, బెడ్‌రూమ్‌లోకెళ్లి తలుపులు గడియపెట్టాలనుకున్నాడు. కానీ ఆ గడియ వూడిపోయి వారంరోజులయింది. తలుపులూ మూనుకోవడంలేదు. పెళ్లాంతోపాటు యీ తలుపులుకూడా నాన్‌కోపరేట్ చేసేసరికి అతనికి దుఃఖం, ఆవేశం ముంచుకొచ్చి, తలుపుల్ని తనకోపంతీరేవరకూ ఫెడీఫెడీమంటూ తన్నేడు.

ఆరోజు మధ్యాహ్నం మూడున్నరకి చిన్న సైజు వూరేగింపులాంటిది ఆ యింటినించి బయలుదేరుతోంది. సుబ్బయ్యనాయుడుకిప్రతీ చిన్నదానికీ పెద్ద హంగామా, ఆర్భాటం చెయ్యడం అలవాటు. అందుకే నామినేషన్ వేయడానికి బయలుదేరుతున్న వరలక్ష్మికి నలుగురు ఆడవాళ్లచేత దిష్టితీయించి, నాలుగు కొబ్బరికాయలు కొట్టించేడు. బెడ్‌రూమ్ కిటికీలోనించి యీ హంగామా అంతా చూస్తూ చిలకలదాను ఒళ్లంతా చీమలుపాకుతున్నట్టుగా చికాకుపడ్డాడు. మర్నాడు జి.యమ్.గారితో ఎలా మాట్లాడ్డమా అనుకుంటూనే ఆ యిల్లు చేరుకున్నాడు. అదే నమయానికి గేటులోనించి ఓ వందమంది జనం, నరస్వతీదేవి వెంట వూరేగింపుగా బయలుదేరడం కనిపించింది. అంటే ఆవిడ ఆరోజు నామినేషన్ వెయ్యడానికి బయలుదేరుతోంది. దానుని చూడగానే వరదరాజులు ఎంతో ఆత్రం ప్రకటిస్తూ "ఏమిటి దానుగారూ... యీ మహాకార్యానికి మీరు సూత్రధారులై వుండి యిప్పుడా రావడం? వర్జ్యం వచ్చే టైమవుతోంది. వెంటనే బయలుదేరాలి, పదండి పదండి" అంటూ చిలకలదాను చెప్పేది వినకుండా అతన్ని వూరేగింపుముందు నిలబెట్టేసేడు. జి.యమ్. వూరేగింపుతో బయలుదేరలేదు. "మీరు నామినేషన్ వేసి తిరిగొచ్చేసరికి, అందరికీ యిక్కడే లంచ్. ఆ ఏర్పాట్లు నేను చూస్తాను. వెళ్లి రండి" అన్నాడు గాలిలో చెయ్యివూపుతూ.

వీళ్లుచేస్తున్న ఆర్భాటం చూసి చిలకలదాను సిగ్గుతో మరింత ముడుచుకుపోయేడు. నామినేషనువేసి తిరిగి యింటికొస్తున్నప్పుడు కూడా చిలకలదాను తన భార్య చేస్తున్న పోటీ విషయం చెప్పాలనుకున్నాడు. కానీ వరదరాజులు వినేస్థితిలో లేడు. గుంపులోని మిగతావారంతా ఆఫీసులోని గుమస్తాలే! జి.యమ్.గారు మధ్యాహ్నం చాలా రుచికరంగావుండే లంచ్ ఏర్పాటుచేసేరు. లంచ్ ముగిసి, అందరూ వెళ్లేసరికి మధ్యాహ్నం మూడుదాటింది. నాలుగు గంటల నమయంలో చిలకలదాను యింక తన మనసులోని మాటని దాచుకునే శక్తిలేక, మెల్లగా, నసుగుతూనే అసలు విషయం వివరించేడు. వాళ్లు ఎటువంటి కామెంట్సూ చెయ్యకముందే తనకీ, తన భార్యకీ మధ్య జరిగిన ఆర్గ్యుమెంటంతా దాపరికం లేకుండా వివరించేడు,

అంతా విన్నాక ముగ్గురూ నివ్వెరపోయేరు. వెంటనే ఏ ప్రశ్న అడగాలో వాళ్లెవరికీ తట్టలేదు. కొన్ని క్షణాల తర్వాత ఎవరికోసాన్నీ వాళ్లే తమాయించుకోడానికి ప్రయత్నిస్తూ ప్రశ్నించేరు-





"ఎలక్షన్లో మా ఆవిడ నిలబడుతోందన్న విషయం తెలియకముందు మీ ఆవిడ, ఆ మాజీ కార్పొరేటర్‌మీద కక్షతో పోటీకి దిగివుండొచ్చు. కానీ, మేం పోటీచేస్తున్నాం అని చెప్పినా ఆవిడ విత్‌డ్రా కానందంటే ఆవిడకా చిట్టితల్లి మీదున్న కక్ష అంత గొప్పదనుకోవాలా? లేక మేవన్నా మేం మీకివ్వాలనుకున్న ప్రమోషన్ అన్నా ఆవిడకంత చిన్న చూపు అనుకోవాలా? లేక, మీ మాటంటే అంత ఖాతరులేదనుకోవాలా?" ఇవి జి.యమ్.గారి ప్రశ్నలు.

"అయినా మీఆవిణ్ణిమీరు కన్విన్స్ చేయలేనప్పుడు, యింక మీరు మాకేం సపోర్టిస్తారు? నాకెలా ఓట్లు వేయిస్తారు? నేనేమో అర్జునుడినన్నారు, మీరు శ్రీకృష్ణభగవాన్లన్నారు, మీ ఆవిడో అత హనుమంతు, మీ బావమరిదో తోకలేని సుగ్రీవుడన్నారు. మీరంతా సపోర్టుంటే నాకు ఎదురులేదని చెప్పేరు. మీ మాటమీద నమ్మకంతోనే నేను పోటీకి దిగేను. నామినేషనూ వేసొచ్చేను. యిప్పుడు నేనేం చెయ్యాలి? విత్‌డ్రా అయిపోవాలా?" సరస్వతీదేవి తన ఆవేశానికి తోడుగా ఓ పదిగ్రాములు దుఃఖాన్నిగూడా జతచేసి ప్రశ్నలు కురిపించింది.

జి.యమ్. సగ్రుమంటూ లేచేడు. "నోనో... నువ్వు ఎలక్షన్‌కి నిలబడ్డంవరకే నీ డ్యూటీ! యిప్పుడు నువ్వు విత్‌డ్రా అయిపోతే యిది నా ప్రెస్టేజీ క్వశ్చన్ అయిపోతుంది. నువ్వు యివాళ నామినేషన్ వెయ్యడానికి వెళ్తున్న విషయం ఆంధ్రప్రదేశమంతటికీ తెలియాలనే, యివాళ నాలుగు డైలీ పేపర్స్‌లో రకరకాల పేర్లమీద మన స్నేహితులు నిన్ను అభినందిస్తున్నట్టుగా ప్రకటనలు యిచ్చేను. వాటి ఖర్చే యిరవై వేలు అయింది. అయినా నేను ఖాతరుచెయ్యలేదు. ఎందుచేత? నువ్వు ఎలక్షన్లో గెలవడం నాకు ప్రెస్టేజియస్ పాయింట్‌కనుక. యింత జరిగితే నువ్వు విత్‌డ్రా అయిపోతే, అడిగేవాళ్లకి నేనేం జవాబు చెప్పుకోవాలి? మా సూపరింటెంటు గారి భార్యకి జడిసి మేం పోటీనించి విత్‌డ్రా అయ్యేమని చెప్పుకోవాలా? అంతకంటే నేను ఏ సముద్రంలోనోపడి చావడం మంచిది"

వాతావరణం క్రమంగా వేడెక్కిపోయింది. ఓ గంట గడిచేక వరదరాజులు ఓ సలహా యిచ్చేడు "మన స్టేటస్‌కి తగ్గట్టుగా మనల్ని ఓ ఫారిన్ కుక్క కరిస్తే చెప్పుకోడానికి బాగుంటుంది. కానీ, మన బేడ్ లక్కికొద్దీ మనల్ని వూరకుక్క కరిచింది. అలాగనిచెప్పి, మనం వైద్యంచేయించుకోవడం మానుకొంగదా! యిక్కడా అదే థియరీ వుపయోగిస్తున్నాను" అంటూ చిలకలదాను దగ్గరకెళ్లి అన్నాడు

"మీ ఆవిడ ఎలక్షన్లో నిలబడ్డానికి కారణం ఏమిటి? ఆ చిట్టితల్లిమీద కక్ష తీర్చుకోవడమే తప్ప మరో రాజకీయ ప్రయోజనాన్ని ఆశించికాదుగదా! అలాంటప్పుడు ఆ చిట్టితల్లిదగ్గరకెళ్లి ఆవిణ్ణి ఏదోవిధంగా ఒప్పించి, అవసరమైతే ఏదో ఓ రేటుకి మాట్లాడి ఆవిణ్ణి విత్‌డ్రా చేయించేసేమనుకో, అప్పుడు ఆటోమేటిగ్గా మీ ఆవిడా విత్‌డ్రా అయిపోతుందిగా"

జి.యమ్.గారికి ఆ అయిడియా ఎంతమాత్రం నచ్చలేదు. "అడ్డమైనవాళ్లని బతిమిలాడ్డం సింప్లీ నాన్సెన్స్" అన్నాడు.

వరదరాజులు అల్లుడి భుజం తడుతూ చిన్నగా నవ్వి అన్నాడు "అల్లుడూ... నాన్సెన్స్, న్యూసెన్సూ కలిస్తేనే పొలిటిక్సు! అవసరం వచ్చినప్పుడు వసుదేవుడంతటివాడు గాడిదకాళ్లు పట్టుకున్నాడని సామెతుంది. ఆయనలా పట్టుకున్నాడో లేదో తెలీదుగాని, ఈ ఎలక్షన్లో నిలబడినప్పుడుమాత్రం ఎలాంటివాడైనా, గాడిదల కాళ్లు పట్టుకోకతప్పదు" అంటూ చిలకలదానుని ఓపక్కకి తీసుకెళ్లి మాట్లాడేడు. వరదరాజులు చెప్పిన అయిడియా చిలకలదానుకి బాగా నచ్చింది.



ఆ సాయంత్రం కాస్త చీకటి పడ్డాక వరదరాజులు, చిలకలదానుని తీసుకుని చిట్టితల్లి



యింటికి వెళ్లేరు. ఆమె విత్‌డ్రా అయిపోడానికి ఎంతకావాలని డైరెక్టుగా అడిగేసేరు. ఆవిడ డబ్బు విషయంలో ఎక్కువ డిమాండ్ చేస్తుందని వాళ్లు వూహించేరు. కానావిడ డబ్బు విషయం ప్రస్తావించకుండా కేవలం తన పోటీ విషయమే మాట్లాడింది "నేను మీ ఆవిడ లాగ, యీయనగారి కూతుర్లాగ ఇండిపెండెంటు మెంబర్ని కాదు. ప్రతిష్టాత్మకమైన ఫలానా ఫలానా పార్టీ మెంబర్ని! పైగా మొన్నటివరకూ సిట్టింగ్ కార్పొరేటర్ని. నన్ను డబ్బుతో కొనాలనుకోవడం మీమూర్ఖత్వం. అందుకు నేను ఒప్పుకోను. నేను ఒప్పుకున్నా నా పార్టీ ఒప్పుకోదు. నన్ను విత్‌డ్రా చేయించేస్తే ఆటోమేటిగ్గా మీ ఆవిడా విత్‌డ్రా అయిపోతుందంటున్నారు. అంటే, మీరు నాకంటే మీ ఆవిడకే ఎక్కువ భయపడుతున్నట్టు కనబడుతోంది. మీ ఆవిడ విత్‌డ్రా అయిపోయినా ఎవరూ ఏమీ కామెంట్‌చెయ్యరు. ఎందుకంటే ఆవిడకి గతంలో ఎటువంటి రాజకీయ చరిత్రా లేదు. కానీ, నా విషయం అలాక్కాదే! యిప్పటికే బోలెడంత చరిత్ర గడించేను. రేపో మాపో నేను ఎమ్మెల్యేనైపోతానేమోననిగూడా నాకు అనుమానంగా వుంది. అలాంటప్పుడు మీరు యిస్తాననే డబ్బుయ్యాయిదువేలకీ ఆశపడి నేనెందుకు మానుకోవాలి?" అంటూ ఆవిడ అర్గ్యూచేసింది. మగాళ్లిద్దరూ ఎంత ప్రాధేయపడినా లాభంలేకపోయింది. "పోనీ మీ ఆయనగారితో మాట్లాడతాం" అన్నారు.

"ఈ వార్డుకి కార్పొరేటర్ని నేనుగాని మా ఆయనకాదు. అయినా మీరు అడుగుతున్నారు కాబట్టి ఆయన్నే పంపిస్తాను. ఏం మాట్లాడతారో మాట్లాడండి" అంటూ లోపలకెళ్లింది. ఓ పావుగంటతర్వాత వాళ్ళాయన వచ్చేడు.

అతని శరీరంలో రక్తమాంసాలు బహు తక్కువగా వున్నట్టు చూడగానే తెలుస్తోంది. అతనికో వ్యక్తిత్వం లేనట్టుగా అతని ముఖాన్ని కాస్త పరీక్షగా చూస్తే తెలిసిపోతుంది. అతను వాళ్లవైపు చూడకుండా నేలచూపులు చూస్తూ మాట్లాడేడు.

"మాఆవిడంతా చెప్పిందండి. వినగానే నేను ఆవిడమీద కోప్పడ్డానండి. మీ అంతటివాళ్లు వచ్చి అడిగినప్పుడు కాదంటే ఏంబాగుంటుందనికూడా చెప్పేనండి, అదీగాక ఓసారి కొత్తవాళ్లక్కూడా అవకాశం యిస్తే బాగుంటుంది కదాని కూడా నచ్చచెప్పేనండి"

"ఆవిడేమన్నారు?"వరదరాజులు ఆత్రంగా అడిగేడు.

"ఢిల్లీకి రాజయినా తల్లికి బిడ్డే అవుతాడని సామెత వుందికదండి. అలాగే మా ఆవిడ వార్డు అంతటికి కార్పొరేటరే అయినా నాకు భార్యేకదండి. నామాట కాదనే మొండితనం ఆవిడకి లేదులెండి. లేకపోతే ఓ మాట అన్నది. మీకోసం తను విత్‌డ్రా అయిపోయినా, యింతవరకూ ఎలక్షన్‌నిమిత్తం లక్షన్నర ఖర్చు చేసేసిందట..."

ధాను, వరదరాజులు ఆశ్చర్యంగా ఒకరిముఖాలు ఒకరు చూసుకున్నారు. "నిన్ననేకదా నామినేషన్లు వేయడం ఆరంభమైంది. అప్పుడే లక్షన్నర ఎలా ఖర్చైపోతుందండి?" అన్నాడు వరదరాజులు.

"ఏమో ఆ లెక్కలు నాకు తెలీవు. మీకోసం ఆవిడ పదవిని వదిలేసుకుంటునప్పుడు, మీరు ఆవిణ్ణి నష్టపరచడం భావ్యమా చెప్పండి! ఓ రెండు లక్షలు మీవి కాదనుకుంటే..." అంటూ ఆయన మరో యాభైవేలు పెంచేసేడు.

"ముందు లక్షన్నరన్నారు, యిప్పుడు రెండు లక్షలంటున్నారు" చిలకలదాను ననుగుతూ అన్నాడు.

అతనేం మాట్లాడలేదు. రెండుక్షణాల తర్వాత "మీరు కార్లో వచ్చేరా, లేకపోతే టేక్సీ తెప్పించమంటారా?" అన్నాడు, యింక వెళ్లి రండి అనే అర్థం ధ్వనించేలా. యిద్దరూ లేచి నిలబడ్డారు. "మేం ఆలోచించుకుని రేపు వస్తాం" అంటూ బయటకి నడిచేరు. చిట్టితల్లి మరీ రెండు లక్షలు అడిగినందుకు జి.య్యామ్యూ అగ్రహం ప్రకటించేడు, అతని భార్యా ఆవేశపడింది. రాజకీయాల్లో అవసరం మనదయినప్పుడు అవకాశం ఎదుటివాళ్లదవుతుందని వరదరాజులు వివరిస్తూ మరో మాట కూడా అన్నాడు "చిట్టితల్లి విత్‌డ్రా అయితే ఆటోమేటిగ్గా వరలక్ష్మి విత్‌డ్రా అయిపోతుంది. వాళ్లిద్దరూ తప్పుకున్నప్పుడు సరస్వతికి పోటీయే వుండదు. పోటీ లేనప్పుడు అస్సలు ఖర్చే వుండదు. పోటీ తీవ్రంగా వున్నప్పుడు, యిప్పటి రోజుల్లో హీనపక్షంగా అయిదారు




లక్షలు ఖర్చయిపోతోంది. అలాంటప్పుడు రెండు లక్షల్తో అడ్డుతొలగించుకుని, ఏకగ్రీవంగా ఎన్నికవడం లాభంకిందకే వస్తుంది గాని నష్టమనిపించుకోదు'' అంటూ ఆయన చెప్పిన తరుణోపాయానికి మిగతావాళ్లు తల లాడించేరు. ''రెండులక్షలూ యిచ్చేద్దాం అంటే యిచ్చేద్దాం'' అనుకుంటుండగా సరస్వతీదేవి గభీమంటూ ఓ సందేహాన్ని వెలిబుచ్చింది.

''చిట్టితల్లి విత్‌డ్రా అయినా ఆ పార్టీ తరఫున మరో కేండేటు నిలబడితే?'' ఔను! యిదీ ఆలోచించవలసిన విషయమే అనుకుంటూ చిట్టితల్లి దగ్గరకి మర్నాడు తెల్లారుఝామునే బయలుదేరేరు. వాళ్ల సందేహాన్ని విని ఆవిడ చిన్నగా నవ్వేసి, తలుపులు, కిటికీలు మూసొచ్చి రహస్యం చెప్తున్నట్టుగా గొంతు తగ్గించి చెప్పింది - ''మీ సందేహం చచ్చుదీ, పుచ్చుదీ కాదు. నేను విత్‌డ్రా అయితే మా పార్టీవాళ్లు నాతరఫున మరొకర్ని నిలబెట్టే మాట నిజమే! అంచేత నేను ఏంచేస్తానంటే యివాళ వెళ్లి పద్ధతి ప్రకారం నామినేషన్ వేసేస్తాను. నామినేషన్లు వుపసంహరించుకునే ఆఖరిరోజు ఆఖరిక్షణంలో గప్‌చిప్‌గా వెళ్లి దాన్ని విత్‌డ్రా చేసేసి, అట్నుంచి అటే ఓ ప్రైవేటు హాస్పటల్లో గుండెజబ్బు పేషెంటుగా జాయినైపోతాను. మా పార్టీవాళ్లు నన్ను అడిగితే అదేరోజు నాకు సడెన్‌గా గుండెనొప్పి వచ్చిందని, అంచేత ఎలక్షన్లో పాల్గొనే ఓపికలేక విత్‌డ్రా అయిపోయేనని, నా ప్రాణాలకంటే నాకు పదవి ఎక్కువ కాదని చెప్పి ఓ ఏడ్పు ఏడ్చేస్తాను. తర్వాత వాళ్లు ఏమనుకుంటేనేం మీకు నేను పోటీ అవకుండా తప్పుకుంటానుకదా, ఆఖరిక్షణంలో విత్‌డ్రా అయిపోతానుకాబట్టి నాబదులు మరో కేండేటుని నిలబెట్టే అవకాశం మా పార్టీకి వుండదు''

ఆవిడ చెప్పిన సలహా అందరికీ నచ్చింది. కానీ, ఆ తర్వాత చెప్పిందే ఎవరికీ నచ్చలేదు. ''నేనిలా చేస్తున్నందుకు, ఎలక్షన్ పూర్తయ్యేదాకా నేను ప్రైవేట్ హాస్పటల్లో వుండడానికీ మరో యాభైవేలు ఏర్పాటు చేయాలి'' అంది. కానీ, మొదట వరదరాజులు రెండులక్షలకు మించి ఒక్క పైసాగూడా యివ్వనన్నాడు. పోనీ నలభైవేలు చేస్కోండీ అంటూ చిట్టితల్లి ఓ మెట్టు దిగింది. అయిదువేలుకంటే ఎక్కువివ్వం అంటూ బిగుసుకుపోయేడు వరదరాజులు. ఓ అరగంటసేపు అలా లాగులాటలు, పీకులాటలూ జరిగేక చిలకలదాసుకి విసుగొచ్చి, ''రెండులక్షలు యివ్వడానికి సిద్ధపడినప్పుడు మరో పదిహేనువేలకి వెనుకాడితే ఏం ప్రయోజనం?'' అంటూ పదిహేనువేలకి బేరంతెగ్గొట్టేడు. మొత్తంమీద రెండులక్షల పదిహేనువేలకి సమస్యని పరిష్కరించేరు.

ఆ సమస్య పరిష్కారమైపోయిందనుకున్నారుగాని, చిలకలదాసుకి అప్పుడే కొత్త సమస్య ఏర్పడింది.

''నేను విత్‌డ్రా అవను'' అని ఖచ్చితంగా చెప్పేసింది వరలక్ష్మి. ''నువ్వు ఎవరిమీదైతే కక్షతీర్చుకోవాలనుకున్నావో, ఆ చిట్టితల్లి విత్‌డ్రా అయిపోయినప్పుడు యింక నువ్వెందుకు పోటీచేయడం?'' అంటూ చిలకలదాసు ఎన్ని విధాల చెప్పినా ఆవిడ ఒప్పుకోలేదు. ఆవిడ మొండితనానికి సుబ్బయ్యనాయుడు మూల స్థంభంగా మారేడు.

''మా అక్క ఎలక్షన్లో పోటీకి నిలబడుతోందన్న సంగతి తెలియగానే ఆ చిట్టితల్లి భయపడిపోయి, గుండెజబ్బుతో హాస్పటల్లో జాయినైపోయిందంటే, అదే మా అక్కకుండే పాప్యులార్టీకి నిదర్శనం'' అంటూ శబ్దంలేకుండా నవ్వేడు సుబ్బయ్యనాయుడు.

''ఆవిడకొచ్చిన గుండెజబ్బు, హాస్పటల్లో జాయినవడం అంతా మేం ఆడించిన నాటకం, ఆ నాటకం ఖరీదు రెండు లక్షల పదిహేనువేలు'' అంటూ చిలకలదాసు ఆ విషయాన్ని చెప్పలేకపోయేడు. చెప్తే అది ఆనోటా యీనోటా ప్రచారమైపోయి ఏ విషపరిణామాలకు దారితీస్తుందోనని భయపడ్డాడు. పోటీనించి విత్‌డ్రా అయే విషయంలో భార్యాభర్తలమధ్య చాలా పెద్దఎత్తున ఘర్షణ జరిగింది.

ఆఖరు బెదిరింపుగా దాసు అన్నాడు ''నీ భర్తగా శాసిస్తున్నాను. నువ్వువిత్ డ్రా అయిపోవాలని చెప్తున్నాను. అవుతావా? లేదా?'' దానికి వరలక్ష్మి గూడా అదే స్థాయిలో సమాధానం చెప్పింది. ''మీరు జీతం ఇవ్వకుండా ఇల్లు గడపమనండి, గడుపుతాను. మీ కిష్టమైన వంటలు వండమనండి వండుతాను. అంతే గాని, నాకిష్టమైన పదవినించి నన్ను దూరంక

మ్మంటే మాత్రం నేను కాలేను. మీరు ఆఫీస రుగా ప్రమోట్ అయితే నేనో ఆఫీసరు పెళ్లా న్నని ఘనంగా చెప్పుకోవాలనుకున్నాను. కానీ, మీ చేతకానితనంవల్ల ఆ కోరికా నెరవేరలేదు. ఇప్పుడు మీ ప్రమేయం లేకుండా, నా అంతట నేను గొప్పదాన్ని కావాలనుకున్నాను. దానికి మీరు అడ్డుతగలకండి"

* * *



అక్కడ వాదన ముగిసిపోయింది. కానీ జి.యమ్.గారింట్లో యుద్ధం ప్రారంభమ యింది. "నన్ను నమ్మండి మహాశయా మా ఆవిడ యింత మొండికెత్తుతుందనుకోలేదు. అయినా ఫర్వాలేదు. ఈక్షణం నించి అది నా భార్య కాదు. నేను ఆవిడకి భర్తనీ కాదు. మానసికంగా మేం విడిపోయినట్లే. ఇది మీరు నాకు ఇస్తానన్న ప్రమోషన్ కోసం పట్టిన పట్టుద లకాదు. భర్తగా నేనో మాట చెప్పినప్పుడు దాన్ని పాటించాల్సిన నా భార్యే నా మీద అంత ఎదురు తిరిగినప్పుడు, ఆత్మాభిమానం, పౌరు షంగల భర్తగా నేనూ సత్తా ఏవిటో చూపిస్తాను. మీ దృష్టిలో నేనో చేతకానిమొగుణ్ణి కావచ్చుకానీ సమర్థవంతమైన కార్యకర్తగా ఎలాపనిచేసి మేడమ్‌గార్ని గెలిపిస్తానో చూడండి. ఇది మా ఆవిడకీ, మేడమ్‌గారికీ జరిగే పోటీ కాదు.

నాకూ మా ఆవిడకీ జరిగే పోటీ. మేడమ్‌గారి గెలుపే నా గెలుపు''

చిలకలదాసు ఆవేశంగా చెప్పినా జి.యమ్. ఓ సందేహాన్ని వెలిబుచ్చేడు "మీ ఆవిడ చేసిన అవమానం వల్ల నీకు పౌరుషం వచ్చి నువ్వు గట్టిగా కృషి చేస్తానంటున్నావు. కానీ మొన్న నువ్వేం అన్నావు. నువ్వు కృష్ణుడిలాగ, మీ ఆవిడ హనుమంతుల్లాగా, మీ బావమరిది సుగ్రీవుడిలాగ మా ఆవిడ రథంమీద వుండి విజయం సాధిస్తానన్నావు. కానీ ఇప్పుడు హనుమంతుడు, సుగ్రీవుడూ ప్రతిపక్షంలో వుండిపోయినప్పుడు నువ్వొక్కడివీ ఏం సాధించగలవు?''

"క్షమించండి సార్! మా ఆవిడా నూ బావమరిది ఎలాంటి సమర్థులైనా వాళ్లు నా మనుమలుగా వున్నంతకాలమే వాళ్లని ఇతరులు గౌరవిస్తారు. శివుడి మెడలో వున్నంత కాలమే ఆ నాగుపాముని భక్తులు పూజిస్తారు. కానీ ఆ పాము పరమశివుణ్ణి విడిచిపెట్టి పబ్లిక్‌లోకి వచ్చిందంటే, దాన్ని విమప్పురుగుకింద జమకట్టి, ఆ భక్తులే దాన్ని కొట్టి చంపేస్తారు. మావాళ్ల సంగతీ అంతే''

అతని మాటలకి అందరూ ఔనౌనంటూ తలలాడించేరు. చిలకలదాసుకి కలిగిన అవమానం, అందువల్ల వచ్చిన పౌరుషం అంతా తమ విజయానికి వేసే పునాదిరాళ్లుగా భావించేరు.

చిలకలదాసు ఆ రాత్రి ఇంటికి వెళ్లేడు. ఇంట్లోనూ, ఇంటి బయట అంతా హడావిడిగా వుంది. ఎలక్షన్‌ప్రచారం కోసం తయారవుతున్న బోర్డులు, వాల్‌పోస్టర్సు, బోర్డులు రాయడానికొచ్చిన పెయింటర్సుతో అంతా గందరగోళంగా వుంది. లోపలకి వెళ్లేసరికి ఓటర్సు లిస్టు చూస్తున్న సుబ్బయ్యనాయుడు గబగబా అతని దగ్గరకొచ్చి ఏదో కంఠతా పెట్టిన పద్యాన్ని అప్పజెప్తున్నట్టుగా గడగడమంటూ చెప్పేడు. "నీకు బుద్ధిలేదని మరోసారి నిరూపించుకున్నావు. చిట్టితల్లికి రెండు లక్షల పదిహేను వేలు ఇచ్చి పోటీనించి విత్‌డ్రా చేయించేవే, ఆ డబ్బే గనక మా అక్కకిచ్చుంటే ఆవిడ పోటీనించి మానుకునేది. మీ ఇద్దరికీ పోట్లాటా తప్పేది. ఆ చిట్టితల్లి విత్‌డ్రా అయిపోయినా మా అక్క ఎందుకు పోటీ చేస్తానంటోంది? గెలిచిన తర్వాత నాలుగు డబ్బులు సంపాదించుకోవాలనేగా. ఆ నాలుగు డబ్బుల్లో రెండు డబ్బులు మీ జి.యమ్.చేత నువ్వు ఇప్పించుంటే, మనందరం కలిసి మీ మేడమ్‌గారికి తీవ్రంగా ప్రచారంచేసి బంపర్ మెజార్టీతో గెలిపించి వుండేవాళ్లంగా! నీకు ఆ అయిడియా తట్టలేదు. నీకెప్పుడైనా అయిడియా తడితే అది యింట్లో వాళ్లకి నష్టం కలిగించేది, పరాయివాళ్లకి లాభం కలిగించేదిగా వుంటుంది. నువ్వు చేసిన నిర్వాకం విన్నాక మా అక్క నీతో ఎలక్షన్ అయ్యేదాకా మాట్లాడకూడదని ఒట్టేసుకుంది''

చిలకలదాసుకి ఆ మాటలు విస్మయం కలిగించేయి. తన గదిలోకి తొంగిచూసేడు. అంత వరకూ ఇటువైపే తిరిగి పడుకుని ఈ మాటలు వింటున్న వరలక్ష్మి, అతను అటు చూడగానే గభీమని మరోవైపు తిరిగి పోయింది. ఆవిడ తనతో మాట్లాడదని అర్థమైపోయింది. ఆ తర్వాత అతనికి రెండు సందేహాలొచ్చేయి. చిట్టితల్లికి డబ్బిచ్చి విత్‌డ్రా చేయించినట్టు వీళ్లకెలా తెల్సిపోయింది? క్షణాలమీద అతనికి జవాబు గూడా తట్టేసింది. సుబ్బయ్యనాయుడు తల్చుకుంటే ఈ రహస్యాన్ని బయటకి లాగడం వాడికి పెద్ద పనేంకాదు. ఇంక రెండవది... నాయుడు చెప్పినట్టు ఆ రెండు లక్షల పదిహేనువేలూ తన భార్యకే ఇప్పించి, అందరూ కలసి మేడమ్‌గార్ని గెలిపించుంటే? రెండు పక్షాల్లూ లాభం పొందుండేవి. కానీ... తన భార్యని విత్‌డ్రా చేయించడానికి తను రెండు లక్షలు అడగ్గలిగేవాడా? తను అడగకుండా నాయుడి చేత అడిగించినా వాళ్లు ఇచ్చేవాళ్లా? వుహూఁ! నాయుడు చెప్పింది ఇలా జరిగితే బావుణ్ణు అనుకుంటూ సంతోషపడేవే గాని అవేం జరిగే పనులుకావు అని తనలో తనే నిర్ణయించుకున్నాడు.

ఆ రాత్రి వరలక్ష్మి అలిగి పడుకోవడంవల్ల, కూతురు కూడా నాయుడితో కలిసి ఓటర్ల లిస్టులు తయారు చేసేపనిలో వుండడంవల్ల, చిలకలదాసు కెవరూ అన్నం పెట్టలేదు. తనే పెట్టుకు తిన్నాడు. ఎలక్షన్ అయేవరకూ తన గతి యింతేనా? అని తనని తనే ప్రశ్నించుకున్నాడు. రాత్రి పెరట్లో మంచం వేసుకుని పడుకుంటూ మళ్లీ స్వగతం పలుక్కున్నాడు.





ఎలక్షన్ అయేదాకా తన భార్య తనతో మాట్లాడ నని ఒట్టుపెట్టుకున్నప్పుడు తను ఈ ఇంట్లో వుండడం అనవసరం. ఏదో విధంగా రాజీపడి వున్నా తనకి గౌరవం వుండదు. పైగా ఇంటికి వచ్చేపోయే జనమంతా తననోశత్రువులా చూస్తా రు. సలహాలిస్తారు. ఇవేవీ తనకి ఆనందాన్ని చ్చేవికావు. అంచేత ఎలక్షన్ అయేదాకా తను ఈ ఇంటికి దూరంగా వుండి, మేడమ్‌గార్ని గెలిపించేక తిరిగొస్తే అప్పటికి తన ప్రతాప మూ తెలుస్తుంది, తనకి మర్యాదా దక్కు తుంది. ఆ తర్వాత తన పెళ్లాం కుక్కినపే నులా పడివుంటుంది. ఈ నిర్ణయం తీసుకు న్నాక హాయిగా నిద్రపట్టింది. వుదయాన్నే లేచి తన సూట్‌కేసు సర్దుకుని జి.యమ్.గారింటికి బయలుదేరేడు. ఎక్కడకెళ్తున్నావని ఎవరూ అడగలేదు. అతనూ చెప్పలేదు.

ఉదయం టిఫిన్ చేస్తున్నప్పుడు సుబ్బయ్య నాయుడు వరలక్ష్మితో చిలకలదాసు విషయం ప్రస్తావిస్తూ ఓ మాటన్నాడు. "బావ పట్టుదల, అవతలా జి.యమ్.గారు రెండు లక్షల పదిహే నువేలని చిట్టితల్లికి తృణప్రాయంగా పారే యడం, ఆ మేడమ్‌గారి చదువు సంధ్యలు, రూపం, గీపం అంతా పక్కపక్కనపెట్టి ఆలోచి స్తుంటే..."

వరలక్ష్మి మధ్యలోనే కసురుతూ అతని నోటి కి తాళం వేయబోయింది. "నువ్వు నా తమ్ముడి వైవుండి ప్రతిపక్షం కేండేటుని పొగడ్డానికి సిగ్గ య్యడం లేదూ?"

"బలవంతుడైన శత్రువుని పొగడ్డం సంస్కారం అనిపించుకుంటుందేగాని సిగ్గు మాలిన పని అనిపించుకోదక్కా! ఆ మాటకొస్తే ఆ సరస్వతీదేవి కూడా నీ ప్రతాపాన్ని పొగి డిందిగా"

"అది నన్నెప్పుడు పొగిడింది?"

"పొగడ్డం అంటే నోటితోనే పొగడాలా? నీ గురించి ఆవిడ ఎంత భయపడకపోతే నిన్ను డ్రాప్ చేయించడానికి ఆ చిట్టితల్లికంత డబ్బి స్తుంది? అదిగో ఆవిడలో నీ పట్ల కలిగిన భయమే, నీ మీద ఆవిడ కురిపించిన పొగడ్త కింద లెక్కవుతుంది. ఇద్దరు గొప్పవాళ్ల మధ్య విరోధంవున్నా ఒకరి శక్తి సామర్థ్యాలనొకరు పొగుడుకుంటారని చెప్పడానికో చిన్న పిట్టకథ వుంది"

"ఏవిటా పిట్టకథ?" వరలక్ష్మి అయి ష్టంగానే అడిగింది.

"రాముడికి, రావణాసురుడికీ యుద్ధం జరు గుతున్నప్పుడు, ఓసారి హనుమంతుడు, రావ ణుడూ ఒకర్తో ఒకరు డైరక్ట్‌గా ఫైట్ చెయ్యాల్సొ చ్చిందట. హనుమంతుడు తన శక్తంతా వుప యోగించి, రావణాసురుణ్ణి గదతో ఒక్కదెబ్బ కొట్టేడట. ఆ దెబ్బకి రావణుడు ధన్‌మంటూ కిందపడిపోయి అరగంటదాకా స్పృహకో ల్పోయి ఆ తర్వాత లేచి ఓ రెండు అయిస్ సోడాలు తాగి, హనుమంతుడి భుజం తట్టి "శభాష్ హనుమంతా శభాష్! శ్రీరాముడు మహావీరుడని, బలవంతుడని అనవసరమైన బిల్డప్పులిచ్చేరుగాని, అసలైన బలవంతుడివి నువ్వేయ్యా! ఐరావతం చేత ఛాతీని తొక్కించు కున్న నన్ను కైలాస పర్వతాన్నే భుజాల మీద ఎత్తగలిగిన నన్ను ఇంత దెబ్బకొట్టి, సోడా తాగించేవంటే, నిజంగా నాకంటే బలవంతు డివి నువ్వే" అన్నాడట. ఆ మాటలకి హను మంతుడు సంతోషించలేదు సరిగదా సిగ్గుతో తలబాదుకుంటూ అన్నాడట. "అయ్యా! రావ ణాసుర మహాశయా, నా బలమంతా వుపయో గించి నేనో దెబ్బ కొట్టేక ప్రాణాల్తోవున్నవాళ్లు ఇంతవరకూ ఎవరూలేరు. కానీ నా చేత అంత దెబ్బ తిన్నాక గూడా నువ్వు బ్రతికుండడమే కాకుండా నన్ను పొగుడుతూ షేక్‌హేండ్ ఇస్తు న్నావంటే, నిజంగా నాకంటే బలవంతుడివి నువ్వేనయ్యా అన్నాడు. చూసేవాక్కా, వాళ్లు గొప్పవాళ్లు కాబట్టి, వాళ్లమధ్య విరోధంవున్నా నువ్వు గొప్పవాడివంటే నువ్వుగొప్పవాడివని ఒక రొకరు పొగుడుకున్నారు. మీరూ అంతే" అంటూ వెకిలిగా నవ్వేడు.

వరలక్ష్మి ఆ పిట్టకథ గురించి ఆలోచించ డంలేదు గాని వీడు అంతలా పొగుడుతున్న సరస్వతి మీద తను గెలవగలదా? పైగా తన భర్తా అటువైపే వున్నాడు. "ఏవిటాలోచిస్తు న్నావు" అన్నాడు నాయుడు. ఆవిడ తన సందేహాన్ని చెప్పింది. నాయుడు తాగుతున్న కాఫీ పొలమారేలా పగలబడి నవ్వేడు.

"ఏదో ఆవిణ్ణి పొగుడుదామనిపించి అలా అన్నానేగాని, మనం ఓడిపోతామని అన్నానా? మన దగ్గర తక్కువగా వున్నదీ, ఆవిడ దగ్గర

ఎక్కువగా వున్నదీ ఏవిటి? డబ్బు. అంతేకదా అయితే డబ్బున్నంత మాత్రాన గెలిచేస్తారా? కిందటి అసెంబ్లీ ఎలక్షన్లో నారాయణమూర్తి నిలబడ్డాడు. మనవూరిని పదిసార్లుకొనగలిగే డబ్బూ, దన్నూ ఆయనకున్నాయని అందరికీ తెలును. అయినా చిత్తుగా ఓడిపోయేడు. ఎంచేతా అంటే అప్పుడు ప్రజలమీద డబ్బు అనే బాణం గెలవలేకపోయింది. ఇంక మన బావ ఆవైపు వున్నాడంటావా? కర్ణుడు మహావీరుడు, కౌరవుల పక్షానే యుద్ధం చేసేడు. అయినా కౌరవులు గెలవగలిగేరా? బావది కర్ణుడి జాతకమని నేను ఏనాడో చెప్పేనుగా''

తమ్ముడి మాటలతో వరలక్ష్మి కొంచెం ధైర్య పడింది.

★ ★ ★

చిలకలదాసు తన ఇంటినించి డొక్కుడోలూ సర్దుకొచ్చేసేడని తెలిసి జి.యమ్. అండ్ పార్టీ మహదానందం చెందేరు. ఆ బంగళా ఔట్‌హౌస్‌లో అతన్ని వుండమన్నారు. భోజనం, టిఫినూ అన్నీ అక్కడే ఏర్పాటు చేసేరు. ఎలక్షన్ అయేదాకా అతను ఆఫీసుకి రానక్కర్లేకుండా జి.యమ్. ఏర్పాటు చేసేడు. ప్రచార కార్యక్రమాలు ఆరంభమయ్యేయి. దాసుకి సహాయంగా ఆఫీసులోనించి ఓ పదిమంది గుమస్తాల్ని పిల్చి అతనికి అప్పగించేడు. వాల్‌పోస్టర్లు ప్రింట్‌చేయించి గోడలమీద అంటించడం దగ్గరనించి, పేంప్లెట్స్ పంచడం, ఆటోల్లో తిరుగుతూ మైకులో ప్రచారం చెయ్యడం వరకూ చిలకలదాసు బాధ్యతే! పగలంతా ఈ పనులు చేసేక, రాత్రిపూట ఓటర్ల లిస్టులు తయారుచేయడం, వీధులవారీగా విభజించడం లాంటి పేపర్ వర్కు జరుగుతోంది. దాసు మరో ధ్యాస పెట్టుకోకుండా రాత్రింబగళ్లూ ఎలక్షన్ ప్రచారం మీదే మనసుని లగ్నంచేసేడు. వరలక్ష్మి, సుబ్బయ్యనాయుడు కూడా అంత శ్రద్ధగానూ, అంత చురుగ్గానూ పనులు జరిపిస్తున్నారు. సుబ్బయ్యనాయుడు ఆ వార్డులోని కంట్రాక్టర్ల దగ్గరకి, షావుకార్ల దగ్గరకి వెళ్లి ఎలక్షన్ ఫండ్‌కింద కొంతడబ్బు వసూలుచేసేడు. అలాంటి వాళ్లకిలాంటి ఎలక్షన్లు వచ్చినప్పుడు ఇలా మామూళ్లు పారెయ్యడం మామూలే! ఎలక్షన్ స్థాయిని బట్టే వాళ్లిచ్చే మామూళ్లూవుంటాయి. ఓ నలభై వేల దాకా నాయుడు పోగేసేడు.

"ఇలా కలక్ట్ చెయ్యడం ఎందుకురా?'' అంది వరలక్ష్మి ఆశ్చర్యపోతూ.

"ఎందుకూ అంటే, దీనికి రెండు పార్టులుగా ఆన్సర్‌చెప్పాలి. నెంబర్ ఒన్, నా సలహాలు విని, నా సహాయంపొంది గూడా బావ ప్రమోషన్ సంపాదించుకోలేకపోయేడు. ఇప్పుడు నువ్వైనా నా సలహా సహాయాల్తో కార్పొరేటర్‌వైతే నా మాస్టర్ బ్రెయిన్‌కో సార్థకత ఏర్పడుతుంది. బావ ఫెయిలవడానికి నా సలహాలు కారణమో? అతని అసమర్థత కారణమో తేలిపోతుంది. ఇంక నెంబర్‌టూ, ఇలాంటి ఎలక్షన్ టైములో కంట్రాక్టర్లు, షావుకార్లు ఇలా డబ్బు ఇస్తుంటారు.

వాళ్లుగూడా మన మీద ప్రేమతో ఇవ్వరు. రేపునువ్వు కార్పొరేటర్ వైతే, నీకిచ్చిన ప్రతిరూపాయికీ వెయ్యి రూపాయిల పని నీ చేత చేయించుకుంటారు. అంటే పాడి ఆవుకి పిడికెడు గడ్డి వేసి కడివెడు పాలుపిండుకోవడం చేస్తారన్నమాట. ఇప్పుడు కొద్ది కొద్దిగా ఎడ్వాన్సులిచ్చేరు. ప్రచారం బాగా ముదిరి, నువ్వే గెలుస్తావన్న నమ్మకం ఏర్పడితే, మరి కొంచెం పెద్ద మొత్తాలు మనకి ముడతాయి. ఈసారి మన అదృష్టం ఏవిటంటే చిట్టితల్లి డ్రాప్ అయిపోయింది. ఆ సరస్వతి ఇలా చందాలు అడుక్కునే రకంకాదు. మన వార్డులో మరో కేండేటు ఎవరూ నిలబడ్డంలేదు. అంచేత వాళ్లేం ఇచ్చినా మనకే ఇవ్వాలి. అంచేత దండుకున్న వాళ్లకి దండుకున్నంత. ఇప్పుడీ నలభైవేల్లో ఇరవై వేలు నీ బీరువాలో దాచెయ్. ఓ అయిదువేలు నా సొంత ఖర్చుల కిందయి చ్చెయ్. మిగతా పదిహేను వేలూ ప్రచారానికి ఖర్చుచేద్దాం'' అన్నాడు. డబ్బుని పంపకాలు చేయడం విషయంలో వరలక్ష్మి, తమ్ముడు చెప్పిందాన్ని తూ.చ. తప్పకుండా పాటించింది.

వార్డులో ఎన్ని ఇళ్లున్నాయో లెక్కగట్టి, ఇంటికో జాకెట్టుబట్ట, ఓ ప్లాస్టిక్ కుంకుమభరిణె కొనుక్కొచ్చేరు. పనిలో పనిగా సుబ్బయ్యనాయుడు నాలుగు గ్లిజరిన్ సీసాలు కూడా కొనిపించేడు.

"గ్లిజరిన్ సీసాలెందుకురా?'' అంటూ వరలక్ష్మి విస్తుపోయి అడిగింది.




# ఏరిన ముత్యాలు

★ రక్షించే శక్తి లేకుంటే సృష్టించడమే మహా పాపం.

- కట్టమంచి రామలింగారెడ్డి

★ పేదవారికి సేవచేయడమే ఈశ్వర సేవ.

- సర్దార్ పటేల్

★ సోమరితనం దరిద్రానికి మూలం.

- యజుర్వేదం

★ సోమరితనం నిన్ను మోసపుచ్చనివ్వకు. ఈరోజు దానికి నువ్వు లొంగిపోతే నీ మరునటిరోజును అది దొంగిలిస్తుంది.

- క్రాక్వెల్

★ సోమరితనం ఆకలికి తల్లి, దొంగతనానికి అన్న.

- ఆంగ్ల సూక్తి.

★ సోమరులు పనిచేసేరోజు 'రేపు'.

★ సోమరితనం అనే శ్మశానంలో సద్గుణాలన్నీ పూడ్చిపెట్టబడతాయి.

- ఆంగ్ల సామెత.

★ శారీరక మౌఢ్యమే సోమరితనం. మానసికమైన సోమరితనమే మౌఢ్యం.

- న్యూమెన్

★ సోషలిస్టుగా నటించడం ఫాసిజానికి చక్కని దారి.

- ఎల్.ట్రాట్స్కీ

★ ప్రతి ఒక్కరు ధరించడం వల్ల తన ఆకారాన్ని కోల్పోయిన టోపీ వంటిది సామ్యవాదం.

- జోడ్

★ అనంతమైన సౌందర్యానికి నిలయం ఈ ప్రపంచం. అయినా ఒక్కడూ దానిని పట్టించుకోడు.

★ అందమనేది చూసేవారి కళ్ళలోనూ, కోరుకొనేవారి హృదయంలోనూ అధికంగా ప్రకాశిస్తుంది.

- ఖలీల్ జిబ్రాన్

★ సౌందర్యమనేది ప్రపంచంలోని గొప్పవాళ్ళందరి సిఫార్సు కంటే గొప్పది.

- అరిస్టాటిల్

★ నిరీక్షించే నయనాలలో సౌందర్యం కాపురం చేస్తుంది.

- రోమా రోలా

★ ప్రకృతి స్త్రీకి సమర్పించే మొదటి బహుమతి 'అందం'. ముందుగా తీసుకొనేది కూడా దానినే.

★ అందం అనేది ఏదో ఒక ప్రత్యేకత వల్లే వస్తుంది: ముఖం మీది భాగాలు అందరికన్నా కొంచెం కురచో, పొడవో అవటం వల్ల ఆ ప్రత్యేకత వస్తుంది.

- బేకన్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

"దీన్ని కాస్త కంట్లోవేనుకుంటే, బొలబొల మంటూ గుప్పెడు కన్నీళ్లు వచ్చేస్తాయక్కా! సినిమాల్లో ఎవరు ఏడవాలన్నా దీని సాయంతోనే ఏడుస్తారు"

"దీన్ని కంట్లో వేసుకుని నేను ఏడవాల్సిన అవసరం ఏముంది?"

"వుండబట్టే దీన్ని కొనిపించేను. ఏడుస్తూ వ్యవసాయం చేస్తే ఇతరుల దిష్టి తగలకుండా ఎక్కువవంట పండుతుందని పెద్దలు చెప్పారు. ప్రస్తుత పరిస్థితుల్ని బట్టి నువ్వు ఏడుస్తూ ప్రచారంచేయక తప్పదు. అప్పుడే మనకి విజయం గ్యారంటీగా లభిస్తుంది!"

అయినా వరలక్ష్మికి అతని మాటలు అర్థం కాలేదు. ఆమెను నేల మీద కూర్చోబెట్టి, నాయుడు నేల మీద కూర్చుని రాజకీయ ప్రచారానికి గల చిట్కాల గురించి క్లుప్తంగా వివరించేడు. "అక్కా! నువ్వు చేసే ప్రచార పద్ధతుల్ని బట్టే నీ గెలుపు ఆధారపడి వుంటుంది. అది కార్పొరేషన్ ఎన్నికలు కానియ్, లోకసభ ఎన్నికలుకానియ్, ప్రజలని మస్కా కొట్టడానికి అవలంభించే మార్గాలు ఒక్కటే! ఈ రోజున్నించి మనవార్డులో పద్దెనిమిదేళ్లుదాటిన ప్రతీ ఆడదాన్నీ ప్రతీ మగవాణ్నీ నువ్వు మర్యాదగా సంభోదిస్తూ లేనిపోని చనువుని ప్రదర్శించాలి. ఎలాంటి తల మాసిన వెధవనైనా, ఎటువంటి పోరంబోకునైనానరే, వాడికి ఓటుహక్కుంటేచాలు, వాణ్ని ఓటరు మహాశయా అనే పిలవాలి. మనదేశంలో ఎలాంటి వెధవయినా ప్రజానాయకులచేత మహాశయా అనిపించుకునే అదృష్టం కేవలం ఈ ఎలక్షన్ టైములోనే వడుతుంది. వాళ్లని నువ్వు వదవిలో వున్నంత కాలం అలా పిలవక్కర్లేదు. ఎలక్షన్ ప్రచారం ఆరంభించి పోలింగ్ జరిగేతేదీ వరకూ పిలిస్తేచాలు! పైసా విలువ చెయ్యని ప్రతీవాడికీ నువ్వు కంపల్సరీగా దండాలుపెట్టాలి. నువ్వు ఎన్నికల్లో గెలిచేక, వాళ్లే నీకు దండాలుపెడతారు"

వరలక్ష్మికి ఓ సందేహంవచ్చింది. "మన వీధి చివర జెండా చెట్టుదగ్గరుండే అప్పల్నర్స య్యక్కూడా నేను దండం పెట్టాలా?" అంది.

"ఏం, వాడేంపాపం చేసేడు?"

"నాలుగు నెల్ల క్రితం, హోల్‌సేల్ రేట్లో కుర్చీలు తెచ్చిపెడతానని నా దగ్గర నాలుగు వందలు పట్టుకుపోయి దగా చేసాడా గాడిద, వాడిని చెప్పుతో కొడదామంటే తప్పించుకు తిరుగుతున్నాడు" వరలక్ష్మి మాటల్లో కోపం స్పష్టంగా ధ్వనించింది.

"వాడు కుర్చీల కోసం డబ్బు పట్టుకుపోయినా, నడివీధిలో నలుగుర్ని మర్డర్ చేసినాసరే, వాడిప్పుడు ఓటరు మహాశయుడికిందే లెక్క. వాడు పట్టుకుపోయిన నాలుగు వందల గురించి కాదిప్పుడు ఆలోచించవలసింది. వాడికిద్దరు పెళ్లాలు. ఒక్కో పెళ్లానికి ఇద్దరేసి అన్నదమ్ములు. ఒక్కో అన్నదమ్ముడికి ముగ్గురేసి మరదళ్లు. అంటే మొత్తం వాడిచేతిలో పదిహేను ఓట్లు వున్నాయి. వాటినే నువ్వు గుర్తు పెట్టుకోవాలి. ఎన్నికలు వస్తున్నాయనగా, రూలింగ్ పార్టీలోవున్నవాళ్లు రైతులకి రుణాలు మాఫీ చేసే కార్యక్రమాలు చేబడుతుంటారు. అలాగే, నువ్వూ వాణ్ని కల్సుకుని, నీకు బాకీ వున్న నాలుగు వందలు ఇవ్వక్కర్లేదని ఇవాళే కబురు చేసెయ్. ఎవరో ఎందుకు? నేనే వెళ్లి ఆ శుభవార్త వాడికి చెప్పేస్తాను. ఇంకమరో విషయం. గత నాలుగేళ్ల క్రితం దాకా ఓటున్నవాణ్ని ఓటరు మహాశయా అని పిలవడం ఆనవాయితీగావుండేది. కానీ, ఈమధ్య ఓ గొప్ప పార్టీ నాయకుడు ఈ సంభోదనలో కూడా మరికొంచెం డెప్త్ మెయిన్‌టైన్ చేసేడు. "ప్రజలే నా దేవుళ్లు, వారు నివాసం వుండే ఇళ్లే నాకు దేవుడి గుళ్లు, వారిని సేవించుకోవడమే నా జీవిత పరమావధి" అంటూ డైలాగులు కొట్టేసరికి ధాంమంటూ జనం పడిపోయేరు. నువ్వూ అదే డైలాగ్ కొట్టాలి. నా ఇలవేల్పులు ఆరాధ్యదైవాలు ఎవరనుకున్నారు? ఏడుకొండల వెంకటేశ్వరుడనుకున్నారా? కాదు అన్నవరం సత్యనారాయణమూర్తనుకున్నారా? కాదు. బెజవాడకనకదుర్గనుకున్నారా? కాదు. కేవలం నా వార్డు ప్రజలే నాకు ఆరాధ్యదైవాలు అని జంకూ గొంకూ లేకుండా చెప్పెయ్! ఇంక మరో విషయం. బావ నిన్ను శారీరకంగా, మానసికంగా, రాజకీయంగా కూడాచాలాచాలా బాధలు పెట్టేడని చెప్పు. నీ మీద సింపతీ కలగడానికే చాడీలు, నిందలూ చాలా వుపయోగపడతాయి. ఇందులో తప్పూలేదు. నీ పాతివ్రత్య ధర్మానికొచ్చేలోటూ వుండదు. సంసారం మీద విరక్తి చెందినవాళ్లు గతంలో సన్యాసుల్లో





కలిసిపోయేవాళ్లు. కానీ ఈమధ్య అలాంటివాళ్లు రాజకీయాల్లో జాయినైపోతున్నారు. నువ్వు కూడా మరో రెండు నెలల్లో నీ కూతురి పెళ్లి చేసేసేక, పూర్తిగా ఈ వార్డు ప్రజల సంక్షేమానికి అంకితమైపోతానని గేస్‌కొట్టు, అన్నట్టు సినిమా వేషాలకోసం పారిపోయిన మన పవన్ కుమార్‌గాణ్ణి కూడా ఈ ఎలక్షన్ ప్రచారానికి వాడుకోవచ్చు''

"వాడు ఎక్కడున్నాడో వాడి జాడకూడా తెలియడంలేదు గదా! వాణ్నెలా వుపయోగించుకుంటాం?'' కాస్త బాధపడుతూ అంది వరలక్ష్మి.

"వాడు మనతోవుండక్కర్లేదు. వాడి పేరు వాడుకుంటేచాలు. మా బావ, నిన్ను రాజకీయ హింసలు పెడుతుంటే మన పవన్‌గాడు కథానాయకుల్లా అడ్డువచ్చాడని, వాడిని కూడా బావ తిట్టికొట్టి హింసించేసరికి వాడికి సహనం చచ్చిపోయి దేశాలు పట్టిపోయేడని చెప్పు. నీ కూతురికొచ్చిన సంబంధాలని కూడా బావే అర్థం పర్థంలేని విధంగా తిరగ్గొట్టేడని చెప్పు. నువ్వు కాబట్టి ఇన్ని బాధలు భరించి, చివరికి ప్రజాసేవలో జీవితాన్ని గడిపెయ్యడానికి నిర్ణయించుకున్నానని ఓ ఏడ్పుఏడ్చెయ్. బావ మీద ఎంత కోపం తెప్పిస్తే నీమీద వాళ్లకి అంత జాలి కలుగుతుంది. ఆ జాలే నీకు వాళ్ల చేత ఓట్లు వేయిస్తుంది. తర్వాత మనవార్డులోనే చాలామంది లేబర్ జనం కూడా వున్నారు. వాళ్ల పిల్లలు చూడ్డానికి మహా దరిద్రంగా కనిపించొచ్చు. అయినాసరే ఆ వీధిలోకెళ్లినప్పుడు వాళ్లని ఎత్తుకుని ముద్దాడు. ఇంటికి రాగానే డెట్టాల్‌తో ఓసారి, సబ్బుతో మరోసారి చేతులు కడుక్కోవచ్చు. అలాంటి పిల్లల్ని ఓ అయిదు సెకెండ్ల పాటు ఎత్తుకుని దించెయ్యడంవల్ల నీ సొమ్మేం పోకపోగా, వాళ్లకి నీ మీద అంత అభిమానం కలుగుతుంది. ఆ అభిమానమే నీకు ఓట్లు తెచ్చిపెడుతుంది. ఇవన్నీ మంచి పనులు కావూ, క్షుద్ర విద్యలని నువ్వనొచ్చు. కానీ చాలామంది పెద్దపెద్ద నాయకులు ఇప్పుడు వాడుతున్నవి ఈ క్షుద్ర విద్యలే కాబట్టి, నువ్వు వాడ్డంలో తప్పు కాదు. ఎందుకంటే నీ ప్రత్యర్థి అయిన ఆ సరస్వతీదేవి డబ్బులో పుట్టి డబ్బులో పెరిగింది. పైగా బోలెడంత చదువుకుంది కాబట్టి, ఆవిడ ఇలాంటి క్షుద్రవిద్యలు ప్రదర్శిస్తుందని నేను అనుకోను''

వరలక్ష్మికి నాయుడు చెప్పిన పద్ధతులు పూర్తిగా నచ్చకపోయినా సరస్వతి ఏ పనుల యితే చెయ్యదో ఆ పనల్ని తను చేసి చూపించాలనే నిర్ణయానికి మాత్రం వచ్చేసింది.



మర్నాటినించి డోర్ టు డోర్ ప్రచారం ప్రారంభమయింది. ఒక్కో ఇంటికీ వెళ్లేముందు వరలక్ష్మి చూపుడువేలు మీద కాసింత గ్లిజరిన్ వేసుకుని, ఆ వేలిని నుదుర్లకి తాకించి నీళ్లు వస్తున్నాయనగా, ఆ ఇంటికెళ్లి, నిన్న నాయుడు నేర్పించిన డైలాగుల్ని కన్నీళ్లతో కలగలిపి అప్పజెప్పేసింది. మధ్యలో కొన్ని సొంత డైలాగుల్ని కూడా కలిపి ఎదుటి వాళ్లని అనుకున్నదానికంటే ఎక్కువగానే ఆకట్టుకుంది. ఆవిడ చెప్పిన మాటల్ని అందరూ నమ్మేరే తప్ప ఎవరూ ఆవిణ్ని క్రాస్ ఎగ్జామిన్ చెయ్యలేదు. ఆవిడ తరఫున నాయుడు అందించిన జాకెట్టుబట్టని, కుంకుమభరిణెను కొంతమంది ఎటువంటి అభ్యంతరంలేకుండా పుచ్చుకున్నారు. మరికొంతమంది పుచ్చుకోడానికి సంశయించేరు. "వీటికీనేను అడుగుతున్న ఓట్లకి ఎటువంటి సంబంధమూ లేదమ్మా! మా ఇంట్లో వరలక్ష్మి వ్రతం చేసేను కాబట్టి వీటిని పంచుతున్నాను'' అంటూవరలక్ష్మి చాలా నమ్మకంగా చెప్పింది. నిజానికా డైలాగ్‌ని సుబ్బయ్యనాయుడు చెప్పమనలేదు. ఆవిడ సమయస్ఫూర్తి చూసేక, వచ్చే ఎన్నికలకి ఆవిడ తన సహాయం లేకుండానే ఎమ్మెల్యే సీటుకి పోటీ చేసెయ్యొచ్చనుకున్నాడు నాయుడు. ప్రతి వీధి చివర చిన్న సమావే




శంలాంటిది పెట్టి ఓ పాతికమంది జనం పోగయితేచాలు, మళ్లీ తన భర్తపెట్టిన బాధల గురించి ఇప్పుడు తనకి పోటీగా మరో లేడీ కేండేంటుకి మద్దతు ఇవ్వడంలోని దారుణం గురించి వివరించింది. వాటితోపాటు తన శేష జీవితాన్ని మీ అందరి సేవకీ అంకితం చేసే అవకాశమివ్వండీ అంటూ అర్థించి, గ్లిజరిన్ ఎఫెక్టుతో ప్రతీ చోటా గుప్పెడు గుప్పెడు కన్నీళ్లు ఒలకపోసింది. రాత్రయేసరికి ఆవిడ కళ్లు గ్లిజరిన్ వాడకంవల్ల భగ్‌భగ్ మంటూ మండేయిగాని, ఆవిడ సంపాదించిన సాను భూతి ఆవిడకా బాధని తెలియనివ్వలేదు.

తనని తిడుతూ తన భార్య వార్డులో అందరి అభిమానం, సానుభూతి సంపాదించేస్తోందన్న సంగతి తెలిసి చిలకలదాను కుతకుతలాడిపో యేడు. ప్రస్తుతం జరుగుతున్న పరిస్థితిని వివరించి ఇప్పుడేం చేద్దామంటారు అని జి.యమ్. అండ్ పార్టీని అడిగేడు.

"మీ ఆవిడ జాకెట్టు బట్టలు వంచితే మనవేనా వంచలేంది? మనవూ జాకెట్ పీసు లు వంచుదాం" అంది సరస్వతి.

"జాకెట్టు బట్టకి జాకెట్టు బట్ట సమాధానం అవదమ్మా! మనం తువ్వాళ్లు వంచుదాం. జాకెట్టు బట్టయితే ఒక్క ఆడమనిషికే వుపయో గవడుతుంది. కానీ తువ్వాళ్లయితే ఆడామగా తేడా లేకుండా అందరికీ వుపయోగవడ తాయి" అన్నాడు వరదరాజులు. ఆ అయిడి యా సరస్వతికి నచ్చినా, పూర్తిగా సంతృప్తివడ లేదు.

"మనం ఏ గిఫ్టు ఇచ్చినా దాన్ని చూసేక ఆ వరలక్ష్మి ఇచ్చిన గిఫ్టుని అందరూ మర్చిపో యేలా వుండాలి. మనం ఇంటికో తువ్వాలు ఇవ్వడంతోపాటు ఆడవాళ్లకి నైల్ పాలీములు, తిలకం సీసాలు, మగాళ్లకి ఒక్కో బాల్ పెన్నూ ఇద్దాం" అంది.

"ఈ అయిడియా బ్రహ్మాండంగా వుంది" అన్నాడు వరదరాజులు.

"బాగుంది, కానీ ఇవన్నీ వేల సంఖ్యలో కొనాలంటే మనకి గూబ అదిరిపోతుంది" అంటూ నసిగేడు జి.యమ్.

"నువ్వేం కంగారు వడకల్లుడూ. తువ్వాళ్ల సంగతి వదిలేస్తే మిగతా అయిటమ్సుకి నువ్వ నుకున్నంత ఖర్చేం అవదు. మన చిలకలదా నుగారికో ప్రాణస్నేహితుడున్నాడు. అతనికో పెద్ద ఫేన్సీస్టోర్సుంది. అందులోనించి నైల్ పాలీములు, తిలకం సీసాలు, బాల్ పెన్‌లు ఎన్ని వేలు కావాలంటే అన్నివేలు ఆయన హాఫ్‌రేటుకే మనకిప్పిస్తారు. ఏమంటారు దాను గారూ?" అంటూ దానుని అడిగేనరికి అప్పటికే ముఖానికి పట్టిన చెమటల్ని తుడుచుకుంటూ కంగారుగా అన్నాడు దాను. "నన్ను క్షమించండి సార్. మా ఫ్రెండుకీ నాకూ మొన్న చాలా పెద్ద గొడవొచ్చి విడిపోయేం. ఈసారికి మీరు వేరే షాపులో ఆ సామాన్లు కొనెయ్యండి"

సరస్వతీదేవిని, వరదరాజుల్ని మరో పాతిక మందిని తీసుకుని చిలకలదాను ప్రచారానికి బయలుదేరాడు. వాళ్లు అందించిన బహుమ తుల్ని అందరూ సైలెంటుగా పుచ్చుకున్నా కొంతమంది సైలెంటుగా ఊరుకోకుండా దానుని కొన్ని ప్రశ్నలు అడిగేరు. వాళ్లలా నిలదీసి అడుగుతారని ఊహించే, చిలకలదా ను సమాధానాన్ని సిద్ధం చేసుకుని బయలుదే రాడు.

"మీ ఆవిడ కూడా ఈ వార్డులో పోటీ చేస్తుండగా, మీరు మరో లేడీకేండిడేటుని గెలిపించాలనుకోవడంలో మీ ఉద్దేశం?" ఇదీ ప్రశ్న.

"ప్రజాసేవలో బంధుత్వాలకి స్థానంలేదు. మన వార్డు బాగుపడాలన్నదే నా ఉద్దేశం. ఆ పనిచెయ్యడానికి మా ఆవిడకన్నా మా మేడమ్ గారే సరైన మనిషని నా ఉద్దేశం. అందుకే వారికి నేను మద్దతు ఇస్తున్నాను"

"కార్పొరేటర్ పదవికి మీ ఆవిడ న్యాయం చేయలేదని మీరెలా అనుకుంటున్నారు?"

"ఆవిడ సంగతి నాకు బాగా తెలును కాబట్టి"

"మీకు బాగా తెలును కాబట్టి మీ ఆవిడా పోస్టుకి అన్‌ఫిట్ అని నిర్ణయించారు. కానీ ఆవిడ గురించి తెల్సినంత ఎక్కువగా మీకు మీ మేడమ్ గురించి తెలియదుగా. అలాంట ప్పుడు ఆవిడా పోస్టుకి సూటబుల్ అని మీరెలా అనుకుంటున్నారు?"

"అది గుర్రం అని తెలిశాక, అది పరుగెత్తగ లదా అని ఎవరైనా చెప్పగలరు కదండి. మా



మేడమ్‌గారికి చదువుంది, సంస్కారం వుంది. డబ్బుంది. ప్రజాసేవ చేయాలనే అభిలాష వుంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ వార్డు కోసం నేనేం చెయ్యాలీ అని ఆలోచించే మనిషి. కానీ మా ఆవిడ ఈ వార్డునుంచి ఈ పదవినుంచీ నేనెంత సంపాదించగలనూ అని ఆలోచించేమనిషి. ఆ విషయంలోనే మా ఇద్దరి మధ్యా అభిప్రాయభేదాలేర్పడి వేరుపడ్డాం''

''ఇలా అయినవాళ్లనించి వేరుపడి పరాయివాళ్లకి సాయపడ్డం మంచిదే అని మీరనుకుంటున్నారా?''

''వెనకటికి ఇదే ప్రశ్నని రామాయణం లైములో విభీషణుణ్ణి కొంతమంది అడిగేరట. దానికాయన ఏం చెప్పాడంటే నేను అన్యాయాన్ని సహించను. కానీ మా అన్న రావణాసురుడు చాలా అన్యాయాలు చేసేడు. నేను హితవు చెప్పేను. వినకుండా తగిలేశాడు. అప్పుడు ధర్మమూర్తి అయిన రాముడితో చేతులు కలిపి అన్యాయాన్ని హతంచేసి న్యాయాన్ని పరిరక్షించానే తప్ప అన్నయ్యకదాని రావణాసురుడి దుర్మార్గాలకి వత్తాసు పలకలేదూ అన్నాడు. సరిగ్గా నాసమాధానమూ అదే'

అతను చెప్పిన జవాబు ఎవరికి సంతృప్తి కలిగించిందో, ఎవరికి ఛీ అనిపించిందో తెలీదుగాని, మేడమ్ సరస్వతికి, ఆమె తండ్రి వరదరాజులుకి వాళ్ల ద్వారా తెలుసుకున్న జి.యమ్.గారికి మాత్రం మహదానందం కలిగించింది. ఇలా కొన్నిరోజులపాటు సాగింది ప్రచారం. ఎవరు ఎలా ప్రచారం చేస్తున్నారో ఇరుపక్షాలు ఎప్పటికప్పుడు తెల్సుకుంటూనే వున్నాయి. ఓటు వున్నవాళ్లు, లేనివాళ్లు కూడా అటు చిలకలదాసూ అండ్ పార్టీ, చెప్పిందీ విన్నారు. ఇటు వరలక్ష్మి చెప్పింది విన్నారు. వాళ్లు ఇచ్చినవీ తీసుకున్నారు. వీళ్లు ఇచ్చినవీ తీసుకున్నారు. కానీ ఎవరి అభిప్రాయం ఏవిటో ఎవరూ బయటికి చెప్పలేదు. ఎలక్షన్ ప్రచారం మరింత ముమ్మరమైంది. అన్ని వార్డుల్లోనూ ప్రచారం బాగానే జరుగుతున్నా చాలా మందికి ఆసక్తి కలిగించింది పదిహేడోనెంబరు వార్డే. ఆ వార్డులోని ప్రజలు, చిలకలదాసు ఆఫీసులోని జనం, వాళ్ల మిత్రులు అందరూ ఆ వార్డు గురించే ప్రత్యేకంగా అడిగి విశేషాలు తెలుసుకుంటున్నారు. దానుని కల్సినవాళ్లు- ''మీ ఆవిడగారి ప్రచారం ఎలా వుందండి? ఆవిడ గెలిచే అవకాశాలు వున్నాయంటారా?'' అంటూ జవాబు చెప్పడానికి ఇరకాటం కలిగే ప్రశ్నలు వేసేరు. వరలక్ష్మినైతే స్థానికంగా వుండే చిన్న చిన్న పత్రికలవాళ్లు ఆవిడకి చిరాకు కలిగించే ప్రశ్నలువేసి విసిగించేరు. ''ఇది మీకూ మీ ఆయనకీ జరుగుతున్న పోటీ అని అందరూ అనుకుంటున్నారు. దీనిమీద మీ అభిప్రాయం ఏవిటి? ఒకవేళ మీరు ఓడిపోతే, మీ ఆయనగారి సారథ్యంలో జరిగిన ఆ పరాజయాన్ని మీరు సంతోషంగా స్వీకరిస్తారా?'' ఇలా ఎన్ని ప్రశ్నలు వేసినా ఆవిడ ఇచ్చిన సమాధానం కేవలం వాళ్లమీద కోపం ప్రదర్శించడమే. ఎలక్షన్ టైములో అన్నిరోజులూ చేసే ప్రచారం ఒకఎత్తు. ఎలక్షన్ ముందు రోజు చేసే ప్రచారం ఒక ఎత్తుగా వుంటుంది. నిజానికి ఆరోజు పబ్లిగ్గా ఎటువంటి ప్రచారమూ చెయ్యకూడదు. కానీ ఆరోజే రహస్య ప్రచారం, ఇచ్చుకోడాలు, పుచ్చుకోడాలూ జరుగుతాయి. నిశ్శబ్దంగా జరిగే ఆ తతంగమే ఇప్పుడు గెలుపు ఓటమిల్ని తేలుస్తున్నాయి. చిలకలదాసు ఓటర్లకి డబ్బిచ్చే విషయం ప్రస్తావించేడు. ''తువ్వాళ్లు, గాజులు పంచేంకదా. ఇంకా డబ్బెందుకు?'' అన్నాడు జి.యమ్. డబ్బుతో ఓట్లు కొనడం ఇష్టంలేదనే భావాన్ని ధ్వనింపజేస్తూ. అతని అభిప్రాయాన్ని వరదరాజులు కాదన్నాడు. అతనికి గతంలో ఎలక్షన్లో నిలబడ్డ అనుభవం వుంది కాబట్టి, డబ్బుతో ఓట్లు కొనడం ఓ ఆనవాయితీ గాని తప్పు పనేంకాదని చెప్పేడు ''మీ ఆవిడేం డబ్బు పంచిపెడుతున్నట్టు లేదే అలాంటప్పుడు మనం మాత్రం ఎందుకివ్వడం?'' అంటూ రీజన్ లాగింది సరస్వతి.

''మా ఆవిడ డబ్బు పంచడంలేదు. కాబట్టే మనం ఒక్కో ఓటుకి ఇరవై ఇస్తే సరిపోతుంది. అదే మా ఆవిడ డబ్బుతో బేరం ఆరంభిస్తే మనం ఒక్కో ఓటుకి యాభై, డెబ్భైదాకా వెళ్లాల్సివుంటుంది'' చిలకలదాసు చెప్పిందీ కరెక్ట్‌లా అనిపించింది. ఆ వార్డేకాదు. ఏ వార్డులోనైనా అందరూ డబ్బుకి ఆశపడే ఓట్లు వెయ్యరు. డబ్బుకి, ఓట్లకి లింకు పెట్టే వాళ్లెప్పుడూ తక్కువమందే వుంటారు. కాకపోతే ఆ డబ్బు ఖర్చు, దాన్ని ఓటర్లకి అందజేసే మధ్య



వర్తులమీదే ఆధారపడివుంటుంది. చిలకలదానుగాని, వరదరాజులుగాని డైరెక్టుగా వెళ్లి ఓటర్లకి డబ్బు ఇవ్వలేరు కాబట్టి కొంతమంది మధ్యవర్తులు ద్వారా ఆ కార్యక్రమాన్ని నిర్వహించేరు. ఇంక మన విజయానికి ఢోకాలేదని అందరూ ధైర్యపడ్డారు.

పోలింగ్ జరిగింది.

ఫలితాలు ప్రకటించేరు.

వరలక్ష్మి పదిహేడువందల డబ్బై మెజార్టీతో గెలుపొందింది.

సరస్వతి ఓడిపోయింది.

మైకులో ప్రకటన వినబడగానే చిలకలదాను చలించిపోయేడు. తన కాళ్లకింద నేల కూరుకుపోతున్నట్టుగా అటూ ఇటూ ఊగిపోయేడు. ఇప్పుడేం చెయ్యాలి? వరలక్ష్మికి మద్దతునిచ్చినవాళ్లు ఆమె పేరు చెప్తూ నినాదాలు చేస్తున్నారు. అవి వరలక్ష్మి జిందాబాద్ జిందాబాద్ అని కాకుండా, చిలకలదాను డౌన్ డౌన్ అన్నట్టుగా వినిపించేయి. వాళ్లెవరికీ కనపడకూడదని అక్కడనించి గబగబా వచ్చి తన విక్కీమోపెడ్ ఎక్కి బయలుదేరేడు. ఎలక్షన్ ఫలితాలు తెలిసిన సరస్వతి, వరదరాజులు సడన్‌గా పక్షవాతం వచ్చినట్టుగా ధన్‌మంటూ నేలమీద పడిపోయేరు. జి.యమ్.గారు మాత్రం దెయ్యం పట్టినవాడిలా జుట్టు పీక్కుంటూ, వెర్రిగా అరుస్తూ చిలకలదానుని పట్టుకోవడానికి కార్లో బయలుదేరాడు.

చిలకలదాను విక్కీమీద ఓ వీధిలో కొచ్చేసరికి ఎదుట్నించి వరలక్ష్మి టాపులేని జీపులో ఊరేగుతూ వస్తోంది. ఆవిడ మెడలో అప్పటికే చాలా దండలున్నాయి. జీపుని ఆపి మరికొంతమంది దండలువేసి బొట్లు పెడుతున్నారు. సుబ్బయ్యనాయుడుగాడు బాగానే బందోబస్తు చేసేడని దాసు మనసులోనే ఉక్రోషంగా అనుకున్నాడు. వాళ్ల కళ్లబడ్డం ఇష్టంలేక విక్కీని వెనక్కి తిప్పి వెళ్లిపోదామనుకున్నాడు. కానీ వీధినిండా జనం నిండిపోవడంవల్ల తిరిగి వెళ్లిపోవడం అంత ఈజీ కాలేదు. జీపుకి ఆ వైపు ఈవైపూ కూడా కొన్ని వాహనాలు ఆగిపోయేయి. జీపులో నిలబడి హేండ్‌మైకు పట్టుకుని బిగ్గరగా నినాదాలు చేస్తున్న సుబ్బయ్యనాయుడు జనంలో వున్న చిలకలదానుని చూసేడు. వరలక్ష్మి చెవిలో ఏదోచెప్పి, జీపులోనించి గెంతి, గబగబా దాను దగ్గరకెళ్లి పట్టుకుని- "రా బావా..." అన్నాడు. "నేను రాను" అంటూ దాను అతని చేతుల్ని విదిలించుకున్నాడు. మరో ఇద్దరి సాయంతో నాయుడు దానుని జీపు దగ్గరికి చేతులమీద ఎత్తుకుని తీసుకువచ్చేడు. అతను పారిపోకుండా గట్టిగా పట్టుకున్నాడు. వరలక్ష్మి మైకు అందుకుని చుట్టూ వున్న ప్రజానీకంతో చెప్పింది. "ఈనాడు నేనీ విజయాన్ని సాధించేనంటే అందుక్కారణం నా పతిదేవుడే. వారి అండదండలు, ఆశీర్వాదాలు పుష్కలంగా లభించబట్టే నేను గెలిచేను" అనేసి గబగబా నాలుగుదండలు తీసి భర్త మెడలో వేసేసి కాళ్లకి నమస్కారం చేసింది. నాయుడు మైకు అందుకుని "చప్పట్లు కొట్టండి" అని అరిచేడు. జనం చప్పట్లు కొట్టేరు. నాయుడు మరికొంతమంది దానుని పైకెత్తి "మా విజయానికి ఆశీస్సులందించిన చిలకలదానుగారికి జై" అంటూ నినాదాలు చేసేడు.

జనం చేతులమీద గాల్లో కూర్చున్న చిలకలదాను ఎందుకో ఓసారి జామ్ అయిపోయిన వాహనాలవైపు చూసేడు. అందులో ఓ కారు, ఆ కార్లో నిప్పులుకక్కే కళ్లతో గుర్రుమంటూ చూస్తున్న జి.యమ్.గారు కనిపించేరు. అంతే! గాల్లో ఎగురుతున్న బెలూన్ ధన్‌మంటూ పేలిపోయి కిందకి రాలిపోయినట్టుగా జర్రుమంటూ కిందకి జారిపోయేడు.

★ ★ ★

జి.యమ్.గారి బంగళాలో, హాలుమధ్య చిలకలదానుని దేశద్రోహిని నిలబెట్టినట్లు నిలబెట్టేరు. ప్రధానమంత్రిని చంపేసిన బాడీగార్డ్సుని ప్రజలు చూసినంత హీనంగా చూస్తూ జి.యమ్. తిడుతున్నాడు. అతని భార్య దానుతో వుక్రోషంగా మాట్లాడుతోంది: ఆ మాటల్లోనించి తిట్లని బయటికి తీసేస్తే అసలు ఒక్కమాట మిగలదు. వరదరాజులు అయితే జైలుశిక్షకి భయపడి తమాయించుకున్నాడు గాని, లేకపోతే అతను దానుని మర్డర్ చేసే ప్రయత్నంలోనే వున్నాడు.

"మమ్మల్ని నమ్మించి ఇంత దగా చేస్తావా? మీ ఆవిడతో గొడవపడినట్లే పడి, మాకు సపోర్టు చేస్తున్నట్లే నటించి, . ఆవిడకి ఓట్లు వేయించి గెలిపిస్తావా? మా దగ్గర డబ్బు




తీసికెళ్లి మీ ఆవిడకోసం ఖర్చుచేస్తావా?''

''క్షమించండి సార్... నేనేం అలాంటి వెధవ పని చెయ్యలేదు'' దాను నంజాయిషీ చెప్పుకో బోతున్నా ఎవరూ వినిపించుకోలేదు. ''మా డబ్బుని నువ్వు మీ ఆవిడకోసం ఖర్చు చెయ్యక పోతే మీ ఆవిడెలా గెల్చింది? ఏం మా ఆవిడ కంటే మీ ఆవిడ గొప్పదని ఆవిణ్ణి గెలి పించేరా? ఆ చిట్టితల్లి పోటీచేస్తే మీ ఆవిడ గెలవడం కష్టమని చెప్పి, మాచేత రెండు లక్షల చిల్లర ఆవిడకిప్పించేవు. ఓటర్లకిస్తానని చెప్పి మరో లక్ష తీసుకెళ్లి, దాన్ని మీ ఆవిడచేత పంపకాలు చేయించేవు''

''నో సార్... నేనేం అలాంటి దగుల్బాజీ పనిచెయ్యలేదు'' దాను దాదాపు ఏడుస్తూ అన్నాడు.

''నువ్వేదగుల్బాజీ పనిచెయ్యకపోతే ఇప్పు డు మీ ఆవిడ అంతమంది జనంమధ్య నీ మెడలో దండలువేసి, పాదాభివందనంచేసి, నా గెలుపుకి అసలు కారణం వీరి ఆశీర్వాదాలే అంటూ మైకులో ఎందుకు అరిచింది?''

''అది... ఆవిడకి నా మీదున్న రెస్పెక్ట్''

''డోంటాక్ రబ్బిష్! నీమీద అంత రెస్పెక్ట్ ఏడిస్తే నువ్వు పోటీనుంచి విత్‌డ్రా అవ్వమంటే ఎందుకవ్వలేదు? నో... ఇదంతా మీ భార్యాభర్త లిద్దరూ కలిసి ఆడిన నాటకం, ఇందువల్ల మాకు ఏడు లక్షల రూపాయలు లాస్. ఏడు తరాలకి సరిపడే అవమానం జరిగేయి. నీకు ప్రమోషన్ ఇవ్వడం కాదు. నిన్ను సూపర్నెంటు పోస్టునించి మామూలు గుమాస్తా ఉద్యోగానికి రివర్ట్ చేస్తున్నాను. గెటవుట్'' అంటూ దానుని గబగబా బయటికి లాగేసి తలుపులు ధన్ మంటూ మూసేశాడు జి.యమ్.

★ ★ ★

చిలకలదానుకి జీవితంమీద విరక్తి కలి గింది. జి.యమ్.గారి భార్యని గెలిపించడానికి తన శక్తంతా ఉపయోగించి కృషిచేశాడు. అందుకోసం భార్యతో గొడవపడ్డాడు. కుటుంబంనించి విడిపోయేడు. ఇంతా చేస్తే తనకి లభించింది ''నమ్మకద్రోహి'' అనే బిరు దు. మేనేజర్‌గా ప్రమోట్ అవకపోగా సూప ర్నెంటు పోస్టునించి మామూలు గుమాస్తా ఉద్యోగానికి జారిపోవడం? ఇదీ తను సాధించిన ఘనత. ఆఫీసు అనే వైకుంఠపా ళీలో తను చిన్నసైజు నిచ్చెన కూడా ఎక్కలేక పోగా, పెద్ద పాము నోటిలోపడి జర్రుమంటూ కిందకి జారిపోయేడు. సుబ్బయ్యనాయుడు చె ప్పినట్టు తను ఒకటోరకం అసమర్థుడు. అందుకే ఈ అసమర్థుడు చేసిన పోరాటం అస్తవ్యస్తంగా సాగింది. సత్ఫలితాన్ని సాధించ లేకపోయింది. అంతేకాకుండా తనమీద నమ్మ కద్రోహి అనే ముద్రవేసింది.

తనిప్పుడు ఇంటికి వెళ్తే ఏమవుతుంది?- ''నాకు వ్యతిరేకంగా పనిచేసి అందరిలోనూ మన కుటుంబానికి అప్రతిష్ఠ కలిగించడం తప్ప నన్నేమైనా సాధించగలిగేవా?'' అని వర లక్ష్మి ప్రశ్నిస్తుంది. ''నువ్వు ఎంత ప్రయాసప డినా మేనేజరుగా ప్రమోట్ కాలేకపోయావు. కానీ నేను కొన్నివేల జనాభా వున్న ఓ వార్డుకి కార్పొరేటర్నవగలిగేను. నీ ప్రమోషన్ కేవలం మీ జి.యమ్. ఒక్కడి చేతిమీదగా జరగాల్సిన పని, అయినా ఆ ఒక్కణ్ణి మెప్పించలేకపో యేవు. కానీ నేను? కొన్నివేల మందిని మెప్పించి కార్పొరేటర్నయ్యాను. నేను నాయకు రాల్ని అనిపించుకునే సమయానికి మీరు నమ్మకద్రోహిగా మిగిలిపోయి, గుమాస్తా సీటు లోకి జారిపోయేరు. ఇప్పుడు చెప్పండి నేను ఫలానా ఫలానా ప్రైవేటు కంపెనీలో పనిచేస్తు న్న ఫలానా ఫలానా గుమాస్తాగారి గృహలక్ష్మిన నిపించుకోవడం నాకు గొప్పా? ఫలానా ఫలానా కార్పొరేటర్‌గారి భర్తననిపించుకోవడం మీకు గొప్పా?'' అంటూ దెప్పిపొడుస్తుంది. జి.య మ్.గారు తనని నమ్మకద్రోహి అని తిట్టి డంకంటే, తన భార్య తనని ''చేతకాని వెధవ'' అని విమర్శించడాన్నే తను భరించలే డు. ఇప్పుడేం చెయ్యడం? అని ఆలోచిస్తూనే గుడివైపునించి వస్తుంటే భగవద్గీత మైకులో నించి ఖంగుమంటూ వినిపిస్తోంది. అతను యాంత్రికంగానే విక్కీని ఆపుచేసి, చెప్పులు బయటపెట్టి గుడిలోకి వెళ్లేడు.

ఇతను సాక్షాత్తు వ్యాసమహర్షే అనిపించేలా కనిపిస్తున్న ఓ స్వామీజీ, అక్కడ కూర్చున్న భక్తులకు భగవద్గీతలోని కర్మయోగాన్ని విని పిస్తున్నాడు. చిలకలదాను గూడా భక్త సమూ హంలో కూర్చుని వినసాగేడు.

''మయి సర్వాణి కర్మాణి

నన్న స్యాధ్యాత్మచేతసా



నిరాశీర్నిర్మమో భూత్వా
యుధ్యస్వ విగతజ్వరః''

స్వామీజీ ఆ శ్లోకానికి అర్థం వివరిస్తున్నాడు. "సమస్త కర్మలను నాయందు అధ్యాత్మ చిత్తముతో సమర్పించి, ఆశగాని, మమకారముగాని లేనివాడవై నిశ్చింతగా యుద్ధము చేయుము అని శ్రీకృష్ణ భగవాన్లవారు శెలవిచ్చేరు. ఇక్కడ సర్వాణి, కర్మాణి అని చెప్పుటవలన, ఒకటి రెండు కర్మలు కాదని, మనం చేసే సమస్త కార్యములను ఈశ్వరార్పణ బుద్ధితో ఆచరించాలి అని అర్థం చెప్పుకోవాలి. అర్జునుడు క్షత్రియుడు కాబట్టి, యుద్ధం చేయడం క్షత్రియధర్మం కాబట్టి అతన్ని యుద్ధం చేయమని శ్రీకృష్ణులవారు ఉపదేశించారు. కానీ ఇది అన్నివర్గాలు, అన్ని తరహాలవారికీ అన్వయించే ఉపదేశమిది. చివరికి వారే, వారివారి సాంప్రదాయోచిత కార్యాలని ఈశ్వరార్పణ బుద్ధితో ఆచరించాలి. మనందరి చిత్తములు ప్రాపంచిక భావములతో, దృశ్యవికారములతో నిండియుండును. దైవానికి, పరమాత్మకి అక్కడ చోటుదొరకడం కష్టం. ఎందుకంటే మనది ప్రాపంచిక చిత్తమేగాని, ఆధ్మాత్మిక చిత్తముకాదు. ఈ దృశ్య ప్రపంచమంతా కల్పితము. అట్టి కల్పిత, మిధ్యా ప్రపంచమున వివేకవంతుడైన వ్యక్తి ఏ పదార్థమందు ఆశగాని, మమకారముగాని ఎలా వుంచుకోగలడు?

కాబట్టి ఆశను, మమకారమును వెడలగొట్టి, మనుమలంతా పవిత్ర భగవదర్పిత చిత్తముతో తన విద్యుక్త కర్మలను ఆచరించాలీ అని కృష్ణభగవానులవారి ఉపదేశం. ఇందులో విగతజ్వరః అనే మాటకి మనం అర్థం చెప్పుకోవాలి. జ్వరాలు రెండు రకాలు. ఒకటి బాహ్యజ్వరము. రెండు అభ్యంతర జ్వరము. బాహ్యజ్వరమూ అంటే శరీరానికొచ్చే జ్వరం. దాన్ని ఔషధాలతో నివారించుకోవచ్చు. ఇంక అభ్యంతర జ్వరమంటే మానసికంగా వచ్చే జ్వరం అని అర్థం. ఈ జ్వరాన్ని నివారించడాన్నిక్కూడా నాలుగు ఔషధాలున్నాయని భగవంతుడి ఉవాచ. అవేమిటంటే, ఒకటి ప్రతిమానవుడు ఆధ్యాత్మ చిత్తము కలిగివుండడం, అంటే తన మనసుని భగవధ్యానంలో లగ్నం చేసుకోవడం, రెండు భగవదార్పితమైన నిర్మలమైన చిత్తముతో సమస్త కర్మలను ఆచరించి, వాటి ఫలితాన్ని భగవంతునికి అర్పణ చేయడం, మూడు, ఆశల్ని పూర్తిగా వదులుకోవడం, నాలుగు మమకారం అనే గుణాన్ని దగ్గరకి రానివ్వకపోవడం''

ఇలా స్వామీజీ కర్మయోగంలోని శ్లోకాలని చెప్పుకుపోతూ, వాటి అర్థాలను, తాత్పర్యాలను వివరిస్తున్నాడు. చిలకలదాసు ప్రతిమాటా శ్రద్ధగా విన్నాడు. వింటూనే ఆలోచనలో పడ్డాడు. కర్మలను ఆచరించుట మానవుల కర్తవ్యమనే మాటని అతనంతగా పట్టించుకోలేదు. మనసుని భగవంతునిమీద లగ్నం చేయడం గురించే ఆలోచిస్తున్నాడు. శ్రీకృష్ణుడు చెప్పినట్టుగా తనకు మానసికజ్వరం వచ్చింది. దాన్నించి నివారణ పొందాలంటే ఆశల్ని చంపుకోవాలి. మమకారాన్ని వదులుకోవాలి. అలా చెయ్యాలంటే ఇక్కడ వుండకూడదు. నిప్పులమంట దగ్గర కూర్చుని దానివేడి మనకి తగలకూడదనుకోవడం మూర్ఖత్వమే అవుతుంది. అంచేత పూర్వకాలంలోని మునులంతా తపస్సు చేసిన అడవులకే తనూ వెళ్లిపోవాలి. ఈ ఆలోచన వచ్చిందగ్గర్నించి, అదే అతన్ని బానినగా మార్చి "వెళ్లు వెళ్లు" అంటూ శాసించనారంభించింది. అక్కడ నించి లేచి సరాసరి ఓ బట్టలషాపుకెళ్లి కాషాయవస్త్రాలు కొని, అక్కడే వున్న టైలరుతో తనకు కావలసిన విధంగా కుట్టించుకున్నాడు. కమండలాలు షాపులో దొరకొచ్చేమోగాని, తపస్సుకి వాడే దండం మాత్రం రెడీమేడ్‌ది అమ్మరు కాబట్టి, అప్పటికప్పుడు ఓ కార్పెంటర్‌కి ఎక్స్ట్రా ఛార్జి ఇచ్చి దండాన్ని తయారుచేయించుకుని ఆరాత్రి బస్సులో మోదుపల్లి బయలుదేరాడు.

మోదుపల్లి చిన్నవూరు. ప్రత్యేకమైన బస్‌స్టాండు అంటూ లేదు. రోడ్డుమీదే బస్సు ఆగింది. అక్కడికి ఫారెస్టు నాలుగు కిలోమీటర్ల దూరం అని ఎవర్నో అడిగి తెలుసుకుని, అక్కడ్నించి నడుచుకుంటూ వెళ్లేడు. అడవిలో ఓ వందగజాలు వెళ్లేక ఓ నది, దానిపక్కనే చెట్లు కనిపించేయి. అదే తన తపస్సుకి సరైన స్థలమనుకున్నాడు. నదిలో స్నానంచేసి, ఒంటిమీదున్న బట్టలు పారేసి, కాషాయవస్త్రాలు ధరించి ఓ చెట్టుకింద కూర్చుని తపస్సు ఆరంభించబోయేడు. అంతలోనే అతనికో




సందేహం వచ్చింది. తను ఇప్పుడు ఏ దేవుణ్ణి ధ్యానించాలి? హిందువులకి ఒక్కదేవుడు కాదు. ముగ్గురున్నారు. బ్రహ్మకోసం ప్రార్థిస్తే? వ్రుహుఁ. అతను రాయవలసిన రాత ఏదో తను పుట్టకముందే రాసేశాడు. ఆ రాత ప్రకారమే, తను ఇన్ని కష్టాలు, నిష్ఠూరాలూ అనుభవించి ఫారెస్టుల పాలయ్యాడు. ఇంక అతను ఏం ఒరగబెడతాడని అతని కోసం ప్రార్థించడం? ఈశ్వరుణ్ణి ధ్యానిస్తే బెటర్‌గా వుంటుంది. అతను భోళాశంకరుడు. సులభంగా అనుగ్రహిస్తాడు. అనుకుంటూ కళ్లు మూసుకోబోయి మళ్లీ ఆగేడు. ఏ మునీశ్వరుడు తీవ్రంగా తపస్సు చేసినా దేవేంద్రుడు వుడుక్కుని, ఏ ఊర్వశినో, ఏ మేనకనో పంపించి, డేన్సులాడించి తపస్సుని డిస్టర్బ్ చేస్తాడని పురాణాలూ చెప్తున్నాయి. ఈమధ్య వచ్చిన టి.వి. సీరియల్స్‌లోనూ చూపించేరు. అంచేత ఆ దేవవేశ్యలు వచ్చినా వాళ్లు డేన్సు చెయ్యడానికి ఓపెన్ ప్లేస్ వుండకూడదనిపించి ఆ చెట్టుకిందనుంచి లేచి మరో చెట్టుకింద కూర్చున్నాడు. ఔనూ తపస్సనేది రాత్రింబగళ్లూ చెయ్యాలా? లేక పగలంతా తపస్సు చేసి రాత్రి పూట పడుకోవచ్చా? ఈ ప్రశ్నకి వెంటనే జవాబు దొరకలేదు. "సర్లే మనకింకా తపస్సు కొత్త కాబట్టి కొన్నాళ్లపాటు పగలు తపస్సుచేసి, రాత్రిళ్ళు పడుకునేలా ఏర్పాటు చేసుకుందాం" అని నిశ్చయించుకుని కళ్లు మూసుకుని తపస్సు ఆరంభించేడు.

చిలకలదాసు ఏమైపోయేడో తెలియక వరలక్ష్మి ఆందోళనపడింది. సుబ్బయ్యనాయుడు కొంతమంది మనుషుల్ని పెట్టి నాలుగుచోట్లా వెదికించి దాసు ఆఫీసుక్కూడా శెలవు పెట్టలేదు కాబట్టి అతను కావాలనే ఎక్కడికో వెళ్లిపోయేడని గ్రహించేరు. ఎందుకైనా మంచిదని పోలీస్ కంప్లయింట్ కూడా ఇచ్చేరు. తపస్సు చేసుకుంటున్న చిలకలదాసుకి ఓ నెలగడిచేసరికి రవంత విరక్తి కలిగింది. ఉదయాన్నే లేచి నదిలో స్నానం చెయ్యాలి. తనకి వేణ్ణీళ్లు స్నానం చెయ్యడం అలవాటు. పైగా తెచ్చుకున్న సబ్బు అయిపోయింది. ఉదయం, మధ్యాహ్నం, రాత్రి పళ్లూ, కాయలూ తినడం... అతనికి వారానికి రెండుసార్లుమందు పుచ్చుకోవడం, తరచుగా బిర్యానీలు తినడం అలవాటు. కానీ అవేం ఇక్కడ దొరకవు. ఒక్కసారి సిటీకెళ్లి తనక్కావలసినవి తినేసి, తాగేసి వచ్చేద్దామా అనుకుంటూనే నిగ్రహించుకున్నాడు. అంతకుమించి అతనికి మరే ఇబ్బందీ కలగలేదు. అలా నాలుగునెలలు గడిపేశాడు.

మోదుపల్లి ఫారెస్టు గంధంచెక్కలకి ప్రతీతి. ఆ ఫారెస్టులో గత సంవత్సరంనుంచి తరచుగా గంధంచెక్కలు అపహరించబడుతున్నాయి. ఫారెస్టు పోలీసులు వేసిన మామూలు నిఘాకి ఆ స్మగ్లర్సు దొరకలేదు. ఫారెస్టు ఆఫీస

రుగారు తనకింద పనిచేసే ఇనస్పెక్టర్లని, గార్డుల్ని నిలబెట్టి, చెడామడా తిట్టేసారు "దొంగతనాలు రోజురోజుకీ ఎక్కువైపోతున్నాయని పై అధికారులు నన్ను వాయించేస్తున్నారు. మీరా దొంగల్ని పట్టుకోకుండా ఏంచేస్తున్నారు? వాళ్లతో లాలూచీ అయిపోయి లంచాలు తీసుకుని వాళ్లని వదిలేస్తున్నారా? ఒక్కవారం రోజుల్లోగా మీరా దొంగల్ని పట్టుకోకపోతే సస్పెండ్ చేస్తాను జాగ్రత్త" అంటూ తీవ్రంగా హెచ్చరించేరు. దాంతో పోలీసులు ఒళ్లంతా కళ్లు చేసుకుని రాత్రింబగళ్లు దొంగలకోసం నిఘావేసేరు. ఆ వారంలోనే ఒకరోజు రాత్రి చిలకలదాసు తపస్సు ముగించుకుని, ఓ రెండు పళ్లుతిని, ఓ చెట్టు కొమ్మమీద పడుకున్నాడు. అదే సమయంలో గంధం చెక్కల్ని ఫుల్‌గా లోడ్‌చేస్తున్న ఓ లారీ ఆ చెట్టుపక్కనించి వెళ్లింది. ఆ శబ్దానికి దాసు మేల్కొన్నాడు. లారీలోనించి రెండు గంధపుచెక్కలు కిందపడ్డం గమనించాడు. అన్ని ధర్మాల్లోకి గొప్పధర్మం పరోపకారం చేయడమేనని ఎవరో చెప్పిన విషయం గుర్తొచ్చి, గభీమని చెట్టుమీదనించి గెంతి, ఆ రెండు చెక్కల్ని చెరో చేత్తో పట్టుకుని "ఆపండీ... లారీ ఆపండి" అంటూ లారీ వెంట పరిగెత్తాడు. అతనికి లారీ అందలేదు. కానీ అక్కడే నిఘావేసి వున్న పోలీసుల కంట పడిపోయేడు.



**కో**ర్టులో చిలకలదాసు చెప్పిన కథంతా శ్రద్ధగా విన్న ప్రేక్షకులకి, లాయర్లకీ, చివరికి జడ్జీకి కూడా అతనిమీద జాలి కలిగింది. అతను చెప్పింది కట్టుకథని పి.పి.గారు కూడా ఖండించలేకపోయారు. ఆడియన్సులో వరలక్ష్మి, నాయుడు, రత్నకుమారి కూర్చున్నారు. వారూ దానువైపు జాలిగానే చూస్తున్నారు. కొత్త నటీనటుల్తో సినిమా తీస్తామని ప్రకటించిన నిర్మాతలు దాను కొడుకు దగ్గర్నించి పదివేలు లాక్కుని పరారయ్యేసరికి అతనూ ఈమధ్య ఇంటికొచ్చేసి ప్రస్తుతం తల్లి పక్కన కూర్చున్నాడు.

జడ్జీగారు తీర్పు వినిపించేరు.

"ఎలకలపూడి చిలకలదాసు నిజంగా మానసిక వైరాగ్యం పొంది, అడవుల్లో తపస్సు చేస్కోడానికి వెళ్లేడు తప్ప, మోదుపల్లి అడవుల్లో జరుగుతున్న గంధంచెక్కల దొంగతనానికి, అతనికీ ఎటువంటి సంబంధంలేదని కోర్టువారు విశ్వసించడంవలన అతన్ని నిర్దోషిగా భావించి కేసు కొట్టివేయడమయినది. సదరు ముద్దాయి మోక్షగామియై తపస్సు నాచరించడానికి కోర్టువారు ఆక్షేపణ చేయకపోయినా, గవర్నమెంటు ప్రొటెక్టెడ్ ఏరియాల్లో తపస్సు ఆచరించాలనే ఆయన ఉద్దేశానికి మాత్రం కోర్టు అభ్యంతరం తెలియజేస్తోంది"

చిలకలదాసు విడుదల అయ్యేడు. అతనికి ఇంటికివెళ్లి మళ్లీ సాంసారిక జీవితంలో బ్రతకాలనిలేదని భార్య, బిడ్డలతో ఖచ్చితంగా చెప్పేసేడు. వాళ్లెంత ప్రాధేయపడినా అతను వినలేదు. ఓ దేవాలయ మంటపంలో కూర్చుని దైవధ్యానం ఆరంభించేడు. ఓ కార్పొరేటరు గారి భర్త గుళ్లో కూర్చుని చిడతలు వాయిస్తూ భజనచేస్తూ బతకడం ఆవిడ రాజకీయ జీవితానికే. అవమానమని వరలక్ష్మి ఆ రాత్రంతా బాధపడిపోయింది. ఆ రాత్రంతా సుబ్బయ్యనాయుడు తన మాష్టర్ బ్రైన్‌తో ఆలోచించి ఓనిర్ణయానికి వచ్చి జి.యమ్. గారి ఇంటికి బయలుదేరాడు. అప్పటికే చిలకలదాసు వృత్తాంతమంతా జి.యమ్. అతని భార్య, అతని మామా వినివున్నారు. గతంలో దానుమీద పెంచుకున్న కోపమంతా కరిగిపోయింది.ఆ లాంటి సమయంలోనే నాయుడొచ్చి తన యధాశక్తివాదించి వాళ్లనికన్విన్స్ చేయడానికి ప్రయత్నించేడు.

"చూడండిసార్! జయాపజయాలు దైవాధీనాలు అంటారు. కానీ, ఎన్నికల విషయంలో మాత్రం జయాపజయాలు ఓటర్ల అధీనాలు. ఘనత వహించిన మహామహానాయకులే కొన్ని

కొన్ని ఎలక్షన్‌లలో ఛావు దెబ్బలు తినాల్సొచ్చింది. ఈ విషయం ఎందుకు చెపుతున్నానంటే మొన్న ఎలక్షన్లో గెలవడం మా అక్క గొప్పతనమూకాదు, ఓడిపోవడం మీ తక్కువతనమూకాదు. అదంతా ఓ టైమ్! నిజానికి మిమ్మల్ని గెలిపించడానికి మా బావ చాలా ఎక్కువ కష్టపడ్డాడు. కాకపోతే మా అక్క మా వార్డులో అందరికీ తెల్సిన మనిషి అవడం, మీరు కొత్త మనిషి కావడం వల్ల గెలుపు మాకే లభించింది. అయినా, కొంతమంది నాయకులుతమ ప్రాంతంలో తమ పార్టీ కేండేటు ఓడిపోతే, దానికి నైతిక బాధ్యత వహిస్తూ తమ పదవికి రాజీనామా చేస్తారు. అలాగే మా బావ కూడా మీ ఓటమికి నైతికబాధ్యత వహిస్తూ ఉద్యోగానికి సెలవుకూడా పెట్టకుండా అడవులకి వెళ్లి తపస్సు ఆరంభించేడు. ఇక్కడ మీ చేత నమ్మకద్రోహి అనిపించుకున్నవాడు అడవికెళ్లి పోలీసులచేత దొంగా అనిపించుకున్నాడు. కోర్టుకొచ్చి, వున్నపరువు కాస్తా పోగొట్టుకున్నాడు. మా బావ మీ పట్లతప్పుచేశాడని నేను అనను. అయినా అతను తప్పుచేశాడని మీరు భావిస్తే అందుకు పరిహారం కూడా జరిగిపోయినట్టే అని నేను మనవి చేస్తున్నాను''

సుబ్బయ్యనాయుడి వాదన వృధాపోలేదు. ఆ ముగ్గురూ మెదడుతో ఆలోచించేరు. మనసుతో నిర్ణయించేరు. ''చిలకలదానుకోసం ఇవాళే ఓమేనేజరు పోష్టు క్రియేట్ చేసి రేపే అతన్ని ప్రమోట్ చేస్తాను''అన్నాడు జి.యమ్. నిమిషాల మీద సుబ్బయ్యనాయుడు చిలకలదానునిదేవాలయంనించి ఇంటికి తీసుకొచ్చేడు, స్నానాలు చేయించేడు, భోజనంతినిపించేడు, నవ్వుతూ కబుర్లు చెప్పేడు. మర్నాడు చిలకలదానుకి నీటుగా బట్టలు తొడిగి ఆఫీసుకి తీసుకువెళ్లాడు.

అప్పటికే జి.యమ్.గారు చాలా పెద్దసైజు పూలదండ, ఓ శాలువా రెడీ చేసేరు. అక్కడ జి.యమ్.గారి భార్య ఆవిడ తండ్రి వరదరాజులుకూడా కనిపించేసరికి చిలకలదాను మరింత సంతోషించేడు.''చూసేవా బావా... మనం ఏం ఏర్పాటు చేసినా ఇంతఘనంగా వుండాల్సిందే''అంటూ సుబ్బయ్యనాయుడు భుజాలు ఎగురవేసేడు. జి.యమ్.గారు దానుని హాలు మధ్యలో నిలబెట్టి,వరదరాజులు చేత శాలువా కప్పించి దండవేయించేడు. అందరూ హర్షధ్వానాలు చేసేక జి.ఎమ్.గారు చిరునవ్వు నవ్వుతూ చిన్న వుపన్యాసం ఇచ్చేడు.

''డియర్ ఫ్రెండ్స్, ఎలకలపూడి చిలకలదానుగారు చాలా విచిత్ర మనిషి. ఆయన జాతకమూ చాలా విచిత్రమైందే! ఆయన తనడెవలప్‌మెంట్‌కోసం ఎంత కృషి చేసారో ఆమధ్య ఓసారి మా సొంతవిషయంలో కూడా అంతే కృషిచేసేరు. అయినా ఆ కృషి ఫలితంమాత్రం మాకు దక్కలేదనుకోండి. అది మా బేడ్ లక్! ఆయనకి ఆఫీసులోవుండే సీనియార్టిబట్టి చూసినా, వ్యక్తిగా ఆయన మాకు చేసిన సహాయం బట్టి చూసినా ఆయనకి మేనేజర్‌పోష్ట్ ఇచ్చి సత్కరించాల్సిన ధర్మం నాకుంది. కానీ మన ఆఫీసులో ప్రస్తుతం మేనేజరు పోష్టులేదు. వున్న ఒక్క పోష్టు రంగారావుకిచ్చేసేను. ఇప్పుడేం చెయ్యడం? సత్యభామపారిజాత పుష్పం అడిగినప్పుడు శ్రీకృష్ణుడేం చేసేడు? దేవలోకంవెళ్లి ఇంద్రుడితో యుద్ధానికి సిద్ధపడి మరీ పారిజాతవృక్షాన్నితీసుకొచ్చేడు. ఒక్కపువ్వుకోసం ఆయన ఎందుకంత రిస్కు తీసుకున్నాడు?ఆ పువ్వు అడిగింది సత్యభామ కాబట్టి. అలాగే మన చిలకలదానుగారి విషయంలో నేనూ ఓ రిస్కు తీసుకున్నాను. నిన్నటికి నిన్న ఓ కొత్తపోష్టు క్రియేట్ చేసేను. ఇవాళ ఆయన చేతికి ప్రమోషన్ ఆర్డర్స్ఇవ్వడానికీ సమావేశాన్ని కూడా ఏర్పాటుచేశాను. కానీ...

అంతవరకూ అనర్గళంగా మాట్లాడుతున్న జి.యమ్.గారుఆగిపోయేరు. మాటలకోసం తడుముకుంటూ నీళ్లు నమిలేడు. చిలకలదానుకి ఆత్రం ఎక్కువైంది. తనకోసం ప్రత్యేకంగా పోష్టు క్రియేట్ చేసినమనిషి ప్రమోషన్ ఆర్డర్స్ ఇవ్వడానికెందుకు తటపటాయిస్తున్నాడు? సుబ్బయ్యనాయుడివైపు చూసేడు. అతనికీ ఏమీ అర్థంకానట్టుగా చూసేడు.

''నువ్వు చెప్పు మావయ్యా'' అన్నాడు జియమ్., తన మావ వరదరాజులుతో.

''ఈ ఆఫీసుకి జెనరల్ మేనేజరువి నువ్వే. నువ్వు చెప్తేనే బాగుంటుంది''

చిలకలదానుకి ఆత్రం ఎక్కువైంది. ఏవిషయం చెప్పడానికి వాళ్లు సందేహిస్తున్నారు?

జి.యమ్.గారు గొంతు సవరించుకుని మళ్లీ చెప్పనారంభించేడు.

"బిట్వీన్ కప్ అండ్ సిప్, దేరార్ సొమెనీ స్లిప్స్ అనే ఇంగ్లీషు సామెతవుంది. దాన్నే మనం తెలుగులో చేతికందింది నోటికందు తుందన్న గ్యేరంటీ లేదూ అని చెప్పు కుంటుంటాం. యిచ్చేవాడున్నా పుచ్చుకునేవా ళ్లక్కూడా అదృష్టం వుండాలంటారు. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే, యీ రోజుతో చిలకల దానుగారికి యాభైఎనిమిదేళ్లు పూర్తైపోయి రేప ట్నించి వారు రిటైరయిపోతున్నారు. ఆ సంగతి యివాళ ఆయన సర్వీసు చూసేక తెల్సింది"

అందరూ చప్పట్లు కొట్టేరు.

తెల్లగావుండే చిలకలదాను ముఖం నల్లబ డిపోయింది. కాళ్లలో వణుకు ప్రారంభమ యింది.

తను రిటైరయిపోతున్నాడా? ప్రమోషన్ కోసం తను క్షీరసాగరమథనం అంతటి మథ నంగావించేడు. అయినా, ఫలితాన్ని అందుకో కుండా రిటైరయిపోతున్నాడా? తను త్వరలో రిటైరయిపోతానని తెలుసు, కానీ, ఆ త్వరలో అనేకాలం యింత త్వరలో వచ్చేస్తుందని మాత్రం వూహించలేకపోయేడు.

సుబ్బయ్యనాయుడివైపు చూసినా, అతనూ పిచ్చిచూపులు చూస్తున్నాడుతప్ప, మరో సలహా ఏదీ చెప్పలేకపోయేడు. రెండురోజుల తర్వాత చిలకలదానుకి సడన్‌గా తనకి జోస్యం చెప్పిన స్వామీజీ గుర్తుకొచ్చేడు. తనకి మహ ర్దశ ఆరంభమయిందని అతను ఖచ్చితంగా చెప్పేడు. తన మాట తప్పయితే, తనకిచ్చిన ఫీజుని రిఫండ్ యిచ్చేస్తానని గూడా నమ్మ కంగా చెప్పేడు. గబగబా, ఆ స్వామీజీవున్న లాడ్జీ దగ్గరకి బయలుదేరేడు.

"మీరు నా భవిష్యత్తు గురించి చెప్పిందే మిటి? యిప్పుడు తగలడిందేమిటి?" అంటూ చిలకలదాను స్వామీజీని సీరియస్‌గా నిలదీ సేడు.

"నేనేం చెప్పేను" స్వామీజీ తాపీగా జవా బుచెప్పేడు.

"నాకు మహర్దశ ఆరంభమయిందన్నారు గదా"

"అవలేదా?"

"లేదు" అంటూ ఆనాడు జోస్యం చె ప్పించుకున్న నాటినించి, యిప్పుడు రిటైరయి నంతవరకూ ఏమేం జరిగేయో అన్నీ టకటకా చెప్పేసేడు. అంతావిన్నాక స్వామీజీ చిన్నగా నవ్వి అన్నాడు

"మహర్దశ అంటే అర్థం ఏమిటో తెలుసా నాయనా?"

"ఎందుకు తెలియదు?... ఆదశలో మని షికి అంతా మంచే జరుగుతుందని అర్థం"

"నీకూ అంతా మంచే జరిగిందిగా"

"ఏం జరిగింది నా పిండాకూడు?"

"నువ్వు అడవికెళ్లినా నిన్ను ఏ పులో, సింహమో తినెయ్యకుండా ప్రాణాల్తో మిగిలేవు. అది నీకు మంచి జరిగినట్టుకాదా? నిన్ను దొంగగా అనుమానించి పోలీసులు అరెస్టు చేసినా, కోర్టు నిన్ను నిర్దోషిగా భావించి విడు దల చేసింది. అది నీకు మంచి జరిగినట్టు కాదా?"

"ఏడ్చినట్టుంది, యిదేం మంచి జరగడం అనిపించుకోదు. నాకు ప్రమోషన్ వస్తుందన్నా రుగా, ఏదీ ప్రమోషను?"

"నువ్వు గుర్తించలేకపోయినా, నీకూ ఓ ప్ర మోషన్ వచ్చిందిగా!"

"ఏమిటది?"

"గతంలో నిన్ను మీ వీధిలో ఏమని పిలిచే వారు?"

"చీటీల వరలక్ష్మి మొగుడూ అని పిలిచే వారు"

"యిప్పుడేమని పిలుస్తున్నారు?"

"కార్పొరేటర్ వరలక్ష్మిగారి మొగుడూ అని పిలుస్తున్నారు"

"అలా పిలవడం నీకొచ్చిన ప్రమోషన్ కాదా?"

చిలకలదాను స్వామీజీని గుర్రుగా చూసి, అంతలోనే శాంతించి, మెల్లగా బయటకి నడి చేడు.

అతని పోరాటం ఆనాటితో అలా అంతమ యింది!









# పేరుకే మహారాణి అధికారాలు పరిమితం!

దేశాధినేతగా రెండవ ఎలిజబెత్ మహారాణి బ్రిటిష్ సామ్రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించి ఇప్పటికి రమారమి 38 ఏళ్లు. తన తండ్రి ఆరవ జార్జి మరణానంతరం ఆమె 1953లో నకల రాజలాంఛనాలతోఇంగ్లండ్‌మహారాణిగా సింహాసనం ఎక్కారు. అప్పటికి ఆమె వయ
స్సు కేవలం 27 సంవత్సరాలే. నిజం చెప్పా
లంటే తండ్రి అస్వస్థత కారణంగా ఆమె తన 25వ ఏటనుంచే రాచరిక బాధ్యతల్ని అనధికా
రికంగా నిర్వహిస్తూవచ్చారు.

ఇంగ్లాండ్ మహారాణి అంటే కేవలం బ్రిట
న్‌వరకే పరిమితం కాదు. ఆస్ట్రేలియా,


ఏడాది వయస్సులో ఎలిజబెత్ మహారాణి(1927)

బాహమా, బార్బెడో, కెనడా, ఫిజి, గ్రెనడా, జమైకా, మారిషస్, న్యూజిలాండ్, సెయింట్ విన్సెంట్, సాల్మన్‌వంటి దేశాలకు కూడా ఆమే మహారాణిగా వ్యవహరిస్తారు. అంతేకాదు కామన్‌వెల్తు రాజ్యాల కూటమికి కూడా ఇంగ్లాండ్ మహారాణి అధ్యక్షత వహించాల్సి ఉంటుంది. కామన్‌వెల్తు రాజ్యాల కూటమికి బీజం 1926లోనే పడింది. అయితే అప్పటిలో బ్రిటిష్ సింహాసనం పరిధిలోకి వచ్చే రాజ్యాలవరకే కూటమి పరిధి పరిమితం చేయబడింది. ఆ తర్వాత 1949లో దాని పరిధి విస్తరించడం, ఇతరత్రా స్వతంత్ర దేశాలు కూడా అందులో సభ్యత్వం తీసుకోవడం జరిగింది. భారతదేశం కూడా అప్పుడే కామన్‌వెల్తు సభ్యత్వం పుచ్చుకోవడం జరిగింది. ప్రస్తుతం ఆస్ట్రేలియా, బాహమా, బంగ్లాదేశ్, బార్బాడోస్, బోట్స్వానా, బ్రిటన్, కెనడా, సైప్రస్, డొమినికా, ఫిజి, జాంబియా, ఘనా, గ్రెనడా, గయానా, భారత్, జమైకా, కెన్యా, కిరిబాటి, లెసోతో, మాల్వి, మలేషియా, మాల్టా, మారిషస్, నౌరు, న్యూజిలాండ్, నైజీరియా, పపువాన్యూగినియా, సెయింట్ లూసియా, సెయింట్ విన్సెంట్, సింగపూర్, శ్రీలంక, స్విట్జర్లాండ్, టాంజానియా, టోంగా, ట్రినిడాడ్, టొబాగో, ఉగాండా, జింబాబ్వే, సాల్మన్ దీవులు మొదలైన ఎన్నో దేశాలు కామన్‌వెల్తు కూటమిలో ఉన్నాయి.

రెండవ ఎలిజబెత్ మహారాణి ఏప్రిల్ 21, 1926న జన్మించారు. అప్పుడామె పేరు అలెగ్జాండ్రామేరీ. చక్రవర్తి కుమార్తెగా ఆమె బాల్యంలోని చాలాభాగం లండన్‌లోనే గడచిపోయింది. చదువుతోపాటు చిత్రలేఖనం, సంగీతం కూడా ఎంతో ఉత్సాహంగా అభ్యసించారు. చిన్నతనంనుంచి ఆమె ఈత, గుర్రపు స్వారీలపట్ల కూడా ఎక్కువ ఉత్సాహం ప్రదర్శించేవారు. ఎలిజబెత్ పెద్దవుతున్నకొద్దీ ప్రజలతో సంబంధబాంధవ్యాల్ని పటిష్టం చేసుకోవడం మొదలుపెట్టారు. ఆమె తన 14వ ఏటనే రసవత్తరమైన రేడియో ప్రోగ్రామ్‌నొకదాన్ని యిచ్చి అనేక మందిని ఆకట్టుకున్నారు. 1942లో అంటే తన 16వ ఏట గ్రెనేడియన్ గార్డ్స్ కల్నల్‌గా ఎంపికయ్యి రెజిమెంటు మొత్తాన్ని తనిఖీచేశారు. ఆ తర్వాత తన 18వ ఏట 'కౌన్సిలర్ ఆఫ్‌ది స్టేట్స్'గా నియమితురాలయ్యారు. ఆ కాలంలోనే తన తండ్రి విదేశీ పర్యటనకు వెళ్లిన సందర్భంగా తొలిసారిగా బ్రిటిష్ చక్రవర్తి బాధ్యతల్ని కూడా ఆమె సమర్థవంతంగా నిర్వర్తించారు.

1945లో బ్రిటిష్ రీజనల్ ఆర్టిలరీ ఆర్మీకి ఎలిజబెత్ ఉపనాయకురాలి హోదాను పొందగలిగారు. రెండవ ప్రపంచయుద్ధం ముగిసేనాటికి ఆమె 'జూనియర్ కమాండర్' పదవిని సాధించారు. అయితే రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఆమె దృష్టి సైనికహోదాల నుండి సమాజ సంక్షేమంవైపు మరలింది. ఆ కారణంగా అప్పటినుండీ ఆమె సంఘసంక్షేమ కార్యక్రమాల్ని నిర్వహించడం మొదలెట్టారు.

1947 నవంబర్ 20న ఫిలిప్ మౌంట్‌బాటెన్‌తో ఎలిజబెత్ వివాహం జరిగింది. ఫిలిప్ తండ్రి అండ్రూ్యా గ్రీకు చక్రవర్తి. నిజానికి అండ్రూ్యా విక్టోరియా మహారాణికి స్వయంగా మునిమనుమడేనట. భర్త అయిన ఫిలిప్ మౌంట్‌బాటెన్‌తో కల్సి ఎలిజబెత్ తొలిసారిగా




ఆట గుర్రంపై తన చెల్లెలు మార్గరెట్‌తో మహారాణి

1953లో ఎన్నో ప్రదేశాలు పర్యటించారు. ఇంగ్లాండ్‌మహారాణి భర్తగా ఫిలిప్‌ను 'డ్యూక్ ఆఫ్ ఎడింబరో'గా గౌరవించారు ప్రజలు.

ఎలిజబెత్ దంపతులకు ముగ్గురు మగ పిల్లలు, ఒక ఆడపిల్ల. తొలి సంతానం ఛార్లెస్ యువరాజు 1948లో జన్మించాడు. 1961లో నాటి రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆహ్వానంమేరకు మన రిపబ్లిక్‌డే ఉత్సవాలలో పాలుపంచుకునేందుకుగాను ఎలిజబెత్ మహారాణి తన భర్తతోకల్సి భారతదేశాన్ని తొలిసారిగా సందర్శించారు. అప్పుడే ఆమె మన దేశంలో చూడదగిన ప్రదేశాలనన్నింటినీ దర్శించడం జరిగింది. 1977లో తన వైవాహిక జీవిత రజతోత్సవాల సందర్భంగా ఎలిజిబెత్ మహారాణి 90,000 కిలోమీటర్ల దూరం పర్యటించివచ్చారు. ఆ పర్యటన ప్రధానోద్దేశం బ్రిటిష్ రాచరికపు వ్యవస్థ యొక్క గొప్పతనాన్ని దాని ఆవశ్యకతను ప్రజలకు చాటి చెప్పడమే తప్ప మరేంకాదు.

ప్రపంచ దేశాలలో అత్యధికశాతం దేశాలు రాచరికపు వ్యవస్థను నిరసించి, స్వస్తిపలికినప్పటికీ ఇంకా బ్రిటన్‌లో రాచరికం కొనసాగడం విచిత్రంగానే తోస్తుంది. అయితే అందుకు కారణాలుగా కొన్నింటిని చెప్పుకోవచ్చు. క్రీ.శ. 829లో ఎడ్వర్డ్ ప్రభువు అస్తవ్యస్థంగానున్న ఇంగ్లండ్‌లోని చిన్న చిన్న రాజ్యాలన్నింటినీ ఏకంచేసి ఒకే గొడుగు నీడకు చేర్చాడు. పటిష్టమైన పాలనా యంత్రాంగాన్ని ప్రవేశపెట్టి దేశాభ్యున్నతికి తోడ్పడ్డాడు. ప్రపంచదేశాలలో ఇంగ్లండ్‌ని అత్యున్నత స్థాయిదేశంగా తీర్చిదిద్దాడు. ఆరకంగా బ్రిటిష్ ప్రజల హృదయాలలో అక్కడి రాజవంశం సుస్థిరస్థానాన్ని



రెండవ ప్రపంచయుద్ధ కాలంలో గైడ్ యూని ఫారంలో దర్శనమిస్తున్న ఎలిజబెత్ *(1944)*

ఏర్పరుచుకోగలిగింది. తదాదిగా అంటే ఇప్పటికి 1000 సంవత్సరాలనుంచీ అక్కడ రాచరిక వ్యవస్థ పరిఢవిల్లుతూ వస్తోంది. మధ్యలో కేవలం ఒక్కసారిమాత్రం 11 సంవత్సరాలపాటు (1949-1660) క్రామ్‌వెల్ కాలంలో అక్కడ ప్రజాప్రభుత్వం నడిచింది.

రాచరిక వ్యవస్థ ఆవిర్భవించిన 400 ఏళ్ల తర్వాతే బ్రిటీష్ పార్లమెంటు ప్రాదుర్భవించింది. అంతకు ఒక నూరేళ్లకు పూర్వం బ్రిటీష్ న్యాయవ్యవస్థ రూపుదిద్దుకొంది. అందుకే ఆధునికతతోపాటు సనాతన తత్వాన్ని కూడా విపరీతంగా గౌరవించే బ్రిటీషర్లకు తమ రాచరిక వ్యవస్థపై మోజు ఏమాత్రం తగ్గలేదు. అయితే మారే కాలాన్ని ఆపడం ఎవరితరం? 17వ శతాబ్దంలో బ్రిటీష్ పార్లమెంటుకీ, రాచరిక వ్యవస్థకు మధ్య తీవ్రస్థాయిలో రాజకీయ పోరాటం జరిగింది. అందుకే ఆదేశం 'ప్రజాస్వామిక రాచరిక దేశం'గా పేరు తెచ్చుకుంది. అయితే ఎన్ని ఒడిదుడుకులెదురైనా వారసత్వంగా వస్తున్న బ్రిటీష్ రాచరిక వ్యవస్థ స్థిరంగా నిలబడగలిగింది. చివరికి మంత్రిమండలిలో ఎవర్ని నియమించాలన్నా ఎవర్ని తొలగించాలన్నా రాజప్రతినిధుల యిష్టానుసారమే జరిగిపోయేది. ఆ పరిస్థితి 18వ శతాబ్దాంతంవరకూ మాత్రమే చెల్లుబాటైంది.

అయితే 19వ శతాబ్దాంతానికి వచ్చేసరికి పరిస్థితులు పూర్తిగా తారుమారైపోయాయి. రాజప్రతినిధుల అధికారాలు నామమాత్రంగానే తయారయ్యాయి. పాలనాధికారాలు ప్రజాస్వామ్యబద్ధంగా ప్రజలెన్నుకున్న పార్టీకి,



మహారాణి ప్రత్యేక ఓడలో భర్త ఫిలిప్పుగారి గది



భర్త 'డ్యూక్ ఆఫ్ ఎడింబరో'తో ఎలిజబెత్ మహారాణి

దాని మంత్రిమండలికి మాత్రమే సంక్ర మించాయి. ఆ మంత్రిమండలి ప్రస్తుతం బ్రిటీష్ మహారాణిపేర ప్రభుత్వం నడుపు తోంది. కేవలం మంత్రిమండలి సూచనలకు అనుగుణంగా వ్యవహరించడమేతప్ప, ఎలిజ బెత్ మహారాణి స్వతంత్రంగా వ్యవహరించడా నికిగానీ, నిర్ణయాలు తీసుకోడానికిగానీ అవ కాశం లేదు. పాలనాపరమైన నిర్ణయాలు మొ త్తం మంత్రిమండలి గుప్పిట్లోనే ఉంటాయి. మంత్రిమండలి చెప్పినదానికల్లా తల ఊప డంతప్ప మహారాణికి మరో గత్యంతరం ఉండ దు. కేవలం ఆమె ప్రారంభోత్సవాలకి, శంకుస్థా పనలకి, విదేశీ ప్రముఖులకు విందులు యివ్వడంవంటి పనులకు మాత్రమే తన అధి కారాల్ని పరిమితం చేసుకోవల్సిన పరిస్థితి ఏర్పడింది.

ఒక్కమాటలో చెప్పాలంటే, భారత రాష్ట్రప తిలా, రబ్బరు స్టాంపులా వ్యవహరించడంతప్ప మహారాణికి మరే అధికారమూ ఉండదు. అధి కారాలు మొత్తం తన అధీనంలో ఉంచుకొని మన ప్రధాని పెత్తనం చెలాయిస్తున్నట్లుగానే



ఏడాది వయసున్న యువరాజు ఛార్లెస్‌తో ఎలిజబెత్ (1949)



రాచఠీవికి మారుపేరు ఎలిజబెత్ మహారాణి

ఇంగ్లండ్‌లోనూ జరుగుతోంది. అయితే గతంలో రాజప్రతినిధులకు కొన్ని ప్రత్యేక అధి కారాలుండేవి. అవసరమైతే పార్లమెంటును ప్రశ్నించడానికి, చట్టాన్ని నిలుపుదల చేయడా నికి, తనకు యిష్టమైన వ్యక్తుల్ని 'హౌస్ ఆఫ్ లార్డ్స్'లో సభ్యులుగా నియమించడానికి, నేర స్థులకు క్షమాభిక్ష ప్రసాదించడానికి వారికి అధికారాలుండేవి. అయితే అవన్నీ యిప్పుడు కేవలం మంత్రిమండలి సూచనపైనే రాజప్ర తినిధి నిర్వర్తించాలి. ప్రస్తుతం ఎలిజబెత్ మహారాణి పరిస్థితి కూడా ఇంతే. నామమాత్రా వశిష్టమైన అధికారంతో మహారాణిహోదాలో







విండ్సర్‌కాజిల్ ముందు తన కుటుంబ సభ్యులతో ఎలిజబెత్ మహారాణి (1962)



కిరీటధారిణి ఎలిజబెత్ రజతోత్సవ మహారాణి

కొనసాగుతున్నారామె. మహారాణి తానైనప్పటికీ బ్రిటీష్ ప్రధానితోనూ, మంత్రిమండలితోనూ సుహృద్భావ వాతావరణం నెలకొల్పుకోవల్సిన అవసరం ఆమెకే అధికంగా ఉంది. అందుకే ఆమె బ్రిటన్ పార్లమెంటుతో సఖ్యంగా ఉంటూ వస్తున్నారు.

బ్రిటీష్ మహారాణిగా ఎలిజబెత్ సగటున ఏడాదికి 30,000 మంది ప్రముఖుల్ని కల్సు కుంటారు. జాతీయ, అంతర్జాతీయ సమావేశా లకు, యితరత్రా కార్యకలాపాలకు ఆమె హాజ రవుతుంటారు. అలాగే అత్యున్నతస్థాయి అవా ర్డుల ప్రదానం ఏటా బ్రిటీష్ మహారాణి చేతు లమీదుగానే జరుగుతుంటుంది. పాలనాప రంగా బ్రిటీష్ పార్లమెంటు రూపొందించిన చట్టాలు, కీలకమైన నిర్ణయాలు తదితర అంశా లన్నింటినీ లాంఛనంగానైనా పరిశీలించి ఆమోదముద్ర వేయవలిసిన ప్రధాన బాధ్యత కూడా మహారాణిదే. ఈ బాధ్యతలను అన్నింటినీ సక్రమంగా నిర్వర్తించవల్సి ఉండ డంవల్ల ఎలిజబెత్ మహారాణికి కుటుంబన భ్యులతో గడిపే అవకాశం చాలా తక్కువగా దొరుకుతుంటుంది. అయినప్పటికీ ఆమె



కనిష్ఠ పుత్రుడు
ప్రిన్స్ఎడ్వర్డ్‌తో మహారాణి *(1964)*





ముద్దుల కుక్కపిల్లతో తమ నివాసగృహంలో మహారాణి దంపతులు

సమయం చిక్కినప్పుడల్లా సరదాగా గుర్రపు స్వారీ చేస్తుంటారు. అలాగే 'డెర్బీరేస్'లపట్ల కూడా ఆమె మక్కువ చూపుతుంటారు.

రాచకుటుంబానికి, వారి వారసులకు అయ్యే ఖర్చులో దాదాపు 3/4 వంతు బ్రిటీష్ ప్రభుత్వమే భరిస్తుంది. రాచవంశీకులకు యిచ్చే భత్యాలు, వారి విహారయాత్రలకయ్యే ఖర్చులు, వారి నివాసాలలో పనిచేసే ఉద్యోగులకు, సేవకులకు యిచ్చే జీతభత్యాలు సర్వం ప్రభుత్వమే భరించాల్సి ఉంటుంది. ఇందులో వారసులకిచ్చే భృతులు భారీమొత్తంలో ఉంటాయని వేరే చెప్పనక్కరలేదు.

ఇవిగాక మహారాణికి యిచ్చే మొత్తాలు వేరే

చూడచక్కని జంట,
ఛార్లెస్ యువరాజు, లేడీ డయానా

ఉంటాయి. ఆమెకు విదేశీ పర్యటనలకోస
మనీ, విహారయాత్రలు వెళ్లడానికనీ ఒక ప్రత్యే
విమానమూ, ఓ పెద్ద ఓడ ఉన్నాయి. 'బ్రిట్టాని
యా' అనే ఆ ఓడ ఓ చిన్న రాజభవనంలా
ధగధగ మెరిసిపోతుంటుంది. దానికోసమని
ప్రత్యేకించి 22 మంది అధికారులు, 254





మంది అదనపు సిబ్బంది ఉన్నారు. ఆ సిబ్బంది జీతభత్యాలకు, వైమానిక దళ సిబ్బందికి అయ్యే ఖర్చులు మొత్తం ప్రభుత్వ ఖజానానుంచే చెల్లిస్తారు. ప్రస్తుతం ఎలిజబెత్ మహారాణి నివసిస్తున్న 'వాల్మోరల్' రాజసౌధంతోపాటూ బకింగ్‌హామ్ ప్యాలెస్, విండ్సర్ ప్యాలెస్, విండ్సర్ కాజిల్, సెంట్ జేమ్స్ పాలెస్, హాంప్టన్‌కోర్టు మొదలైన రాజభవనాల నిర్వహణకు, వాటిలో పనిచేసే సిబ్బంది జీతభత్యాలకు ఏటా లక్షలాది పౌండ్లు మంచినీళ్లలా ఖర్చవుతుంటాయి. ఆ వ్యయమంతా ప్రభుత్వం భరించకతప్పదు. రమారమి ఏడాదికి ఆ వ్యయమంతా కలిపి మొత్తం 50 లక్షల పౌండ్లవరకూ ఉంటుంది. అందులో మహారాణి స్థిర, చరాస్తులనుంచి, వ్యవసాయ క్షేత్రాలనుంచి వచ్చే మొత్తం రాబడి మూడునుంచి నాలుగు లక్షల పౌండ్లవరకూ ఉంటుంది. అదిపోను సుమారు 47 లక్షల పౌండ్ల భారం ఏటా బ్రిటీష్ ప్రభుత్వం తన నెత్తిన వేసుకోకతప్పడంలేదు.

"ప్రజల చెవులు పిండి వసూలుచేసే సొమ్ముని ఈ ఆధునిక కాలంలో కూడా రాజులకి, రాచకుటుంబాలకి, వారి విలాసాలకి ఖర్చు పెట్టడం న్యాయంకాదు" అని ప్రజాస్వామిక వాదులు కొందరు అడ్డుతగులుతున్నా జరిగిపోయేది జరిగిపోతూనేవుంది. అదేమంటే - రాజభక్తి రూపంగానే మనం మనదేశ భక్తిని నిరూపించుకోవాల్సి ఉంటుందని వాదిస్తారు చాలామంది సనాతన బ్రిటీష్ పౌరులు.

**మహారాణికి పదవీ విరమణ నియమం**



తన పుత్రుడు ప్రిన్స్‌విలియమ్‌తో లేడీ డయానా



ఛార్లెస్ యువరాజు జ్యేష్ఠపుత్రుడు:
భావి చక్రవర్తి ప్రిన్స్ విలియం (1982)

ఏమీ ఉండదు. అలాగే ఆమె స్థిరచరాస్థులపై వచ్చే రాబడిమీద ఎలాంటి ఆదాయపు పన్నులుగానీ, యితరత్రా పన్నులుగానీ వసూలు చేయడం జరగదు. ఇది కేవలం మహారాణికి మాత్రమే పరిమితం. ఆమె సంతతికిగాని, వారసులకిగానీ ఈ మినహాయింపు వర్తించదు. వారు మిగిలిన పౌరులులాగే అన్నిరకాల పన్నులు చెల్లించాల్సుంటుంది.

బ్రిటీష్ రాచరికం కేవలం వారసత్వంగానే లభిస్తుంది. చక్రవర్తికిగాని, మహారాణికిగానీ ప్రథమసంతానంగా పుట్టినవారికే ఆ అర్హత వస్తుంది. సమర్థుడైన ఒక రాజవంశీకుడు అధికారంలోకి రావడం అంత సులువుకాదు. అందుకెన్నో అవరోధాలు అడ్డుతగుల్తాయి. చక్రవర్తిగానీ, మహారాణిగానీ వారు బతికున్నంతకాలమూ ఆ పదవిలోనే ఉంటారు. ఆ తర్వాత వారి తొలి సంతానానికే అధికారం సంక్రమిస్తుంది. ప్రస్తుతం ఎలిజబెత్ మహారాణి వయస్సు 65 సంవత్సరాలు. తదనంతరం ఆమె పెద్ద కుమారుడైన చార్లెస్ యువరాజుకే సింహాసనమెక్కే యోగ్యత ఉంది. చార్లెస్ 1981లో లేడీడయానాని పెళ్లాడాడు. ఆ దంపతులకు 1982లో విలియం పుట్టాడు. ఛార్లెస్ తరువాత గద్దెనెక్కే అర్హత ప్రస్తుతం ప్రిన్స్ విలియం ఒక్కడికే ఉంది. అతను పుట్టక ముందు ఛార్లెస్ తదనంతరం సింహాసనాన్ని అధిరోహించడానికి 19 మంది వారసులు కా



భారతదేశాన్ని సందర్శించినప్పుడు ఢిల్లీలోని ఓ పాఠశాల ఉత్సవానికి పల్లకీలో హాజరవుతున్న మహారాణి (1983)



తమ వైవాహిక జీవిత రజతోత్సవాల సందర్భంగా మహారాణి ఆస్ట్రేలియా పర్యటన (1977)

1985లో పార్లమెంటు సమావేశాల్ని ప్రారంభిస్తూ ప్రసంగిస్తున్న మహారాణి

చుక్కుర్చున్నారు. వాళ్లంతా ఛార్లెస్ సోదరీసోదరులు, వారి పిల్లలే. కానీ యువరాజు తొలి సంతానంగా విలియం పుట్టడంతో వారి వారసత్వాలు అడుగునపడక తప్పలేదు.

ఛార్లెస్, డయానాల నడుమ ఈమధ్య ఏవో కలతలు అరంభమైనట్లు వార్తలొస్తున్నాయి. తమ 'పెళ్లిరోజు' వేడుకల్ని వాళ్లు ఇటీవల ఎవరికివారే వేరువేరుగా జరుపుకోవడమే అందుకు ప్రధాన సాక్ష్యం అంటున్నాయి లండన్ పత్రికలు.

-ప్రతాపచంద్ర





# చతుర కథలు

## టెలుగింగిలీష్

గోడ గడియారం ఐదుగంటలు కొట్టింది. ఆలోచనలతో సతమతమౌతున్న శాంత మనస్సు కుదుటపడింది. ఇంక భర్త వచ్చే టైమయిందని హడావుడిగా వంటింట్లో ప్రవేశించి టిఫిన్ కాఫీ తయారు చెయ్యడంలో నిమగ్నమైంది. కాఫీ కూడా కలిపి ఫ్లాస్కులో పోసేసి భర్త రాకకొరకు ఎదురు చూడసాగింది.

వీధి తలుపు చప్పుడవ్వడంతో ఒక్క ఉదుటునపోయి తలుపుతీసింది. ఫ్లాస్కు, టిఫిన్‌ప్లేటు తీసికొని ముందు గదిలోనికి వచ్చింది శాంత. బట్టలు మార్చుకొని, పేపర్ చదువుతున్న భర్తకు టిఫిన్‌ప్లేటు అందించింది. బజ్జీలు కనిపించగానే భార్యవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

శాంతకేమైనా కావాలని అనిపించినవుడు భర్త కిష్టమైన బజ్జీలు చేస్తుంది. ఐదేళ్ల కాపురంలో తనకు ఇది బాగా అనుభవమే కనుక ఏదో కోరిక కోరుతుందని గ్రహించాడు. టిఫిన్ తిని కాఫీ తాగేటప్పుడు మొదలుపెట్టింది గారాబంగా. "ఏమండీ... మరేమో మన వక్కింటి వనజాక్షి, ఎదురింటి కమల ఇంగ్లీష లోనే మాట్లాడు కుంటారు. వాళ్లింటికి ఎవరైనా వచ్చినా కూడా ఇంగ్లీషులోనే మాట్లాడతారని వాళ్ల వనిమనిషి చెప్పింది. మరి నేను కూడా ఇంగ్లీష నేర్చుకుంటానండీ" అంది.

"ఓ... భేమగ్గా ఉంటుంది నాకూ సంతోషమే కదా" అన్నాడు రఘురాం. కాసేపాగి "ఐనా... వాళ్లు ఆఫీసర్లుకదా. ఇతర రాష్ట్రాల నుండి ఉద్యోగ రీత్యా వచ్చారు. బదిలీల్లో వాళ్లు ఏ ప్రాంతానికైనా వెళ్లాల్సివుంటుంది. వాళ్లకి భాష సమస్యకాకుండా ఇంగ్లీష చాలా అవసరం. వారి వారి మాతృభాషలు వేరు కాబట్టి, వాళ్లు అలా ఇద్దరికీ తెలిసిన ఆంగ్ల భాషలో మాట్లాడుకుంటున్నారు. అలాంటివాళ్లు ఇంగ్లీష తప్పనిసరిగా నేర్చుకోవాలి కానీ ఆ కష్టం నీకెందుకోయ్?... నేను టీచర్‌ని కాబట్టి రాష్ట్రం మాట అటుంచి జిల్లా కూడా విడిచిపెట్టే ప్రశ్నేలేదు. ప్రస్తుతానికి నీవు తెలుగులో తప్పులు లేకుండా మాట్లాడితే చాలు. వినేది నేనే కదా" అన్నాడు రఘురామ్ నవ్వుతూ. భర్త ఏదో



సలహా చెబుతాడుగదా అని ఎదురు చూస్తున్న శాంతకి కోపం వచ్చింది. విసురుగా ప్లేటు, గ్లాసు, ఫ్లాస్క్ తీసికొని వంటింట్లోకి వెళ్లిపోయింది.

భార్యకి బాగా కోపం వచ్చిందని గ్రహించిన రఘురామ్ వంటింట్లోకి వెళ్లి,''మరి ఈరోజు బాగానే ఉంది. పలక, బలపం తెమ్మంటావా? లేక పుస్తకంలోనే అక్షరాలు దిద్దుతావా?''అని తన సహజ ధోరణిలో అడిగాడు.

శాంతకి వళ్లు మండిపోయింది. ''మీ టీచర్ బుద్ధి పోనిచ్చుకున్నారు కాదు. నేను చదువుకున్నాననీ, నాకు ఇంగ్లీషు చదవనూ, వ్రాయనూ వచ్చనీ మీరు మరచిపోయినట్లున్నారు. ఐనా మీ దగ్గర ఎవరు నేర్చుకుంటారు? నేను స్వయంగా నేర్చుకుంటాను. 'ఇంగ్లీషులో మాట్లాడటం ఎలా' అనే పుస్తకాలు బజార్లో చాలా ఉన్నాయి. అవి కొనుక్కొని నేర్చుకుంటానులెండి'' అంది శాంత ఉక్రోషంగా.

ఇహ, తాను చెయ్యగలిగింది ఏమీ లేదనుకుంటూ రఘురామ్ బయటికి వెళ్లిపోయాడు.

ఒకనెల తర్వాత బట్టలు కొనడానికి భర్తను బయల్దేరతీసింది శాంత. ఓ చీరల షోరూమ్‌లోకి ప్రవేశించారిద్దరూ.

''విల్ యు ప్లీస్ షోమి సం గుడ్ శారీస్?'' అంటూ మొదలుపెట్టిన శాంతవైపు విచిత్రంగా చూశాడు రఘురామ్. అంతలోనే అతనికి విషయం అర్థమయింది. కొన్ని చీరలు చూసిన తరువాత ''షోమి ది వన్ డిస్‌ప్లేయ్‌డ్ ఇన్ యువర్ షోకేస్?'' అన్న శాంత మాటలు అర్థంకాక తలగోక్కున్నాడు గుమాస్తా. రఘురామ్ సైగచెయ్యటంతో షోకేస్‌లోని చీరవట్టుకొచ్చాడు అతను. ఇంక శాంతకి మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా దానికి బిల్‌రాయించి చెల్లించేశాడు రఘురామ్.

షాపు బైటకొచ్చిన తర్వాత ''ఏమిటండీ మీకు మరీ తొందర? నిన్నంతా ''చీరల దుకాణంలో'' అనే పాఠం చక్కగా కంఠస్థంచేసి వచ్చాను. తీరా ఏమీ అడగకుండానే, నన్ను సరిగా మాట్లాడనివ్వకుండానే తీసుకువచ్చేశారు'' అంటూ నిష్ఠూరాలాడింది శాంత.

రఘురామ్ ''చూడు శాంతా! నువ్వు ఫారిన్‌లో లేవు. చక్కగా తెలుగులో మాట్లాడక ఎందుకొచ్చిన బాధ చెప్పు. నీ విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకో, కాదనను. కాని అవసరంలేని సందర్భాలలో అనవసరంగా మాట్లాడి 'సీన్' సృష్టిస్తే ఎలా?'' అన్నాడు.

మొఖం ముడుచుకుంది శాంత.

ఆ సాయంత్రం రఘురాం స్కూలునుండి వచ్చేటప్పుడు దారిలో పనిమనిషి కనిపించింది. పదిరోజులనుండీ రావడంలేదని ప్రొద్దున శ్రీమతి కోపంగా చెప్పడం గుర్తుకువచ్చి సంగతేమిటని పనిమనిషిని అడిగాడు రఘురామ్.

''ఏం చెప్పను బాబూ, అమ్మగారు అదేదో బాసలో మాటాడుద్ది నాకు తెలిసి చావడంలేదు. నాకు అదేటో తెలవక దిక్కులు చూస్తూ నిలబడితే, ఏందేందో అంటున్నారు. నేను మీ ఇంట్లో పనిచేయలేనండీ'' అంటూ వెళ్ళిపోయింది.

''హతోస్మి...'' అనుకుంటూ భార్య తన ఇంగ్లీషు సంభాషణా చతురతను తనపై ప్రయోగించనందుకు సంతోషిస్తూ ఇంటివైపు సాగిపోయాడు రఘురామ్.

తను ఇంట్లోంచి బయటికి కూడా ధారాళంగా వినిపిస్తున్న నవ్వులు ఎవరివో అర్థంకాక ఎవరబ్బా అనుకుంటూ హాల్లోకి ప్రవేశించాడు. అపరిచితులను చూసి కంగారుపడుతూ వంటింట్లోకి వెళ్లాడు.

అక్కడ శాంత బిక్కమొగంతో నిలబడి వుంది. భర్తని చూడగానే ''ఏమండీ, వాళ్లు మహిళామండలివాళ్లుమనవీధిలోనుండి వెళుతుంటే నేనే ఆహ్వానించి చందా ఇచ్చాను. తర్వాత ఏం తీసుకుంటారని అడిగాను. మామూలుగానే పుస్తకంలోలాగా వాళ్లు ఏం వద్దని అంటారనుకున్నాను. కాని వాళ్లు అలా గాక నేను చెప్పిన లిస్టులోనుండి తలా ఒకరకం చెప్పారు. అవన్నీ ఇప్పుడు మన ఇంట్లోలేవు ఎలా?'' అంటూ ఏడుపుముఖం పెట్టింది.

వంటగది షెల్ఫ్‌లోని పుస్తకంలో ''కొత్త ఫ్రెండ్‌తో ఎలా పరిచయం పెంచుకోవాలి'' అనే పేజీ మడత పెట్టివుంది.

ఈ దెబ్బతో భార్యకి తప్పకుండా జ్ఞానోదయ





మవుతుంది లెమ్మని మారుమాట్లాడకుండా దొడ్డివాకిలినుండి బయటికి వచ్చేశాడు రఘురామ్.

-జానకీబాయి

## ది ప్లాన్

క్లాసులో పాఠం చెప్పడం పూర్తిచేసి బెల్ మోగడంతో బయటికి వచ్చాను.

కారిడార్‌గుండా డిపార్ట్‌మెంట్ రూమ్‌కి నడుస్తూండగా, ఉన్నట్లుండి దూరంనుంచి 'డౌన్ డౌన్!వుయ్‌వాంట్ గుడ్‌బుక్స్' అన్న నినాదాలు వినబడ్డాయి.

అది విని చిన్నగా నిట్టూర్చాను. నిజమే.. పాఠ్యగ్రంధాలు భ్రష్టు పట్టిపోతున్నాయి. మంచి రచయితలే కరువయ్యారు. ఏదో రాయడం, దాన్ని చదివి వీళ్లిలా అరవటం జరుగుతోంది.

ఆ గుంపు నన్ను చూడగానే మరింత రెచ్చిపోతూ, "డౌన్ డౌన్ గణపతి, బ్యాన్‌బ్యాన్ 'కన్నెవయసు'" అంటూ బిగ్గరగా అరవసాగారు.

వెయ్యి వోల్టుల పవరున్న కరెంట్ తీగను ఒక్కసారిగా పట్టుకున్నంత షాకు నాకాక్షణంలో ఏర్పడింది.

నాపేరే గణపతి. మొన్నీమధ్య నేను రాసిన నవలపేరే 'కన్నెవయసు'!

అంటే... అంటే వీళ్ళు చేసే ఆందోళన పాఠ్యగ్రంధాలను గురించికాక నాగురించేనన్నమాట!

నా 'కన్నెవయసు' నవల మార్కెట్‌లోకి విడుదలయి పదిరోజులు కూడా కాలేదు. అప్పుడే దాన్ని చదివేసినట్లు వీళ్ళు ఆందోళన మొదలు పెట్టారు. ఎంత ధైర్యం వీళ్లకి!

అసలు రచయితలంటే ఏమనుకుంటున్నారు వీళ్లు? ఎంతో కష్టపడి రాసిన నవల ఇంకా సరిగ్గా జనంలోకి వెళ్లకముందే నిషేధించాలా?

నా ఆలోచనలో నేనుండగానే ఆ గుంపు నన్ను చుట్టుముట్టి, నినాదాలు ఇవ్వసాగింది.

"ఏమిటిదంతా?" అని అడిగాను.

"అంతా తెలిసి కూడా అలా ఏమీ ఎరగనట్లు నటించకండి సార్. క్లాసులో నీతులు బోధించే మీరు అటువంటి నవలని ఎలా రాశారు?" ప్రశ్నించాడు సురేష్.

"కాగితం, కలం మీచేతిలో ఉన్నంతమాత్రాన మీ మెదడుకు ఏదితోస్తే అది రాసెయ్యడమేనా?" ఆవేశంగా అడిగాడు కృష్ణ.

"అంత అశ్లీల నవలని రాయడానికి మీకు మనసెలా ఒప్పిందిసార్?" అంది సరళ.

సుధాకర్ ఆవేశంగా ముందుకు వచ్చి "ఈ క్షణమే ఆ నవల కాపీలన్నీ కుప్పగాపోసి మాకళ్లముందు తగలబెట్టాలి. లేకపోతే..." అంటూ ఆగిపోయాడు.

వాళ్ళు మాట్లాడుతున్నది ఒక్కటి కూడా నాకు అర్థంకావడంలేదు. నా నవలలో అశ్లీలం ఉందా?

"ఆవేశం తగ్గించుకోండి. ఆ నవలలో మీకు అసభ్యత ఎక్కడ కనబడిందో ముందు చెప్పండి" అని అభ్యర్థించాను.



"అదంతా మాకు తెలియదు. అసలు అలాంటి చెత్త నవలని మేము చదువుతామని ఎలా అనుకున్నారు?" ముక్తకంఠంతో ప్రశ్నించారందరూ.

వీళ్ళలో చాలామంది నన్ను అభిమానించే విద్యార్థులే. మరి వీళ్ళని రెచ్చగొట్టి నా మీదకి ఉసిగొల్పినవారు ఎవరో?

"మీరు నా నవల చదవలేదని అంటున్నారు. కానీ అది అశ్లీలంగా ఉందని మళ్ళీ మీరే అంటున్నారు. చదవకుండా ఒక నిర్ణయానికి వచ్చేసి ఇలా ఒక రచయితని అల్లరిపెట్టడం మీకు తగునా?" అన్నాను.

"ఆ నవల చదవనవసరంలేదు. దానిపేరు వినగానే అదెలాంటి కథో అర్థమవుతోంది" అన్నారు శుభ, నాగమణి.

"'కన్నెవయసు' నవల కుర్రకారుని వెర్రెత్తించేస్తోంది. ఆ నవల చదివినవాళ్ళు రంగుల కలల్లో తేలిపోతున్నారు. యువకులలో సెక్స్ భావనలను రేకెత్తించేస్తోంది మీ 'కన్నెవయసు'" అని చెప్పాడు శ్రీను.

"అందుకే రేపు ఉదయం పది గంటలకు మన కాలేజీ కాంపస్‌లోమీ ఇంట్లోవున్న నవల కాపీలన్నీ తెచ్చి తగలబెట్టాలి. లేకపోతే మేమందరం మీ ఇంటికివచ్చి, మీరు తలుపులు వేసుకున్నాసరే వాటిని బద్దలుకొట్టి మరీ నవలలన్నీ పెట్రోలుపోసి తగలబెడతాం" అని అల్టిమేటం ఇచ్చేసి మరోసారి నినాదాలు ఇస్తూ వెళ్ళిపోయారందరూ.

నవల కాపీలు మా ఇంట్లో ఉన్నమాట వాస్తవమే. ఆ నవలలో ఈకాలం పాఠకులకు కావల్సిన సెక్స్, వయొలెన్స్ ఏమీలేవనీ, నవల చప్పగా ఉందనీ పబ్లిషర్స్ అంతా దాన్ని తిరస్కరించారు. దాంతో పాతికవేలు అప్పుచేసి మరీ వాటిని ప్రింట్‌చేయించాను. వంతంకొద్దీ అలా చేశానుకానీ ఏవో కొద్ది కాపీలు తప్ప మిగిలినవన్నీ అమ్ముడుకాక ఇంట్లో అలాగే పడివున్నాయి.

ఇంటికి వెళ్ళగానే ఈ విషయం మా ఆవిడకు చెప్పాను.

ఆమె అంతా విని - "అయితే ఒక పని చెయ్యండి. మూడురోజులపాటు మీరు వాళ్ళకి కనబడకుండా ఎక్కడికన్నా వెళ్ళండి. మిగతా విషయాలు నేను చూసుకుంటాను" అని సలహా ఇచ్చింది.

ఆవిడమీది నమ్మకంతోనూ, చేసేది మరేంలేకా మా ఆవిడకు చెప్పాల్సిన జాగ్రత్తలన్నీ చెప్పి, ఇంట్లోంచి బయటపడ్డాను. నా బాల్యస్నేహితుడు ప్రకాష్ ఇంటికి వెళ్ళి ఆ మూడురోజులూ అక్కడే ఉన్నాను. నాలుగవరోజు ఇంటికి తిరిగి వచ్చాను.

ఇంట్లో పిల్లలతో శ్రీమతి ఒక్కతే ఉంది. ఆ పోకిరి వెధవలు వచ్చి నేను లేనని తెలిసి ఏం అల్లరి చేశారో? వీళ్ళని ఎంత భయపెట్టారో? దారిలో ఇదే ధ్యాస నాకు.

ఇంట్లోకి వెళ్ళగానే శ్రీమతి నవ్వుతూ కనిపించేసరికి మనసు కుదుటపడింది.

తర్వాత లోపలిగదిలోకి వెళ్ళి చూశాను. అక్కడ ఒక్క పుస్తకం కూడా కనిపించకపోయేసరికి గతుక్కుమన్నాను. "అనుకున్నంతా అయింది. ఆ వెధవలు ఒక్క పుస్తకం కూడా వదల్లేదల్లేఉంది" అన్నాను శ్రీమతితో.

ఆమె పకపకా నవ్వింది.

"అయినా సాహితీ విలువలు దట్టిస్తూ మీరు రాసే నవలలు ఈరోజుల్లో ఎవరు చదువుతారండీ? వాళ్ళకి సెక్స్, సస్పెన్స్, వయొలెన్స్ కావాలిగానీ. అవేమీ లేని మీ నవల హాట్‌కేకుల్లాగా అమ్ముడు పోవడానికి నేనే ఓ. ప్లాన్ వేశాను. మనవాళ్ళు సాగించిన ఉద్యమానికి పత్రికలవాళ్ళు మంచి పబ్లిసిటీ ఇచ్చారుగదా! దాంతో ఆ నవలలో ఏదో గొప్ప అశ్లీలత ఉందనుకుని పుస్తకాల షాపులవాళ్ళు చాలామంది మన ఇంటికి వచ్చి మరీ ఆ నవల కొనుక్కుపోయారు. మూడురోజుల్లో స్టాకంతా ఫినిష్. మీకు పదివేలు లాభం" అని మళ్ళీ నవ్వింది శ్రీమతి, బీరువాలోని నోట్లకట్టలు చూపుతూ.

—వినాయకరావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291 Anantapur-22977

